# చతుర

సంపుటి: 3 – సంచిక: 11
డిశంబర్: 1980



## ఈ నెల సమగ్ర నవల

స్త్రీ సహజమైన కోరికలూ, సుఖాసుభూతులూ, చాపల్యాలూ మచ్చుకు కూడా లేవు ఆమెలో ఆశయ సాధన కోసం అన్నీ త్యాగం చేసేందుకు ఆమె వెనుకాడదనే సంగతి సుస్పష్టం. అయినా అతను ఆమె ఆకర్షణలో పడ్డాడు. గాఢంగా ప్రేమించాడు. ఆమె క్రీగంటి చూపు కోసం...సుతిమెత్తని మాట కోసం...కలవరించేడు. ఆమె చిరునవ్వుల వెన్నెల వర్షంలో తనివితీరా తడవాలని కోరుకున్నాడు.

తననే నమ్ముకుని పెంచి పెద్దచేసిన మేనత్తని కూడా వదులుకుని ఆమెను తన జీవితంలోకి ఆహ్వానించేడు. లోకాన్ని కూడా ఎదిరించేందుకు సిద్ధపడ్డాడు. అతని ఆహ్వానాన్ని మరి ఆమె ఆమోదించిందా?

## ఒంటరిగీత బొమ్మ

వంటి ఆమెలో అతను కోరుకున్న ప్రేమైక హృదయం సాక్షాత్కరించిందా? ఉత్తర, దక్షిణ ధృవాల్లాంటి యిద్దరు వ్యక్తుల ప్రణయాన్ని మహోజ్వలంగా మలిచిన ప్రసిద్ధ రచయిత

**ఆర్.కె. నారాయణ్**

**నవల 'పెయింటర్ ఆఫ్ ది సైన్స్'కు**

**ఓలేటి శ్రీనివాసరావు భాను**

సమర్థవంతమైన అనువాదం

ఈ నెల చతుర సమగ్ర

నవల

ముఖచిత్రం : ఎస్. శివన్నారాయణ
రెండవ కవరు : జి. రామచంద్రరావు
మూడవ కవరు : మోహన్ శర్మ

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 - 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతున్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

చతుర
ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ - 500 004.

# మీ జీవితంలో చీకటి పోవాలంటే

## ఇది చదవండి

రాత్రిపూట ఉన్నట్టుండి కరెంటు పోయింది. ఇల్లంతా కల్లోలమయింది. పిల్లలు ఎక్కడివాళ్ళక్కడే గొల్లుమన్నారు. గావు కేకలు పెట్టారు. కారణం? చీకటి, చిమ్మ చీకటి, కన్ను పొడుచుకున్నా కనిపించని కటిక చీకటి. చీకటి అంటే భయం. అది సహజం. అందుకే వెలుగుకోసం ప్రాకులాట, అగ్గిపెట్టె కోసం తడుములాట. చిమ్మ చీకట్లో చిన్న అగ్గిపుల్ల గీస్తే వెలుగు కలుగుతుంది. చీకటి పోతుంది.

వెలుగును చూస్తే చీకటికి భయం. అందుకే వెలుగు కలుగగానే చీకటి పోతుంది. ఆ వెలుగు వెళ్ళిపోగానే చీకటి అలుముకొంటుంది. అంతేగాని చీకటి పోగానే వెలుగు రావడంకాదు. చీకటి తనంత తానుగా వెళ్ళిపోదు. అంచేత చీకటి పోవాలంటే వెలుగు రావాలి. అది కావాలి. లేకపోతే చీకటి భయం పుట్టిస్తుంది. అలాగని చెప్పి చుట్టూఉన్న చీకటిని చూసి భయపడుతూ తిట్టుకొంటూ కూర్చోడం కంటే ప్రయత్నించి ఓ చిన్న దీపం వెలిగించుకొంటే చీకటి చెదిరి పోతుంది. భయం తొలగిపోతుంది.

మనిషి జీవితాన్ని ఆవరించే అంధకార పరిస్థితులు ఎన్నో ఉంటాయి. ఆ కారణంగా ఆ మనిషి జీవితంలో భయం తిష్టవేస్తుంది. ఆ హృదయంలో కాపురం చేస్తుంది. ఇక్కడో మాట చెప్పాలి. అదేవిటంటే మనిషిలో భయంకర చీకటి సృష్టించేది మరణ భయం. మానవ భయాందోళనలన్నింటికి హేతువు మరణ భయం. ఉదాహరణకు ఉద్యోగం లేకపోతే, ఆదాయం రాకపోతే, అన్నం దొరక్కపోతే మంచం పడితే, మళ్ళీ లేవకపోతే – చావాల్సిందే? పోనీ ఇవన్నీ ఉన్నాయనుకొంటే అమ్మబాబోయ్, బి.పి. వస్తుందేమోనని భయం. వస్తే చస్తామేమోననే భయం. ఇలా భయాందోళనలకు గురిచేస్తూ మనచుట్టూ ప్రబలుతుండే మన పరిస్థితులు మన జీవితాల్లో చీకటిని సృష్టిస్తుంటాయి. ఆ చీకటిలోంచి మనం బయటపడేంతవరకు, వెలుగు చూసేంతవరకు భయం, అశాంతితో కృంగిపోతూనే ఉండాలి. లోకానికి వెలుగైన ఆ లోకకళ్యాణ మూర్తిని గూర్చి తెల్సుకొనేందుకు ప్రయత్నించడం మనల్ని ఆవరించిన అంధకారంలో ఓ చిన్న దీపం వెలిగించేందుకు ప్రయత్నించడమే అవుతుంది. ఆ యేసు దేవుని విశ్వసించి ఆయన విరజిమ్మే వెలుగును సంతరించుకోవడం మన జీవన జ్యోతిని వెలిగించుకోవడమే అవుతుంది. ఆయనే వెలుగు కనుక ఆయన మనలో ఉంటే మనలో చీకటి ఉండదు. చీకటి లేకపోతే భయమూ ఉండదు. భయం అంటూ ఏదీ ఉండకపోవడమేగా శాంతి సంతోషాలకు సంకేతం. **బి. వి. ప్రతాప్ కుమార్**

లోకానికి వెలుగైన ఆ పావనమూర్తి యేసు ప్రభువుని గూర్చి చక్కగా తెలియజేసే 300 పేజీల సద్గ్రంథం కోసం నేడే మాకు రాయండి. పోస్టేజితో సహా ఆ గ్రంథాన్ని మా కానుకగా మీకు పంపిస్తాం.

**ఏ. ఎం. జి.,** పోస్టు బాక్సు 1820, హైదరాబాద్-500 020.

# రేప్

"ఛీ ! వదులు..."

సెకెండ్ షో సినిమా చూసి, స్టైయిల్‌గా సిగిరెట్ పొగపీల్చి వదులుతూ ముందుకు సాగిపోతున్న మూర్తికి రోడ్డు పల్లంలోనుంచి ఓ ఆడపిల్లగొంతు వినిపించి కాళ్లాగిపోయాయి.

"హి హి హీ !" నవ్విందొక కచుకు గొంతు. "మోజుపడి తెచ్చుకున్న సిన్నదాన్ని యిడిసిపెడతానుటే" అంది మరో బొంగురుగొంతు సన్నగా నవ్వుతూ.

రౌడీ వెధవలెవరో ఓ ఆడపిల్ల మీద అత్యాచారం చేయబోతున్నారని గ్రహించాడు మూర్తి. ఉద్రేకం తన్నుకొచ్చింది. తను చూసేన సినిమాలోని హీరోలాగ ఆమెను రక్షించాలి. వాళ్ళను ఎదుర్కొని, చితుగా తన్ని, ఆమెను కాపాడి అప్పుడు ఆమె కళ్ళలో కృతజ్ఞతా భావంతో మెరిసే మెరుపును చూడాలి.

రోడ్డు పల్లంలోకి నడిచాడు. చీకటిగా వుంది. మనుషులు మసగ్గా కనిపిస్తున్నారు. "ఏయ్ ! ఎవరక్కడ?" అరిచాడు వాళ్ళనుద్దేశించి.

వెంటనే రిప్లై వచ్చింది విసురుగా.

"ఎవడు బే నువ్వు?"

మూర్తికి కోపం వచ్చింది. ఒళ్ళు మండింది.

"రేయ్! మర్యాదగా ఆమెను విడిచి పెట్టండి. లేకపోతే..." పిడికిలి బిగించి





యుద్ధానికి తయారవసాగాడు.

"ఏం చేస్తావ్‌బే ! తెలుగు సినిమా చూసి వస్తున్నట్టున్నావ్. వచ్చిన దారిన వెళ్ళు. లేకపోతే నీ ఒళ్ళు హూనం ఖాయం" మరో గొంతు వినిపించింది.

అయినా మూర్తి బెక్కు చెదరలేదు. వాళ్ళమీద ఆవేశంగా విరుచుకు పడాలను



కుంటుండగా ఆమె అంది – "మీరైనా న్యాయం చెప్పండి బాబూ ! ఇద్దరు మనుషులకని సాతిక [illegible] ఒప్పుకుని, ఇప్పుడు ముగ్గురని దౌర్జన్యం [illegible]న్నారు..."

# అరత్హా

శ్రీహరికి పెళ్ళీడు వచ్చింది. పై సంబంధాలు చూడలేదు శ్రీహరి తండ్రి.

# కతలు ..

చిన్నప్పట్నుంచీ అనుకుంటున్న మేనమామ కూతురు రాధిక వుండనే వుంది. కాని, శ్రీహరి రాధికను పెళ్ళి చేసుకోనన్నాడు. శ్రీహరి తండ్రికి కోపంవచ్చింది బంగారంలాంటి సంబంధం వద్దంటున్నందుకు.

"ఏమైనాసరే రాధికను నువ్వు పెళ్ళి




చేసుకుని తీరాలి"

"చేసుకోను" ఖచ్చితంగా తెగేసి చెప్పాడు శ్రీహరి.

"ఏం?"

"నేను రాగిణికి మనసిచ్చాను గనుక" చెప్పాడు శ్రీహరి.

"రాధిక చిన్నప్పట్నుంచి నీ భార్య అనుకుంటున్నదేగా. రాధికకు ఏంలోపమని ఆ పిల్లకు మనసిచ్చావ్?"

"రాధికకు ఎందులోనూ తీసిపోదు రాగిణి"

"రాధిక డిగ్రీ చదివింది. ఆపిల్ల..."

"పోస్టుగ్రాడ్యుయేట్" భుజాలెగరేశాడు శ్రీహరి.

"కట్నం పాతికవేలు"

"రాగిణి తల్లి దండ్రులకు ఒక్కగానొక్క కూతురు. వాళ్ళ తర్వాత ఆస్తి అంతా రాగిణిదే"

"రాధిక బంగారు బొమ్మ!"

"రాగిణి మాత్రం వెండిబొమ్మా, బంగారు బొమ్మే"

కొడుకును ఎలా ఒప్పించాలో తెలియలేదు శ్రీహరి తండ్రికి. తనెన్ని చెప్పినా అంతకంటే మించిన అర్హతలున్నాయంటున్నాడు.

చివరికి యిలా అన్నాడు-

"అయినా సరే రాధికను పెళ్ళి చేసుకోవాలి. రాధిక ధనవతి, గుణవతి, కులవతి"

"నాన్నగారూ! రాధిక ధనవతి, గుణవతి, కులవతి గావచ్చు. మరి నేను ప్రేమించిన రాగిణి ధనవతి, గుణవతి, కులవతే గాకుండా గర్భవతికూడా..."

—అంధవరపు మల్లిబాబు

# భయానికి మందు

భద్రయ్యకి మధ్య భయం ఎక్కువగా పట్టుకుంది. కూతురి పెళ్ళి కాలేదని, కొడుక్కు ఉద్యోగం రాలేదని, ఊరినిండా అప్పులున్నాయని, ఇంటి నిండా జబ్బులున్నాయని కాదు- రాత్రులు ఒంటరిగా ఎక్కడికన్నా వెళ్లాలంటే




చట్టబద్ధమైన హెచ్చరిక:
సిగరెట్ తాగడం ఆరోగ్యానికి హానికరం
STATUTORY WARNING:
CIGARETTE SMOKING IS INJURIOUS TO HEALTH

1 రూపాయికి 10*

*గరిష్ఠ ధర స్థానిక పన్నులను అనుసరించి

CASVS-237-182 TL

మెయిన్ డీలర్ : ధనలక్ష్మి & కో;
మచిలీపట్నం

భయం. తన నీడను తను చూసుకుంటేనే భయం.

భయం పోవడానికి భద్రయ్య నాటు వైద్యుల్ని సంప్రదించి చాలా నాటు మందులు వాడాడు. భూత వైద్యుల్ని కలుసుకుని చాలా తాయెత్తులు కట్టించుకున్నాడు. ఇలా చాలా డబ్బు తగలేశాడు గాని, అతన్ని పట్టి పీడిస్తున్న భయం మాత్రం పోలేదు.

చివరికో ఇంగ్లీషు డాక్టరు దగ్గరకెళ్లాడు. ఆయన అనేక రకాలైన పరీక్షలు చేసి కొన్ని మందులు రాసి, అవి కొని



వాడమన్నాడు. అయినా ఫలితం లేక పోవటంతో మరల అదే డాక్టరు దగ్గర కెళ్ళి– "మీరు రాసిచ్చిన మందులన్నీ వాడాను... కాని నా భయం అసలేం తగ్గలేదు. ఈ భయం తగ్గదేమోనని, మరింత భయంగా ఉంది'' అన్నాడు భయంగా భద్రయ్య.

డాక్టరు చాలా సేపు ఆలోచించి భద్రయ్యను పరీక్షగా మరొకసారి చూచి, ప్రిస్క్రిప్షన్ రాసి చీటీ చింపి – "ఇది కొని భోజనం చేసి రాత్రులు పడుకునే ముందు వాడు. తప్పక తగ్గుతుంది నీ భయం'' అని అభయం యిచ్చాడు డాక్టరు భద్రయ్యకు.

ఆ చీటీ పట్టుకుని మార్కెట్ కొచ్చి ఓ ఇంగ్లీషు మందుల షాపు దగ్గర కెళ్ళి డాక్టరు రాసిచ్చిన చీటీ చూపించాడు. ఆ షాపువాడు చీటీవైపూ, రైతులా అసలైన పల్లెటూరి బైతులా కనిపిస్తున్న భద్రయవైపూ ఓసారి తేరిపార చూసి, నవ్వుకొని "ఇవి మా దగ్గరుండవని'' చీటీ యిచ్చేశాడు.

భద్రయ్య మరో మెడికల్‌షాపు కెళ్ళాడు...అక్కడా అలానే సమాధానం వచ్చింది... ఇంకో మందుల షాపు, మరో మెడికల్ షాపు.... ఇలా ఓ ఐదు మందుల షాపులు తిరిగాడు.

"ఇక ఈ మందు గురించి కనిపించే ఆ మందుల షాపులో అడుగుతాను. ఈ మందు ఉందంటే సరేసరి, లేదంటే మరే మందుల షాపుకు వెళ్ళను" అని నిశ్చయించుకుని, ఆ కనిపించే మెడికల్ షాపుకెళ్ళి, చీటీ చూపించాడు.

ఆ చీటీ అందుకున్న ఆ మందుల కొట్టువాడు– "ఇది మాదగ్గర వుండదు గాని... ఆ పక్క కొట్లో అడుగు... అక్కడుంటాయి ...'' అని కొట్టు చూపించి, చీటీ యిచ్చేశాడు.

భద్రయ్య అలానే ఆ పక్క కొట్టుకెళ్ళి, చీటీ చూపించాడు. ఆ షాపువాడు చీటీ చూచి— "ఉంది... పావలా యివ్వు..." అన్నాడు. భద్రయ్యకు మొదట ఆశ్చర్యమేసింది. "ఇన్ని కొట్లు తిరిగితే... దీని రేటు పావలేనా?! దీనితోనైన నా భయం తగ్గితే అంతే చాలు.'' అని మనసులో అనుకుని,

జేబులోంచి పావలా తీసి యిచ్చాడు.

ఆ షాపువాడు పావలా అందుకుని, పక్కనే వున్న 'ఆంజనేయ దండకం' తీసి భద్రయ్యకిచ్చాడు.

—ఎస్. జగన్మోహనరావు

# కాలు

డైనింగ్ టేబిల్‌కి ఒకవేపు శ్రీనివాస్, అతనికెదురుగా భవాని కూర్చున్నారు. ఇంకొకవేపు శ్రీనివాస్ నాన్నగారు వెంకటేశ్వరరావు గారు కూర్చున్నారు.

ముగ్గురూ నిశ్శబ్దంగా ఎవరి ఆలోచనలో వాళ్లున్నారు.

యాంత్రికంగా పళ్ళాల్లో వున్న పదార్థాల్ని కెలుకుతున్నారు.

ఆడపిల్లని చూస్తే చాలు అష్టవంకర్లు తిరిగిపోయే కొడుకు ఓ అందమైన అమ్మాయిని అకస్మాత్తుగా ఇంటికి తీసుకు వచ్చేసరికి ఆశ్చర్యపోతున్నారు వెంకటేశ్వరరావు గారు.

చిన్నప్పట్నుంచీ తల్లిలేని లోటు తెలీకుండా, సవితి తల్లి ప్రేమ రుచి చూపకుండా అల్లారు ముద్దుగా పెంచిన తండ్రికి తన ప్రేమ విషయం ఎలా తెలియజేయాలో తోచక తికమకపడుతున్నాడు శ్రీనివాస్.

సరాసరి కాబోయే మామగారి సరసన భోజనం చేస్తున్న భవానీకూడా ఈ పరిస్థితి చాలా ఉత్కంఠని రేపుతోంది.

తల కిందకి దించుకొని పళ్ళెంవేపు చూస్తూ, వేళ్లతో కదుపుతూ ఆలోచిస్తోంది.

ఎలాగైతేనేం 'లంచ్' పూర్తయింది.

ముగ్గురూ సోఫాల్లో విశ్రాంతిగా కూర్చున్నారు. శ్రీనివాస్ ఎలా మొదలెట్టాలో మనసులో రిహార్సల్ వేసుకున్నాడు. కాస్సేపు తలా తోకలేని మాటలు మాట్లాడేడు. నెమ్మదిగా గొంతు సర్దుకొని తండ్రివేపు చూసేడు.

వెంకటేశ్వరరావు గారి కళ్ళు కళ్ళద్దాల వెనుకనుంచీ నిశితంగా కొడుకునే పరిశీలిస్తున్నాయి.

"నాన్నా! ...మీరేమీ... అనుకోనంటే... మీతో ఒక విషయం... చెప్పాలనుంది"



వెంకటేశ్వరరావు గారందుకుని "నువ్వు చెప్పబోయేది 'ఈ అమ్మాయిని ప్రేమించేను. ఈమెను తప్ప నేనింకెవరినీ పెళ్ళిచేసుకోను' అనేదే" అన్నారు గుబురు మీసాల చాటున వస్తున్న నవ్వుని దాచిపెట్టుకుని.

భవానీ, శ్రీనివాస్ ఆశ్చర్యంతో ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు.

"ఎలా తెలిసిందని ఆశ్చర్యపోతున్నావా? లంచ్ చేస్తున్నప్పుడు భవాని కాళ్లనుకొని

నువ్వు నా కాళ్లని నలిపేస్తున్నప్పుడే గ్రహించాను అసలు విషయం" ఇంకా ఏదో అంటున్న తండ్రి మాటలు సిగ్గుతో తలవాల్చుకున్న శ్రీనివాస్‌కి వినపళ్లేదు.

—వి. రమేష్

# ఆత్మాభిమానం

**ఆ** కుర్రాడికి నాలుగేళ్ళ వయసుంటుంది. దాదాపు గంటసేపటి నుంచి తల్లిని తెగ అల్లరి పెట్టేస్తున్నాడు. తల్లి చాలా సేపటి వరకు వాణ్ని సముదాయించి అల్లరి చేయవద్దని బుజ్జగించి మరీ చెప్పింది. అయినా వాడు తన పట్టు వదలక అల్లరి చేస్తూనే వున్నాడు. చివరికి తల్లి విసిగిపోయి వాణ్ని పట్టుకుని నాలుగు బాదింది.

అంతే! కుర్రాడు తల్లి మీద కోపంతో అక్కడి నుంచి లేచి వెళ్ళి బాత్‌రూంలోకి దూరి లోపల నుంచి తలుపులు మూసేసుకున్నాడు. అది చూసి వాడు లోపల ఏ అఘాయిత్యం చేసుకుంటాడో అని పరుగెత్తుకొచ్చి తలుపు బాదుతూ నిలబడింది. గంటలు గడుస్తున్నాయి. తల్లి తలుపు బాదుతూనే వుంది. కొడుకుని బయటకు రమ్మని బ్రతిమాలుతూనే వుంది. కానీ లోపలనుంచి సమాధానం రావటం లేదు. కుర్రాడు తలుపు తెరవటంలేదు.

ఈసారి [illegible]ల్లి భ[illegible]పడిపోయింది. చుట్టు పక్కల జనాన్ని [illegible]సింది. కొందరు తలుపులు పగులగొట్టటానికి ఉపక్రమించబోతున్నారు. ఇంతలో ఓ ముసలాయన ముందుకొచ్చి తల్లిని అడిగాడు "ఏమ్మా! వుంది అమ్మాయా? అబ్బాయా?" తల్లి అబ్బాయని చెప్పింది.

"అయితే తలుపులు పగులగొట్ట నవసరం లేదు. ఉండండి నేను చెబుతాను" అన్నాడు.

వెంటనే బాత్‌రూం తలుపు దగ్గర స్టూల్ వేయించుకుని దాని మీద ఎక్కి నిల్చుని వెంటిలేటర్‌లోంచి చూస్తూ గట్టికేకేశాడు—

"ఓసే పిల్లా! బాత్ రూంలో దాక్కున్న ఓ ఆడపిల్లా! వెంటనే బయటకు రా!" అన్నాడు.

వెంటనే తలుపు భళ్ళున తెరుచుకుంది. కుర్రాడు గుండెలు పైకి దన్నుకుంటూ గర్వంగా బయటి కొచ్చి అన్నాడు—



"ఎవడ్రా నన్ను ఆడపిల్ల అని పిలుస్తున్నాడు నేను మగ పిల్లవాణ్ని. కనిపించటంలా!"

—గౌస్

# జాబితా

"గుర్తుందిగా, యివాళ్ళే మాఅమ్మ వచ్చే రోజు" ప్రొఫెసర్ సుందర్రామయ్య




ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుండి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన అపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనం కాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:


మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.


కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.


ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.

**నోటి దుర్వాసనను ఆపండి...**
**కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో**
**దంతక్షయాన్ని**
**ఎదుర్కోండి!**




DC.G.74 TL

కాలేజీకి బయల్దేరుతుండగా గుర్తుచేసింది ఆయనగారి శ్రీమతి.

"ఆఁ...ఆఁ... అవును" అన్నాడు సుందర్రామయ్య.

"సాయంత్రం ఆరింటికి వస్తుంది రైలు. కాలేజీనుంచి అ టే వెళ్ళి తీసుకురండి" చెప్పిందామె.

"అలాగే."

"ఆవిడకి పూరు కొత్తకూడాను. మర్చిపోకండి."

"పోను."

"అలాగే కొన్ని చిల్లర సరకులుకూడా కావాలి కిరాణ స్టోర్స్‌నుంచి".

"తెస్తాను".

"అన్నట్టు, మీ డ్రస్ యివాళే యిస్తానన్నాడు టైలర్. అవీ తీసుకొచ్చేయండి".

"ఓ.కే."

"చంటాడికి పాలడబ్బా అయిపో వచ్చింది. అమూల్ స్ప్రే దొరకడం లేదు. ఎవర్నో అడిగి తెస్తానన్నారుగా. వీలయితే తీసుకు రండి- కనీసం రెండు డబ్బాలయినా".

"ష్యూర్..ష్యూర్" సుందర్రామయ్యకి పదేళ్లు ఆలస్యంగా పుట్టిన కొడుకంటే చాలా ప్రేమ.

"ఆ చేత్తోనే పాల పీక కూడా..."

"చూడు రాజ్యం! ఇలా లిస్టుచదివితే నాకు గుర్తు వుండదు. సాయంత్రం తేవలసినవన్నీ ఓ లిస్టు రాసి, నా కోటు జేబులో వుంచు. ఏదీ మర్చిపోయే అవకాశం వుండదు" అసహనంగా అన్నాడు సుందర్రామయ్య.

శ్రీమతి రాజ్యం కావల్సిన వస్తువులన్నీ జాబితా రాసి, సుందర్రామయ్య దగ్గరగా నడిచి, ఆయన కోటు జేబులో వుంచింది. "ఇదిగో- ఈ ఎడం జేబులో వుంచాను లిస్టు."

"ఓ.కే." అంటూ హడావిడిగా బయటకు నడిచాడు సుందర్రామయ్య.

సాయంత్రం ఆరున్నరవుతుండగా గుమ్మంలో నిలబడి ఎదురు చూస్తున్న రాజ్యంకి, మోటారుసైకిలు మీద ఒక్కడే వస్తూ కన్పించాడు సుందర్రామయ్య.

మోటర్ సైకిల్ లోపలికి నడిపిస్తూ అన్నాడు సుందర్రామయ్య- "ఇదిగో, ఈ వెనుక బాగ్‌లో వున్నాయి నువ్వు రాసినవన్నీ. తీసుకురా లోపలికి"

"అదిసరే, మా అమ్మ ఏదండీ? యివేళ



రాలేదా?" అయోమయంగా అడిగింది రాజ్యం.

"మీ అమ్మ...ఆఁ.. ఆవిడ యివాళే కదూ వస్తానన్నారు! మర్చేపోయాను. అయినా, తేవల్సినవన్నీ లిస్టు రాయమన్నానుకదా—మరి మీ అమ్మని ఆ జాబితాలో ఎందుకు చేర్చలేదు?" 'గుఁయ్'మన్నాడు ప్రొఫెసర్ సుందర్రామయ్య.

—పి.వి.ఆర్. శివకుమార్

పెయింటర్ రామూ ఉంటున్న ఇల్లు ఆ వీధి చివర్న ఉంది. పెరటి ఆవర ణలో అతను పెయింటింగ్ పని చేసుకో డానికి విడిగా చిన్న తాటాకుల షెడ్డు ఉంది. పెరటి తలుపులు తెరిస్తే కొంత మేరకు ఇసుకమేట, దానిని ఆనుకుని రాతిమెట్లు, వాటిని తాకుతూ ప్రవహించే సరయూ నది కనిపిస్తాయి.

ప్రశాంతంగా పని చేసుకోడానికి అది ఆహ్లాదకరమైన వాతావరణం. పూర్తి చేసిన బోర్డుల్ని ఆరబెట్టుకోడానికి అక్కడ ఇసుకమేట ఎంతో అనుకూలం. కానీ, కాస్త పరాకువహిస్తే మాత్రం నది మీంచి వీచే గాలి ఇసుకరేణువుల్ని మోసు కొచ్చి రంగు తడి ఆరని బోర్డులమీద ఒలకబోసి అతని శ్రమని వృథా చేస్తూ వుంటాయి.

అలాగే నదిలో స్నానానికి వచ్చిన పిల్లలు పెరటి గోడమీదికి ఎగబ్రాకి షెడ్డులోకి తొంగిచూస్తూ అతని ఏకాగ్ర తకి అడ్డు తగులుతూ వుంటారు.

వీటన్నిటినీ మించి పని చేయించుకుని కూడా డబ్బు కోసం తిప్పేవాళ్ళూ, చేసిన పనిలో పనికట్టుకుని లోపాలు వెతికే వాళ్ళూ, ఒకటికి రెండుమార్లు తిరిగి రాయించే పేచీకోర్లూ తగులుతూ వుంటా రతనికి.

రెండు నెలల క్రితం కబీర్ వీధి కుర్రాడొకడు లా పరీక్ష పాసై వెంటనే ప్రాక్టీసు పెట్టాలనే ఉబలాటంతో ఓ సాయంత్రం రామూ సైకిలు మీద పోతుంటే దారికడ్డం పడ్డాడు.

"వెంటనే నాకో బోర్డు రాసి పెట్టాలి. గురువారం ఉదయం గుమ్మంలో బోర్డు వేలాడాలి; పదకొండు గంటలకి ముహూర్తం" అన్నాడా కుర్రలాయరు.

"కుదరదండీ...రంగు తడి ఆరడానికే కనీసం అయిదు రోజులు పడుతుంది" అన్నాడు రాము.

అయినా కుర్రలాయరు వదల్లేదు. రామూ వీపుమీద చెయ్యివేసి "పద" అంటూ హోటలు వేపు దారితీసేడు.

"నువ్వు కాదనడానికి వీల్లేదయ్యా! గురువారం పదకొండు దాటకూడదని చెప్పారు"

"ఎవరు ?"

"మా సిద్ధాంతిగారు. నా మట్టుకు నాకు ముహూర్తాలమీద చాలా గురి. పైగా మా సిద్ధాంతిగారి లెక్కలకి తిరుగులేదు. అందుకే ఇంతలా బతిమాలుతున్నాను. ఇంతకీ నీ ఛార్జీలు ఎంతవుతాయి ?"

"మూడూ బై ఒకటిన్నర అడుగుల బోర్డులో కనీసం మూడుమైళ్లు, మేకులూ, రంగులూ కలుపుకుని ముప్పై రూపాయలు పడుతుంది"

"కాస్త తగ్గించవయ్యా. ఏదీ ఇప్పుడే కదా ప్రాక్టీసు పెట్టబోతున్నాను"

"కిట్టదండీ. మీరిచ్చే ముప్పై రూపా యల్లో ఇరవై దాకా మదుపులే పెట్టాలి. దాంట్లో తగ్గిస్తే ఇహ నాకు మిగిలే దేముంది?" అన్నాడు రామూ వ్యాపార ధోరణిలో.

"సరే. కానీ అక్షరాలు చూసేవూ కాస్త ఎడమవేపు వాలుతున్నట్లుండాలి"

"ఛీ. ఛీ" దాదాపు కసిరినంతపని చేశాడు రామూ. "ఆ అక్షరాలు నూనె దుకాణం వాళ్ళకీ, సబ్బులు అమ్ముకునే వాళ్ళకీ రాసిపెట్టేవండీ"

"కావొచ్చునయ్యా!కాని నాకలాంటివే కావాలి"

"అలాగే రాస్తాను గానీ రేపొద్దున్న నీ ఆఫీసుకి జనం 'సబ్బులున్నాయా?',




'నూనె ధర తగ్గిందా' అని అడగవస్తే మాత్రం నా పూచీ లేదు" అందామను కున్నాడు రామూ.

అక్షరాలు రాయడం అందమైన కళ మాత్రమే కాదు. దానికి నియమబద్ధమైన శాస్త్రమూ, నిర్దిష్టమైన సూత్రా లూ వున్నాయి. వాటిని చదివి, ఆకళింపు చేసుకుని వృత్తిగా మార్చుకున్న తనకి 'తగుదునమ్మా'- అంటూ కొందరు 'ఇలా కాదు అలా' అని చెప్పాలనుకుంటారు. ఆ వర్గానికి చెందినవాడీ లాయరు. ఇలాంటి వాళ్ళకి ఆ చవకమచ్చు పెయిం టరు జయరాజే తగినవాడు.

"చూడండి! ఓ లాయరు బోర్డుమీద అక్షరాలు ఎలా వుండాలి? ఠీవిగా తల ఎత్తుకుని అశోకుడి సింహాల్లా వుండాలి. అంతేగాని ఒరిగిపోతున్న బురుజుల్లా వుండకూడదు". ప్రతిరోజూ తనకి ఎదు రయ్యే వ్యాపారస్తులకు ఇలా చెప్తే అర్థం కాదు. ఈ లాయరు చదువుకున్నవాడు కదా కాస్త శాస్త్రం చెపితే వినకపోతాడా అని నాలుగు రకాలుగా నచ్చచెప్ప బోయేడు రామూ.

"కాదు... వీల్లేదు.నా మాటకి తిరుగు లేదు" అంటున్నాడు లాయరు.

"నా రాశిలో గ్రహాల ప్రకారం బోర్డు మీద అక్షరాలు ఎడమవేపు వాలుతున్న ట్టుగా వుండాలన్నాడు మా సిద్ధాంతి" అంటాడు లాయరు.

ఆ మాటలు రామూకి కోపం తెప్పిస్తు న్నాయి. మధ్యాహ్నం మూఢ నమ్మకాల మీద తనకీ, మేనత్తకి వాదన జరిగింది. ఆ ముసలావిడ ఎప్పుడూ తిధి, వార నక్షత్రాలు చూడందే ఏ చిన్న పనీ మొదలు పెట్టదు. రోజులు మారేయి. విజ్ఞానం పెరిగింది అంటే "తప్పురా వెర్రి నాగన్నా చెంపలేసుకో" అంటుంది.

"నేను హేతువాదిని సార్! గుడ్డి నమ్మకాల మీద నాకు గురిలేదు. ప్రతి దానికీ హేతుబద్ధమైన వివరణ కావాలి. మీ అక్షరాలు ఎడంవేపు ఎందుకు వాలి పోవాలో - అలా వాలకపోతే మధ్యన మీ గ్రహాలకొచ్చే ఆపదేమిటో నాకు అర్థం కాదు" అన్నాడు రామూ.

ఏం చెప్పాలో తోచలేదు కుర్ర లాయర్ కి.

"ఇందులో అర్థాలు వెదకడం అనవ సరం. నేను డబ్బిస్తున్నాను - నువ్వు పనిచేసి పెడుతున్నావు. అంతే" అంటూ పది రూపాయలు తీసి అడ్వాన్సు ఇచ్చేడు. ఇద్దరూ హోటల్ బయటకు వచ్చేరు.

"మరిచిపోకు సుమీ - గురువారం ఉదయం పదకొండు గంటల్లోపు" అని గుర్తు చేసేడు కుర్ర లాయరు.

"నూనె దుకాణం మార్కు అడ్వొకేటు బోర్డు..." అని గొణుక్కున్నాడు రామూ.

* * *

బుధవారంనాడు బాగా పొద్దుపోయే వరకు ఓపిగ్గా పనిచేసి లాయర్ బోర్డు పూర్తి చేసేడు రామూ.

గురువారం ఉదయం లాయర్ ఇంటికి చేరుకున్నాడు. గుమ్మానికి మామిడి తోరణాలు వేలాడుతున్నాయి. ఇంటి ముందు చాలా సందడిగా వుంది. గుమ్మంలో ఓ ముసలాయన - కుర్ర లాయర్ తండ్రి కాబోలు ఆహూతులకు స్వాగతం చెబుతున్నాడు.

వీధి నడవలో జంబుఖానాల మీద చాలామంది కూర్చున్నారు. నడవదాటి వాకిట్లోకెళ్ళే వలయాకారంలో పురో హితులూ, నడుమ హోమగుండం, దాని కెదురుగా పట్టు పంచెతో కుర్రలాయరు

కనిపిస్తున్నారు. అతని నొసట గంధపు నామాలు, వాటి నడుమ పావలా కాసంత కుంకుమ బొట్టు వున్నాయి.

'పెళ్ళికూతురూ, భాజా భజంత్రీలూ లేవుగానీ దాదాపు పెళ్ళి ప్రయత్నం చేసినట్టున్నాడు' అనుకున్నాడు రామూ.

రామూని చూడగానే "అదిగో బోడ్డు-బోర్గొచ్చింది" అంటూ పదిమందీ చుట్టు ముట్టేరు.

"అతనికి దారియ్యండ్రా!" అంటూ అరిచేడు కుర్రలాయన ఓ వెపు పూజ కొనసాగిస్తూనే.

రామూ ఎడమ చేతిని పైకెత్తి రిస్టు వాచీ చూపిస్తూ "చూశారా! పదిన్నర అంటే నా నిఘంటువులో పదిన్నరే" అన్నాడు.

అయిదు జతల చేతులు ఆ బోడ్డును



అందుకోబోయేయి.

"ఆగండాగండి... ఇంకా పూర్తిగా ఆరలేదు" అని నెమ్మదిగా బోర్డుకి చుట్టిన కాగితాన్ని తొలగించి, పైకి ఎత్తి పట్టుకుని "చూడండి" అంటూ లాయర్‌కి చూపించేడు. లాయర్ పొంగిపోయేడు.

టైము పదకొండు కావచ్చేసరికి కుర్ర లాయర్ తండ్రి ఓ పురోహితుడిని వెంట బెట్టుకొని రామూని వీధి గడపలోకి తీసుకొచ్చి గోడ చూపించాడు.

"అదిగో అక్కడ కొట్టాలయ్యా బోర్డుని" అన్నాడు.

అతను చెప్పిన చోట పెన్సిల్‌తో మార్క్ చేసుకుని, తనతోపాటు తెచ్చుకున్న గోనెసంచిలోంచి దృఢమైన మేకుల్ని ఏరుకుని, సుత్తి బయటకు తీసి ఓసారి దాని పిడి సరిచేసేడు. అతని చుట్టూ చాలామంది పోగయ్యేరు. దారిన పోతున్న జనం కూడా ఇంటి ముందు నిలబడి రామూ వేపు ఆసక్తిగా చూస్తున్నారు.

అందరి కళ్ళు రామూ మీదే. అతనికి ఓ పిసరు గర్వం కలిగింది. బోర్డుని అందంగా రాయడం ఒక ఎత్తు, దాన్ని సరైన చోట సక్రమంగా వేలాడదీయడం మరో ఎత్తు. చాలామందికి ఈ విషయం తెలీదు. అందమైన బోర్డుల్ని అపసవ్యంగా వేలాడదీసి అక్షరాలు వంకరగా వున్నాయని ఆర్టిస్టుని నిందించేవాళ్ళని చాలామందిని చూసేడతను. అందుచేత తను బోర్డు రాయడంతో పాటు వేలాడదీయడం కూడా ఓ ముఖ్యాంశంగా ఎంచుకున్నాడు.

బోర్డు వేలాడ దీయడం పూర్తయింది. పురోహితుడు దానికి గంధపు బొట్టుపెట్టి కుర్ర లాయర్ చేత ఏవో మంత్రాలు చదివించి పువ్వుల దండను వేలాడదీయమన్నాడు. ఎవరో ఇంట్లో గ్రామ్ ఫోను ఆన్ చేసేరు. మంగళ వాద్యాలు చెవులు చిల్లులు పడేలా మోగుతున్నాయి.

కుర్ర లాయరు దండవేసి, బోర్డుని ఆప్యాయంగా తడిమి కళ్ళ కద్దుకోబోయి షాక్ కొట్టినట్లు కొయ్యబారి పోయేడు. ఒక్కసారి తేరుకుని "ఏమిటయ్యా ఇది?" అని గట్టిగా ఓ గావుకేక వేసేడు. అందరితోబాటు రామూ కూడా హడలి పోయేడు. ఇంట్లో మంగళ వాద్యాలు ఆగిపోయేయి.

"ఏమైంది సార్?" రామూ అమాయకంగా అడిగేడు.

"దుమ్ము కొట్టుకుపోయిందయ్యా!" అన్నాడు కుర్రలాయర్ మండిపోతూ

అర్థమైంది రామూకి. నిన్న సాయంత్రం పెరట్లో బోర్డు ఆరబెడుతున్నప్పుడు గాలికి ఎగిరి వచ్చిన ఇసుక బోర్డు మీద పడి అక్కడక్కడ అంటుకుపోయింది. ఏదో ఒకటి సర్దిచెప్పాలి కాబట్టి-

"అది స్టక్కో ఎఫెక్ట్ సార్! దాని కోసం కావాలని నేనే కాస్త ఇసుక అద్దేను" అన్నాడు రామూ.

"స్టక్కో ఎఫెక్టా? అంటే?" లాయర్ ముఖం చిట్లిస్తూ అడిగేడు.

రామూకి కుడిపక్క నిలబడ్డ ఓ పొడుగాటి హిప్పీ కుర్రాడు ముందు కొచ్చి-

"నీకు తెలీదులే మావయ్యా! ఆర్కిటెక్చరల్ టెక్నిక్స్‌లో స్టక్కో ఎఫెక్ట్ చాలా లేటెస్ట్..." ఆ హిప్పీవాలా ఇంజనీరింగ్ కోర్సులో ఆఖరి సంవత్సరం చదువుతున్నాట్ట.

'నీ హిప్పీ క్రాపు పది కాలాలపాటు వర్ధిల్లి, నీ చెంపలు మరో పదింతలు పెర




గాలి నాయినా' అని మనసులో అతన్ని అభినందించుకున్నాడు రామూ.

కుర్రలాయర్ అయిష్టంగా ముఖం పెట్టి రామూ మీద అంతెత్తు ఎగిరేడు. "నా పేరునిండా ఇంత దుమ్ము పేర్చుకుని ప్రేక్టీసు మొదలుపెట్టమంటావటయ్యా?" అని అరిచేడు.

రామూకి చికాకు వేసింది. 'నీలాంటి తిక్క శంకరయ్యల బోర్డులు రేపో ఎల్లుండో దుమ్ము కొట్టుకుపోవడం ఖాయం. ఆ పనేదో ఇవాళే జరిపించేస్తే' అని మనసులో తిట్టుకొని–

"సరే జరిగిందేదో జరిగిపోయింది. ఈవేళ ముహూర్తం గదా. ఈరోజు మట్టుకు దీనితో పని జరిపించండి. వారం పది రోజుల్లో కొత్త బోర్డు రాసిస్తాను" అని చెప్పి బయట పడ్డాడు.

కుర్ర లాయరు తండ్రి రామూ చేతిలో ఓ కొబ్బరికాయ, తాంబూలం పెట్టి వెళ్ళి రమ్మన్నాడు. తన బకాయి ఇరవై రూపాయల కోసం తాంబూలంలోకి చూస్తే అందులో సుత్తితో కొడితేగాని విరగని పోక చెక్కలు రెండున్నాయి. విసుక్కున్నాడు రామూ.

టైము ఒంటి గంట కావస్తోంది. కడుపులో ఆకలి కరకర లాడుతోంది. ఉదయం ఇంట్లో ఏమీ తినకుండానే బయల్దేరాడు. లాయర్ ఇంటికి వెళ్ళగానే రెండు ఇడ్లీలు, సత్తు గిన్నెలో చల్లారి పోయిన కాఫీ ఇచ్చేరు. మధ్యాహ్నం అట్టహాసంగా విందు భోజనం ఏర్పాటు చేస్తున్నారు; ఉండమనక పోతారా అనుకున్నాడు. కాని తన బకాయిని కూడా అట్టే పెట్టుకొని తాంబూలం ఇచ్చి తోలేసేరు; మర్యాద తెలీని మనుషులు. పోనీ ఏదైనా హోటల్‌కి పోదామంటే జేబులో చిల్లిగవ్వ లేదు. ఇంటికెళ్ళినా లాభం లేదు. ఈరోజు ఏకాదశి. మేనత్త ఉపవాసం చేస్తూంది. ఈ సమయంలో వంట చెయ్యమని ముసలి ప్రాణాన్ని ఇబ్బంది పెట్టడం మహా పాపం. అందుకే తన వీధి మొగలులో వున్న చిన్న హోటల్‌కి దారి తీసేడు.

ఆ హోటల్‌కి పేరు లేదు. దానికి రామూ పెట్టిన ముద్దు పేరు 'బోర్డులెస్ హోటల్'. ఎవరు ఎన్ని రకాలుగా అడిగినా తన హోటల్‌కి పేరు లేదంటాడు దాని యజమాని. ఆ రకంగా పేరులేని తనాన్ని ప్రచారం లోకి తీసుకొచ్చి బాగా ఆర్జించేస్తూ పేరులేనితనంలో కూడా పెన్నిధి ఉందని ఋజువు చేస్తున్నాడు.

ఆ హోటల్‌కి వెళ్ళిన ప్రతిసారి "నీ హోటల్‌కి 'బోర్డులెస్ హోటల్' అని ఓ పెద్దబోర్డు రాసి పెట్టనా?" అని రామూ అయ్యర్‌తో జోక్ చేస్తూ వుంటాడు. "ప్రపంచంలో ప్రతివాడునీలాగే బోర్డు అక్కర లేదనుకుంటే మేం బతికేది ఎలా?" అని అడిగితే– అయ్యర్ ఓ నవ్వుతో సరిపెడతాడే తప్ప బోర్డు రాయమని అడగడు.

రామూ హోటల్ చేరుకొని భోజనం పూర్తి చేసి బయటకు వస్తూ "నా ఖాతాలో ఖర్చు రాసుకో" అని అయ్యర్‌తో అన్నాడు. నిజానికి అక్కడ రామూ ఖాతాయే లేదు.

"నువ్వు బోర్డు రాయడానికి ఆర్డర్ ఇచ్చిననాడు ఇద్దరం కూర్చుని ఎకౌంట్ సెటిల్ చేద్దాం" అంటూ నవ్వేడు.

బోర్డు తగిలిస్తే తన హోటల్‌కి ప్రత్యేకత పోతుందని అయ్యర్ నమ్మకం. బోర్డు రాయమని అతను రామూని కోరడం జరగని పని. "అది జరిగిననాడు

ఎకౌంట్ చేసుకుందాం" అంటూ రాయని ఖాతాని పెంచుకుపోతూ వుండటం రాముా పని!

* * *

ఆ సాయంత్రం మార్కెట్ గేటు దగ్గర గాజుల దుకాణం చాలా రద్దీగా వుంది. అద్దాల బీరువాల్లో గాజులతో నిండిన అట్ట గొట్టాలు సీమంతం పెళ్ళి కూతురి చేతుల్లా వున్నాయి. దుకాణం దారు వయసులో వున్న అమ్మాయిల అరచేతులు నొక్కుతూ గాజులు ఎక్కిస్తున్నాడు.

"అదృష్టవంతుడివి గురూ! నీ పనే



బాగుంది" అనుకున్నాడు రాముా.

దుకాణందారు ఓ అమ్మాయి దగ్గర డబ్బులు తీసుకొని లెక్కపెడుతున్నాడు. అతనికి మూడడుగుల దూరంలో గోడవారన ఉల్లిపొర కాగితం చుట్టబడిన బోర్డు పడివుంది. మూడు రోజుల క్రితం ఆ బోర్డుని రాముా డెలివర్ చేశాడు. ఆ రోజు నుండి అక్కడే పడి ఉంది.

బోర్డు అందుకొని ఉల్లిపొర కాయితాన్ని ఊడదీసేడు రాముా "అరువు రేపు నగదు నేడు" ఎవరో చిన్నమ్మాయి కూడబలుక్కుంటూ చదివింది. ముఖ్యంగా 'నగదు' ఎర్రగా కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. దుకాణంవాడు తల ఎత్తి "వచ్చేవా!" అన్నట్టు రాముాకేసి చూసి—

"ఆ 'నగదు' మరీ ఎర్రగా రాసే పయ్యా" అన్నాడు.

"కావాలనే రాసేను. ఏం?" అడిగేడు రామూ.

"మరీ అంత గాడీగా వుంటే చూసే వాళ్ళు జడుసుకొని దుకాణానికి రావటం మానుకొంటారు'' అని మరో అమ్మాయి చేతులు నొక్కుతూ వాటికి సరిపోయే గాజులు వెదుకుతున్నాడు. ఆ అమ్మాయి మెలికలు తిరిగిపోతోంది.

'గాడిద కొడుకు. గాజుల వ్యాపారం ఎందుకు పెట్టేడో ఇప్పుడు అర్థం అవుతోంది. కాకపోతే ఓ ఇద్దరాడవాళ్ళని పనిలో పెట్టుకొని వాళ్ళకి గాజులు ఎక్కించే పని అప్పచెప్పి నా లాటివాళ్ళ వ్యవహారాలు తొందరగా సెటిల్ చెయ్య వచ్చుకదా? వీడి దుకాణం మీద నాలుగు రాళ్ళు పడితే సరి...' అనుకుని "ఇవాళ రమ్మన్నావుగా నా బిల్లు సంగతేం చేశావు?" అని అడిగేడు.

''ఎరుపు రంగు నాకు నచ్చలేదు. నా దగ్గరకొచ్చేవాళ్ళకి కూడా అది నచ్చదు. ఏవమ్మా నీకా రంగు నచ్చిందా?" అని అడిగేడు ఓ అమ్మాయిని. ఆ చిన్నది అష్ట వంకర్లు తిరిగిపోతూ

''నాకు నీలం రంగంటే ఇష్టం" అని కిసుక్కున నవ్వింది.

దుకాణందారు విజయగర్వం తో చూసేడు. రామూ ఇబ్బందిగా ఫీలయ్యాడు. ''బిల్లు చెల్లిస్తున్నట్టా లేనట్టా?" అడిగేడు.

''ఆ రంగు మారిస్తేనే..."అన్నాడు దుకాణందారు.

నగదు విషయంలో కచ్చితంగా ఉండాలని,దాన్ని సూచించడానికే ఎరుపు రంగు వాడేనని వివరించి చెప్పాలనుకున్నాడు రామూ.కాని ఈసర క్షేత్రంలో విత్తనాలు చల్లి లాభం లేదని బయట పడ్డాడు.

ఇంటికి చేరుకునే సరికి పెరటి వరండాలో తిరగలి చప్పుడు వినిపిస్తోంది. అత్తయ్య పిండి విసురుతున్నట్లుంది. తెల్లవారింది మొదలు పొద్దుపోయే వరకు అతని కోసం నానా హైరాన పడుతుంది. ఆవిడ చాదస్తానికి అతను ఎన్నిమార్లు విసుక్కున్నా విసుగు లేకుండా అన్నీ అమర్చి పెడుతుంది. రామూ ఇంటి విషయాలు ఏ మాత్రం పట్టించుకోడు. అన్ని పనులూ ఆవిడే చేసుకుంటుంది. ఈ వయసులో కూడా వీధి చివర చెట్టియార్ దుకాణానికి దిన వెచ్చాలకని వెళ్తుంది. "అంత దూరం ఎందుకే" అని అడిగితే– "దినుసులు నాడెంగా ఉండొద్దూ?" అంటుంది.

* * *

ఆ సాయంత్రం రామూ హుషారుగా ఇంటికొచ్చేడు. మేనత్త వినాయకుడి మందిరంలో పురాణం వినడానికి బయలు దేరుతోంది.

"పెందరాళే వచ్చేసేవా? అప్పుడే రావేమోననుకున్నాను. నేనలా మందిరం వేపు వెళ్తాస్తాను. వంటయిపోయింది. నీకు ఆకలి అనిపించినపుడు అన్నం పెట్టుకొని తిను" అని చెప్పి వెళ్ళిపోయింది.

పెరటి ఆవరణలోని తన షెడ్‌లోని కొచ్చి లైటు వేశాడు. పాకెట్ సైజులో ఉన్న డైరీని తీసి ఆరోజే తనకు కొత్తగా వచ్చిన ఆర్డర్‌ని చూసుకున్నాడు. అది ఫామిలీ ప్లానింగ్ సెంటర్‌వాళ్ళు రాసి పెట్టమన్న సైన్ బోర్డు.

గోడకి తగిలించివున్న ప్లాంకుల్లో





బాగా వున్న ఓ ప్లాంకుని ఎన్నుకుని బేస్ వర్కు పూర్తి చెయ్యటం కోసం రంగు కలిపేడు. బాగా మందంగా వున్న ఓ కుంచెను రంగులో ముంచి, ప్లాంకు మీద రెండు కోటింగులు వేసి, తనకు సంతృప్తి కలిగిన తరువాత దానిని ఆరబెట్టటం కోసం రంగు పూసిన భాగాన్ని గోడవేపు తిప్పి ఏటవాలుగా చేరబెట్టేడు. లేకపోతే దుమ్మూ ధూళి దానిమీద పడి స్టకో ఎఫెక్ట్ వచ్చే ప్రమాదం వుంది. అది తలచుకోగానే కుర్రలాయరు జ్ఞాపకానికొచ్చి రామూ తనలో తాను నవ్వుకున్నాడు.

డైరీ తెరిచి బోర్డుమీద రాయవలసిన విషయాన్ని మరోసారి చదువుకున్నాడు. 'కుటుంబనియంత్రణా కేంద్రం, సలహాలు ఉచితం'.

ప్లాంకుమీద తను పెయింట్ చేసిన బేస్ ఆరుతోంది.

తనకి పని అప్పచెప్పిన వ్యక్తి పేరు డైసీ. సాదా చీరలో నాజుగ్గా వుంది ఆవిడ తల్లిదండ్రులెవరో, ఏ ఊరునుండీ వచ్చిందో, పెళ్ళయిందో లేదో ఎవరికీ తెలిసినట్టులేదు.

కొద్దిసేపటి క్రితమే కుటుంబనియంత్రణా కేంద్రలో డైసీని కలుసుకున్నాడు. అప్పుడు ఆమెను అంతగా పరిశీలించే అవకాశం చిక్కలేదు. ఆవిడ తనతో మాట్లాడినంతసేపూ కుర్చీలో కూర్చునే మాట్లాడింది. లేచి నిలబడితే మట్టుకు లావుకు తగ్గ పొడుగు వుంటుందని అనుకున్నాడు తను.

కుటుంబ నియంత్రణా కేంద్రం మార్కెట్ రోడ్డులో న్యూబ్లాక్స్‌లో ఓ మేడమీద ఈమధ్యనే తెరవబడింది. తన మిత్రుడు వీరప్ప ద్వారా డైసీతో రామూకి పరిచయం అయింది. న్యూబ్లాక్స్ వీరప్పవే. అందులో వాటాల్ని ఆఫీసులకి, దుకాణాలకి అద్దెకిచ్చాడు.

డైసీ...భారతీయసాంప్రదాయం వుట్టిపడే ఆ అమ్మాయికి ఈ పేరేలా పెట్టేరు? ఇప్పుడిప్పుడే యవ్వన ప్రాంగణంలోకి అడుగుపెడుతున్న ఈ నాజూకైన అమ్మాయి కుటుంబ నియంత్రణ గురించి, దాని ఆవశ్యకతను గురించి ప్రచారం చేసే బాధ్యతను చేపట్టిందంటే నమ్మశక్యం కాకుండా వుంది. ఆవిడ గురించి వివరంగా తెలుసుకోవాలనిపించింది రామూకి.

కాని డైసీని తనకు పరిచయం చేసిన తరువాత వీరప్ప తనకా అవకాశం ఇవ్వలేదు. తమ ముగ్గురిలోను వీరప్పే ఎక్కువసేపు మాట్లాడేడు. ఆమె గొంతులో సన్నదనం లేకపోయినా ఏదో ఆకర్షణ వుంది. కాసేపు మాట్లాడితే బావుణ్ను అనిపించేది రామూకి; కాని వీరప్ప ఓ పట్టాన తెగనిస్తేనా?

రామూ వీలు చూసుకుని "బోర్డు ఏ సైజులో కావాలంటారు?" అని డైసీని అడిగేడు.

"నీకు ఎలా బావుంటుందని తోస్తే అలాకానీ" డైసీ తరపున వకాల్తా పుచ్చుకున్నట్లు వీరప్ప జవాబు చెప్పాడు.

ఇక వీడున్నప్పుడు మాట్లాడడం మంచిదికాదని ఊరుకున్నాడు రామూ.

డైసీ..డైసీ..ఈవిడ కెందుకా పేరు? చూడబోతే వయసులోవుంది. తోడెవ్వరూ వున్నట్టులేరు. ముచ్చటగా పెళ్ళి చేసుకుని పొత్తిళ్ళలో పసికందుని లాలించవలసిన వయసులో దేశజనాభా సమస్యని పరిష్కరించాలని బయల్దేరిందేమిటి?

ఈ ప్రశ్నలు రామూ బుర్రని తొలి

చేస్తున్నాయి. 'అవిణ్నే అడిగి చూస్తే' అనుకున్నాడు. లక్కీగా వీరప్ప దేని కోసమో బయటికెళ్ళాడు. అడిగేద్దామని సిద్ధమై ఆవిడ ముఖం చూడగానే అడగ దలుచుకున్నది కాస్త మరిచిపోయి,

"మేడమ్! మీరెక్కడుంటున్నారు?" అని మాత్రం అడగ్గలిగేడు.

"ఇక్కడికి దగ్గరలోనే ఓ బోట్ హౌస్‌లో వుంటున్నాను. థర్డ్ క్రాస్‌లో ఏడో నెంబరు ఇల్లు. మెయిన్ గేట్ లోంచి తిరిగి రావటం కన్నా ఫోర్త్ క్రాస్ వేపు చిన్న గేటులోంచి వస్తే తిన్నగా నేనుంటున్న బోట్ హౌస్‌లోకి చేరుకోవచ్చు" అని చెప్పింది.

ఓసారి థర్డ్ క్రాస్‌లో ఆమె ఇంటికెళ్ళి తన సందేహాలు తీర్చుకొందునా అనిపించింది రాముకి. సాయంత్రం అయిదు గంటలకి డైసీతో పరిచయం అయింది తనకి. ఇప్పుడు టైము ఏడు కావస్తోంది. కేవలం రెండు గంటల పరిచయాన్ని

పురస్కరించుకుని ఆవిడ జీవితపు లోతుల్లోకి పోయి చూడాలనుకోవటం హద్దు మీరిన చనువు తీసుకోవటం అవుతుందేమో! ఓవేళ తను తెలివితక్కువగా వెళ్ళినా ఆవిడ తలుపులు తీయకుండా కిటికీలోంచే మాట్లాడి పొమ్మంటుందేమో అనుకుని ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాడు.

డైసీ అప్పచెప్పిన పని బ్రహ్మాండంగా చెయ్యాలి !

తన నైపుణ్యాన్ని జోడించి, పరిజ్ఞాన్ని మేళవించి తన పనితనాన్ని ఆవిడ మెచ్చుకునేలా బోర్డు రాసి పెట్టాలని రామూ నిశ్చయించుకున్నాడు. దానికి అనువైన ప్లాంక్‌ని ఎన్నుకున్నాడు. తనకి రేటు గిట్టుబాటులో లేకపోయినా సరే ఖరీదైన రంగుల్ని వాడాలనుకున్నాడు.

మళ్ళీ కోరికతో మనసు పీకుతోంది.

ఓసారలా సైకిల్ మీద వెళ్ళొస్తే ?

వద్దు వద్దంది మనసు మరోవేపు నుండి !

అయినా తనకి, ఆవిడకీ ఏమిటి సంబంధం ?

ఆ వ్యక్తి ఆడది కావటం వల్ల, అందునా వయసులో ఉండటం వల్ల, కేవలం వయసు రెచ్చగొడుతున్న వ్యామోహం వల్ల కాదూ తను డైసీని చూడాలనుకుంటున్నది ?

కాదు.

కాకపోతే మరేమిటి? తను చూసినంత సేపూ కుర్చీలో కూర్చునే వుందావిడ. ఒంటికాలుతోనే వుందో - కుంటుతూనే నడుస్తుందో తనకి తెలుసా ? కేవలం పైభాగాన్ని మాత్రం చూసి తను మతి పోగొట్టుకోవటం లేదూ ?

లేదు లేదు లేదు. ఆవిడకీ, తనకూ వున్న సంబంధం అంతా మనిషికీ, మనిషికీ వున్న సంబంధం. అంతే!




మర్నాడు సాయంత్రం.

ఫోర్త్ క్రాస్ రోడ్ వైపు చిన్న గేటు తెరుచుకుని ఏడో నెంబరు ఇంటి ఔట్ హౌస్ కెళ్ళేడు రామూ. తలుపులు దగ్గరగా చేరవేసి వున్నాయి. మూడు మెట్లూ ఎక్కి తలుపు తట్టాలని కుడిచేతి పిడికిల్ని సగం వరకు మూసి చూపుడు వేలు సుతారంగా తెరిచేడు. కాని తెరిచిన వేలు తిరిగి మిగిలిన వేళ్ళతో ముడుకు పోయింది. మూసిన తలుపు తెరిపించాలన్న ప్రయత్నం సందేహంలో పడింది. వెనుతిరిగి పోవాలనుకున్నాడు.

కాని ఒక్కసారిగా తలుపులు తెరుచుకుంటే?

తను మెట్లుదిగి పోతుండటం చూసిన డైసీ తననొక క్రూక్ అనుకొంటుందేమో!

కుడిచేతి చూపుడువేలు ఈమారు నిశ్చయంతో తెరుచుకుని మూసిన తలుపుని రెండుసార్లు మెల్లగా తట్టి ఓ క్షణం ఆగింది. "తలుపు తట్టడం సున్నితంగా తాళబద్ధంగా వుండాలి" - మళ్ళీ రెండుసార్లు తట్టి మరోక్షణం విరామం. "మృదువైన చప్పుడు అవతల మనిషికి తట్టిన వాడి సదుద్దేశాన్ని తెలియజేస్తుంది"

"ఇంకా తెరవకపోతే తిరిగి వెళ్ళిపోవాలే గాని దబదబ బాదకూడదు".

"ఎవరదీ?" డైసీ గొంతు.

ఎవరని చెప్పుకోవాలి తను? సైన్ బోర్డు పెయింటర్‌ననా? అలా తనను తాను పిలుచుకోవటం ఎందుకో ఎబ్బెట్టుగా అనిపించింది.

"నేను రామూని. నిన్న సాయంత్రం మిమ్మల్ని ఆఫీసులో కలుసుకున్నాను"

తలుపు తెరచుకుంది.

అతని కళ్ళముందు వెన్నెల కట్ట కట్టి నట్టుగా వుంది. తడబడ్డాడు.

మంచు తెరలు జారినట్టనిపించి ఆమెను స్పష్టంగా చూడలేకపోయేడు. "ఓహో మీరా!" ఆవిడ గొంతు మాత్రమే అతనికి వినిపించింది. గదిలోకి అడుగుపెట్టేడు.

'ఏవిటిలా వచ్చేరు? మీ గురించే నేను ఆలోచిస్తున్నాను' అని ఆవిడ అనలేదు. "లోనికి రండి" అని మాత్రం అంది.

"ఎందుకొచ్చేరు మీరు?" అని ఆవిడ అడిగితే ఏం చెప్పాలి? అవును ఏ పని మీద వచ్చేడు తను?

"రండి" అని మళ్ళీ పిలిచింది డైసీ.

ఇంట్లో ఒక్కర్తే వున్నట్టుంది. ఫర్వాలేదు ధైర్యవంతురాలే!

గదిలో ఓ వారనున్న మడత కుర్చీని తెరిచి అందులో కూర్చోమంది.

సందేహించేడు రామూ.

"కూర్చోండి" అని లోపల గదిలోనికి వెళ్ళి ఓ చిన్న స్టూలు తెచ్చి రామూకి ఎదురుగా కూర్చుంది.

"మరేంలేదు...దారంటపోతూ ఓసారి మిమ్మల్ని చూసిపోదామని వచ్చేను. మీరు అడ్రెస్ ఇచ్చేరుగా"

"మీరు ఇమ్మని అడిగేరు" డైసీ అలా అనడంలో 'నా అంతట నేను ఇవ్వలేదు' అని స్ఫురించింది రామూకి.

"అవునవును... నేను... నేనే అడిగేను...ఎందుకంటే" వాక్యం ఎలా పూర్తి చేస్తాడో అని పరీక్షగా చూసింది డైసీ. "దారంట పోతూవుంటాను కదూ"

"ఎక్కడికి?"

"కబీర్ వీధికి. ఈ పక్కనే వుంది. ఓ లాయరు... బోర్డు... డబ్బు వసూలు చెయ్యటానికి"

"అలాగా?"

కొంచెం సర్దుకున్నాడు. "ఎలాగో వెళ్తున్నాను కదా మీతో కొంచెం మాట్లాడదామని వచ్చేను. మీ సైన్‌బోర్డు మీద అక్షరాలకి షేడింగ్ కావాలంటారా?"

"వాటి గురించి నాకు తెలీదండీ" విసుగ్గాకాక మర్యాద పూర్వకంగానే అందామె. అని లోపల గదిలోకి వెళ్ళింది.

ఊపిరి పోసుకుంటున్న సంభాషణ ఆవిడ జవాబుతో స్తంభించిపోయింది.

ఇలా అవుతుందని రామూ ఊహించ లేదు. డైసీతో ఏం మాట్లాడాలో, ఎలా మాట్లాడాలో ముందుగా తయారయ్యే వచ్చేడు తను.

నిన్నరాత్రి తలా తోకా లేని కలలు గిలిగింతలు పెట్టినప్పుడు, తేరుకుని, నిద్రపట్టక మంచమ్మీద కూర్చుని చాలా సేపు ఆలోచించి సిద్ధంచేసుకున్నాడు. అలంకరణ మీద ఏమాత్రం శ్రద్ధలేని మనిషి చక్కగా గెడ్డంగీసుకుని, తలకి వాసన నూనె రాసుకుని మెత్తగా దువ్వుకున్నాడు. ఈ మధ్యనే కుట్టించిన తెల్ల పేంటూ, పసుపు చొక్కా టక్ చేసుకుని టిప్‌టాప్‌గా ముస్తాబై బయల్దేరేడు.

అతనిలో ఒక్కసారి కలిగిన ఈ

మాచ్పుకి మేనత్త ఆశ్చర్యపోయింది. "కారణం ఏమిటని" ఆమె అడగబోతే "నీకెందుకు?" అని చిరాకుపడ్డాడు.

కాస్సేపటికి డైసీ తిరిగి వచ్చింది.

ఓ చేతిలో బిస్కెట్ల ప్లేటూ, మరో చేతిలో టీ కప్పు రామూకి అందించింది. అందుకుంటూ ఆమెనొకసారి చూసేడు. ఆమె కొలతల్ని అంచనా వేసుకుని, తన కొలతలతో సరిపోల్చుకొని సంతృప్తి పడ్డాడు.

సంజ వెలుగులు కొద్ది కొద్దిగా కరిగి పోతున్నాయి.

తన మానసిక స్థితికి తగ్గట్టుగా ఉంది మసక వెలుతురు.

అది ఆమె పచ్చని శరీరం మీద పడి నలు వైపులా చెదరిపోతోంది. ఆమెను మనసులో అభినందిస్తూ టీ అందుకున్నాడు.



గదిని ఓసారి కలయ చూసేడు. గోడలు బోసిగా వున్నాయి. ఎక్కడా అలంకరణ లేదు. తను కూచున్న కుర్చీ, ఆవిడ వేసుకున్న స్టూలు తప్ప మరో వస్తువు లేదు.

ఓ మూల పేపర్ల కట్టలు కట్టలుగా పడివున్నాయి. వాటినిండా దుమ్ము పేరుకుపోయివుంది.

తూచి తూచి మాట్లాడుతున్న ఈ దతో సంభాషణ కొనసాగించటం, ఆవిడ చరిత్ర గురించి పరామర్శించటం అసాధ్యం అనుకున్నాడు. ఈమెకి నిజంగా పెళ్ళి గనక అయివుంటే ఈ వయసు

తనాన్ని భరించలేక ఆ మొగుడు ఎటోపోయి వుంటాడు అని కూడా అనుకున్నాడు.

అక్షరాల గురించి,వాటి అందచందాల గురించి మాట్లాడుతూ మధ్యలో ఆవిడ వివరాలుకనుక్కుందామని అనుకున్నాడు. కానీ నిశ్చలమైన ఆమె చూపులు, నిర్వి కారమైన ప్రవర్తన ఎదుటి వ్యక్తిని చనువు తీసుకోనివ్వకుండా శాసిస్తున్నాయి.

తన ఖాతాదారుల మనస్తత్వాల గురించి చెబుతూ కుర్ర లాయర్ గురించి, గాజుల దుకాణం వాడి గురించి చెప్పేడు.

ఆమె చిన్నగా నవ్వింది.

తను వచ్చిన పనేవిఁటో స్పష్టంగా తెలియకపోయినా "అమ్మయ్య పని నెరవేరింది" అనుకున్నాడు.

డెసీ వాచి చూసుకుంది.

"మీ కాలాన్ని వృధా చెయ్యటం లేదుకదా!" అని అడిగేడు.

"ఏం?"

"ఏం లేదు. మీకు ముఖ్యమైన పనులున్నాయేమోనని..."

"ఒకావిడ వస్తానంది."

"ఎలాంటావిడ?" అడగాలనుకొని మానేసేడు. బహుశ పొద్దు పోయే వరకు ఇద్దరూ గర్భ నిరోధాన్ని గురించి చర్చించు కుంటారేమో!

ఇంతసేపు డైసీ ఇంట్లో తను కూర్చున్నాడే తప్ప సైన్ బోర్డు విషయం చర్చకే రాలేదు.

ఎలా వస్తుంది 'నాకు తెలీదు' అని ఒక్క మాటలో ఆవిడ తెంచేస్తే. "బోర్డుకి ఓ మూల ఎర్ర త్రికోణం వెయ్యండి" అని మాత్రం చెప్పింది–

అదీ కుటుంబ నియంత్రణ గుర్తు కాబట్టి.

ఇంటికి వెళ్తూ దారిలో మందిరం దగ్గర తాళాల కోసం ఆగేడు. మేనత్త పురాణ శ్రవణంలో మునిగిపోయి వుంటుంది. గేటు దాటి ద్వారం దగ్గర నిలబడి చూసేడు. మేనత్త అటువేపు ఓ వారగా ఒదిగి కూర్చొంది.

తన రాకని తెలియచెయ్యటం ఎలా? పౌరాణికుడి గొంతు ఖంగ్ ఖంగ్ మంటోంది. ఓ మూడు నిమిషాల పాటు రాముా నిలబడ్డాడు. దివ్య దృష్టి వుందేమో మేనత్తకి తన రాకని అల్లంత దూరం నుండి పసిగట్టింది. కాళ్ళు తొక్కుకుంటూ బయటకు వచ్చింది. **తాళాలకోసం రాముా మందిరానికిరావడం, పురాణం మధ్యలో మేనత్త జనాన్ని దాటుకుంటూ రావటం ఇది మొదటిసారి కాదు.**

తాళం చెవి రామూకి అందించి–

"ఇవేళ రుక్మిణీ కళ్యాణం అవుతోందిరా. నేను రావటం ఆలస్యం అవుతుంది" అంది.

"ఒక్క రుక్మిణీ కళ్యాణం ఏవిఁటి– శ్రీకృష్ణుల వారి అష్ట భార్యల కళ్యాణాలన్నీ వినినా– తొందరలేదు" అని వెనక్కి తిరిగేడు.

"అల్మారాలో ఉప్మా మూతపెట్టి వుంచేను. తినటం మరిచిపోకురా నాయినా" అని చెప్పి మందిరంలోకి వెళ్ళిపోయింది అత్త.

* * *

ఇంటికి చేరుకున్నాక వరండాలో సైకిల్‌కి తాళం వేసి, చుట్టూ తిరిగి పెరటి వేపు వెళ్ళేడు.

ఇసుకమేట దాటుకొని రాతి మెట్లు చేరుకున్నాడు.

ఆఖరి మెట్టు మీద జోళ్ళు విప్పి




మెల్లగా పారుతున్న నదిలో పాదాలు తడుపుతూ కూర్చున్నాడు. చంద్ర కాంతి నదినిండా పరుచుకుని వుంది. వెన్నెల అందిస్తోన్న మౌన గీతానికి సరయూ నది గలగలలు స్వరకల్పన చేస్తున్నాయి.

సాయంత్రం డైసీ ఇంట్లో తన వైఖరి నగుబాటుగా అనిపిస్తోంది. ఆమెను ఆకట్టుకోవాలని, తన ప్రాముఖ్యతని ఆవిడ గుర్తించేలా చేసి ఆమెకు చేరువ కావాలని ప్రయత్నించాడు. కాని ఆమెలో అణుమాత్రమైనా చలనం రప్పించలేకపోయాడు. పోగా తన వెకిలితనాన్ని మాత్రం ప్రదర్శించేడు.

ఒంటరిగా వుంటున్న ఓ ఆడపిల్ల ఇంటికెళ్ళి ఏ సాకుతో తలుపు తట్టేడు తను? మంచి మప్పితం వున్న మనిషి కాబట్టి తలుపు తెరిచింది. లేకుంటే తన ముఖం మీదే ఫెడేల్మని వేసివుండేది కాదూ ?

అయితే మరోలా కూడా ఆలోచిస్తోంది మనసు.

తలుపు తీసి లోనికి రమ్మనటానికి ప్రాముఖ్యత లేదని ఎందుకనుకోవాలి ? మనసు అట్టడుగు పొరల్లో ఏ మూలో తనమీద ఇష్టాన్ని దాచిపెట్టిందేమో! కాని సాయంత్రం ఆవిడ మాటల్లో ఏ కోశానా అది స్ఫురించలేదు. ఒక్క వాక్యం కూడా కాస్త 'ఇది'గా లేదు. పోగా మాటల పిసినారితనంతో కొలపెట్టినట్టు మాట్లాడింది. మరి తన ప్రవర్తనో – తలచుకుంటే తల పాతాళంలోకి పాతుకోవాలనిపిస్తోంది.

సెక్సుపరమైన ఆలోచనల్ని, ఊహల్ని తను చాన్నాళ్ళనుండి దూరంగా పెడుతూ వస్తున్నాడు. దానికి తగినట్లు వృత్తిరీత్యా తనకు ఎదురైన వ్యాపారస్తులు, లాయర్లు, డాక్టర్లు వగైరాలంతా మగవాళ్ళే. కాని ఇప్పుడు తొలిసారి డైసీ తగిలింది. తన మనసు ఒడ్డున పడిన చేపలా కొట్టుకుంటోంది. ఆవిడను మరచిపోవాల్సిందే !

బోర్డు పని సగం పూర్తయింది.

డైసీకి చూపించి అభిప్రాయాన్ని తెలుసుకోవాలనుకున్నాడు. బోర్డు పట్టుకుని సైకిల్‌మీద న్యూస్‌బ్లాక్స్ చేరుకుని మేడమీద ఆఫీసులోకి వెళ్ళబోయాడు.

డైసీ ఎవరితోనో మాట్లాడుతోంది. రామూ ప్రవేశంతో వాళ్ళ సంభాషణ ఆగిపోయింది. తలుపు దగ్గర ఓ క్షణం నిలబడి,

"నాకు అట్టే తొందరలేదులెండి... కాస్సేపు పోయాక వస్తాను" అన్నాడు.

"అలాగే" అంది డైసీ పొడిగా.

డైసీని తను చూసి ఆరు రోజులవుతోంది. ఇన్ని రోజుల తర్వాత మళ్ళీ కలుసుకుంటే ఆవిడ ఏమాత్రం ఆసక్తిని గాని, ఆశ్చర్యాన్నిగాని ప్రకటించలేదు; ఎప్పటిలాగే మాటల పిసినారితనం. నయం కళ్ళలోకి సూటిగా చూసిందికాదు.

కళ్ళు నిజంగా మాయదారి లోగిళ్ళు. వాటినే అనుసరిస్తాయి మానవుడి ఆలోచనలు. కళ్ళు తాము చూసిన దృశ్యాల్ని అంతరంగంలోకి ఫోకస్ చేస్తే, ఆలోచనలు ఆ దృశ్యాలకి రంగులు పూయటానికి తయారవుతాయి. మనసులో బొమ్మ మాయం కాగానే పిచ్చిరంగులు మాత్రం చివరికి మిగులుతాయి; ఆశల తోరణాలు తెగిపోతాయి.

అందుకనే ఆమె కళ్ళలోకి తను చూడకూడదు !

నల్లకళ్ళద్దాలు తగిలించుకుంటే తను ఎటువేపో చూస్తూ మాట్లాడినా ఆవిడ పోల్చుకోలేదు.

సైకిల్‌ని మార్కెట్ రోడ్డు వైపు

పోసిచ్చాడు. ఓ సందులో స్మగుల్డు వస్తువులు దొరికే షాపులు చాలావున్నాయి. అందులో ఓ దుకాణం నిండా కళ్ళజోళ్ళు పేర్చి వున్నాయి. ఓ నల్ల కళ్ళద్దాల జత అందుకుని తగిలించుకుని చూశాడు. షాపువాడి ముఖం అస్పష్టంగా వికారంగా కనిపించింది. తను కోరుకునేది అదే కాబట్టి ఆ జత తనకి చాలా నచ్చింది.

ఖరీదు కనుక్కున్నాడు.

"ఏభై రూపాయలు" చెప్పాడు షాపువాడు.



"పది రూపాయలిస్తాను" అన్నాడు రాముా.

"ఇవి హాంగ్‌కాంగ్ గ్లాసులు... పదిహేనిప్పించండి"

"పన్నెండు చేసుకో"

బేరం కుదిరింది. ఇంతసేపూ దీన్ని గమనిస్తున్న ఇద్దరు వ్యక్తుల్లో ఒకడన్నాడు "చాలా చవగ్గా కొట్టేసేడు"

రాముా కళ్ళద్దాలు తగిలించుకుని వాళ్ళిద్దరినీ చూసేడు. ఆఫ్రికా అడవుల్లో

సంచరించే మనుషుల్లా కనిపించేరు. కళ్ల జోడు తీసి చూస్తేమటుకు మామూలు గానే వున్నారు.

రామూ ఈరోజు చాల సాదారకం బట్టలు వేసుకున్నాడు. చొక్కా కాలరు దగ్గర అక్కడక్కడా పీక్కుపోయి దారపు పోగులు వేలాడుతున్నాయి. తనలో ఏమాత్రం ఆకర్షణ లేకుండా వుండాలని అతని తాపత్రయం.

సరిగ్గా అరగంట పూర్తయ్యేసరికి మళ్ళీ ఆఫీసుకొచ్చేడు. తను మేడమెట్లు ఎక్కుతుండగా విజిటర్లు కిందికి దిగుతున్నారు. కళ్ళజోడు తగిలించుకుని గదిలోకి అడుగు పెట్టేడు.

డైసీ అతనికోసం ఎదురుచూస్తోంది. అతను చాలా తక్కువ మాట్లాడి బోర్డుకి చుట్టిన కాయితాన్ని తొలగించేడు. డైసీ కుర్చీలోంచి లేచి బోర్డుకి దగ్గరగా వచ్చింది.

మేలి రకమైన అత్తరు పరిమళం అతని ముఖాన్ని కొట్టింది.

"గుడ్" ఆమె తృప్తిగా అంది. "వీధిలోంచి చూసేవాళ్ళకి కూడా బాగా కనిపించేలా వున్నాయి అక్షరాలు" అంది

"కొలత ప్రకారం ఇవి ఏభై అడుగుల దూరంనుండి చూసేవాళ్ళకి కూడా స్పష్టంగా కనిపిస్తాయి. అందుకే మరుపు కొంచెం ఎక్కువైనా సరే పెద్ద అక్షరాలు రాసేను"

"బాగుంది. చక్కటి పనితనం అని చెప్పుకోవాలి"

"దీనికింకా బోలెడు పనివుంది. మెరుగులు దిద్దడం పూర్తయితే ఇట్ లుక్స్ పెర్‌ఫెక్ట్!"

"పెర్‌ఫెక్ట్!" ఆమె ఆశ్చర్యంగా చూసి కనుబొమ్మలు వింటి బద్దల్లా ఎగరేసింది.

ఇంతవరకూ ఎటువేపో చూస్తూ మాట్లాడిన రామూ అనుకోకుండా కళ్ళద్దాల్లోంచి డైసీని చూసేడు. ఆవిడ ముఖం గుర్రం ముఖంలా సాగదీసినట్లు కనిపిస్తోంది. పెదవులు బంపగా, పళ్ళు ముందుకు తోసుకొచ్చి పారల్లా కనిపిస్తున్నాయి. హాంగ్‌కాంగ్ కళ్ళద్దాల తయారీదారుని పనితనాన్ని అభినందించేడు. మనసులో నవ్వుకున్నాడు.

"ఇంకా ఈ బోర్డుకి ఏం చెయ్యాలి?" అని బోర్డుని మళ్ళీ సమీపించింది. అత్తరు ఘాటుదనం మళ్ళీ అతని మెదడును మొద్దు బారిస్తోంది. మనిషిలోని సంకల్పం కొద్దిగా చలించినట్లు అనిపించింది. బోర్డుకి పెట్టవలసిన మెరుగుల గురించి చెప్పేడు. కాని మనసు స్వాధీనత తప్పుతోంది.

డైసీ అతని చిరుగుల కాలర్ షర్టుని గాని, వెలిసిపోయిన పేంటునిగాని గమనించినట్లులేదు. అతను వెళ్ళిపోడానికి సిద్ధపడుతున్నాడు.

"తొందరగా వెళ్ళవలసినపనివుందా?" అని అడిగింది డైసీ.

ఒక సెకెండుపాటు సంకోచించేడు. "అవును" అని ఒక్కమాట అనివుంటే భవిష్యత్తు మరోలా వుండేదేమో! కాని అతను అలా అనలేదు.

"అయితే కాస్సేపు కూర్చోండి" అంది డైసీ.

వెర్రిగొర్రెలా అనుసరించేడు రామూ. ఆమె తన కుర్చీలో కూర్చొని ఓ క్షణంపాటు అతన్ని నిశితంగా చూసి.

"ఆ కళ్ళద్దాలు నీడపట్టున ఇబ్బందిగా లేదూ మీకూ?" అని అడిగింది.

ఏదో కుంటిసాకు కోసం వెతుక్కు

న్నాడు. "కళ్ళల్లో ఏదో నలకపడి తేనూ"

"బాధ పెడుతోందా?"

"కొద్దిగా" అన్నాడు ఆమెవేపు చూడకుండా. డైసీ చివాలున కుర్చీలోంచి లేచి అతన్ని సమీపించింది. కళ్ళద్దాలు తీసేసి అతని ముఖానికి దగ్గరగా తన ముఖం పెట్టి కళ్ళలోకి పరీక్షగా చూసింది. ఇది ఎంత హఠాత్తుగా జరిగిందంటే డైసీ తిరిగి తన కుర్చీలో కూర్చుని "అబ్బే ఏంలేదు. ఓసారి కళ్ళు వాష్ చేసుకుంటే సరి" అనేటంతవరకు అసలు ఏం జరిగిందో, ఎలా జరిగిందో రాముకి అర్థంకాలేదు.

"ఫస్ట్ ఎయిడ్‌లో కూడా మాకు ట్రయినింగ్ వుంది" అని ఆవిడ అన్న తర్వాత కాస్త సర్దుకుని "అలాగా?" అన్నాడు. కళ్ళద్దాలు ఆవిడ చేతిలోనే వున్నాయి. వాటిని ఓసారి పైకెత్తి వెలుగు వేపు చూసి, అటూ ఇటూ ఆడించి.

"వీటిని అవతల పారేయండి; మంచివి కావు. ముందు ముందు కళ్ళకు హాని చేస్తాయి" అంది.

"అవి హాంగ్‌కాంగ్ కళ్ళద్దాలండీ" గొణుక్కున్నాడు.

* * *

రాత్రి పక్కమీద నిద్రపట్టక అటూ ఇటూ దొర్లేడు. లైటువేసి ఏదో పుస్తకం తీసేడు. మనసు పోవటంలేదు.

ఈ రోజు డైసీ స్పర్శ అతని ఒంట్లో రక్తాన్ని "ఛళ్ళు" మనిపించి పరుగులు తీయించింది. మైకం కమ్మేసింది. అత్తరు వాసన నసాళానికి అంటి మెదడు మొద్దు బారిపోయింది.

నిన్న మొన్నటివరకు తానొక స్వేచ్ఛాజీవి; తన పనేవిటో తప్ప మరో ధ్యాసవుండేదికాదు. కాని ఇప్పుడు. ఈ తపన తప్ప వేరే వ్యాపకం లేదు. ఆమె కళ్ళద్దాలు తీసుకోకపోయినా బాగుండేది. తనకు కాస్త ఉపశమనం కలిగి వుండేది.

ప్రశాంతత కోసం కళ్ళు రెండూ గట్టిగా మూసుకున్నాడు. మూసిన కనురెప్పల్లో ఊహలు రెక్కలు కట్టుకున్నాయి. నోరు విప్పి చెప్పకూడని అసభ్యకర దృశ్యాలు ఊపిరి పోసుకుంటున్నాయి. కళ్ళు తెరిచేడు. అవి తలచుకుంటే తన సంస్కారం తననే అసహ్యించుకుంది.

తను జీవితాంతం బ్రహ్మచారిగా వుండిపోవాలని గతంలో నిర్ణయించుకున్నాడు. ఎన్నో మంచిమంచి సంబంధాలు వచ్చేయి; వస్తున్నాయి. అన్నిటినీ కాదంటున్నాడు. గత సంవత్సరం నాగపూర్ నుండి ఎకౌంట్స్ ఆఫీసరు ఒకాయన పిల్లనిస్తామని వచ్చేడు. అమ్మాయి చాలా అందంగా వుంది. పైగా చదువుకుంది. సంబంధం ఖాయం చేసుకోవాలని ఆ పెద్దమనిషి ఎంతలా ప్రయత్నించేడని! ఆనంద్ భవన్ హోటల్ గదిలో అమ్మాయిని తనతో ఓ సాయంత్రం అంతా వదిలిపెట్టి వెళ్ళిపోయేడు. అయినా తను చలించలేదు. "జీవితంలో పెళ్ళి కంటే సాధించవలసినవి చాలా వున్నాయి" అని చెప్పి త్రోసిరాజని వచ్చేసేడు తను.

ఒకదాని తర్వాత ఒకటిగా చాలా సంబంధాలొచ్చేయి. అందరికీ ఒకటే జవాబు?...

మరి ఇప్పుడు దేనికీ కలవరం? అందమైన అమ్మాయిలు తన జీవితంలోకి రాబోయే తరుణంలో హృదయానికి గొళ్ళెం వేసి, తిరుగులేని నిర్ణయాల్ని




తీర్మానించుకున్న తను ఓటమి చివరి అంచుల్ని పట్టుకుని ఊగిసలాడుతున్నాడా?

"అవును" అంది మనిషిలో నిజాయితీ.

నువ్వు అనుకుంటున్నది అక్షరాలా నిజం. నువ్వు పరాజితుల్లో చేరిపోయేవు. తల్ని నువ్వు ఊహించుకోలేవూ? నీలో సైతాన్–డెసి పైట గాలికెగిరి పోవాలనీ, ఆమెని నీతొడమీద కూర్చోబెట్టుకోవాలనీ, నీ పెదవులతో ఆమె పెదవుల్ని బంధించాలనీ అనుకోలేవూ? అవును. ఆడ బతుకులో విషాదం అదే! ఆమె ఒక భోగవస్తువు. వయసు ముదిరి అంద



నిర్ణయాలు, తీర్మానాలు అంటూ పెద్ద కబుర్లు చెబుతున్నావు. గుండె మీద చెయ్యి వేసుకుని అంతరాంతరాల్లో వున్న ఉద్దేశాల్ని నిజంగా ఒప్పుకో.

ఆ రోజున బోర్డు కొలతల గురించి ఆమెతో చర్చించిన రోజున ఆమె కొల

చందాలు ముడతపడేవరకు ఆమెను 'అలా' తప్ప మరోలా చూడం; అర్థం చేసుకోం.

"నన్నే దెయ్యమో ఆవహించింది. నా ఊహల సన్నజాజి పందిరి నిండా తెగుళ్ళు—నా ఆశయాల పారిజాత వృక్షాల మీద పిడుగులు..."

"రామూ! ఇంకా పడుకోలేదూ? చదువుతూనే వున్నావా?" లైటు వెలుగుతుండటం చూసి అవతల గదిలోంచి మేనత్త కేకేసింది.

ఎప్పటిలాగే అతనికి చిరాకు ముంచుకొచ్చింది. 'నేనెలా వుంటే ఈవిడకెందుకు? అన్నీ ఆవిడకే కావాలి. అసలు నాకు స్వాతంత్ర్యం లేదు. తిండి విషయంలో, పడుకునే విషయంలో, ఆరోగ్యం విషయంలో అత్తయ్యకి బానిసని. ఆలోచనల్లో డైసీకి బానిసని. నాకు విముక్తి లేదు' అని గొణుక్కున్నాడు.

* * *

వారం రోజుల తరువాత పూర్తయిన బోర్డుతో డైసీ ఆఫీసుకి చేరుకున్నాడు. మెట్లెక్కే ముందు గుండెని గట్టి చేసుకుని సడలిపోయిన సంకల్పాన్ని సరిచేసుకున్నాడు.

"మిమ్మల్ని మళ్ళీ చూస్తాననుకోలేదు. ఇన్నాళ్ళూ ఎందుకు రాలేదు?" అని అడిగింది డైసీ.

"బిజీగా వున్నాను" అని మాత్రం చెప్పి బోర్డువేపు చూశాడు. కళ్ళలోకి చూడకూడదు...కనికట్టు చేస్తుంది.

"బోర్డు ఫిక్స్ చెయ్యమంటారా?"

"అలాగే" అని బాల్కనీలోకి తీసుకెళ్ళింది. పిట్టగోడని ఆనుకుని వీధిగోడవెపు ఒంగి ఓచోటు చూపించింది. అలా వంగినపుడు పలచని నీరెండలో ఒంపులు పిచ్చెక్కించే ప్రమాదం వుందని గోడవేపే చూశాడు. అవతల రోడ్డు చాలా రద్దీగా వుంది.

పిట్టగోడ దిగి జాగ్రత్తగా కాంక్రీటు ప్రొజెక్షన్‌మీద నిలబడి పెన్సిల్‌తో మార్కు చేసుకుని "ఇక్కడే కదా?" అన్నాడు.

ఆమె మళ్ళీ వంగింది. ఇద్దరి తలకాయలూ దగ్గరగా వచ్చాయి. మళ్ళీ అత్తరు వాసన. మళ్ళీ అదుపు తప్పుతున్న ఆలోచనలు. మరోసారి ఓటమి. "ఎంత అందంగా వుంది" అనుకోక తప్పలేదు. భుజాన తగిలించివున్న సంచిలోంచి సుత్తి, మేకులు తీశాడు. బోర్డు ఫిక్స్ చెయ్యటం పూర్తయింది.

వీధిలోంచి బోర్డును చూడాలని ఇద్దరూ కిందికి దిగేరు.

దారంట పోతున్న జనం అక్కడ నిలబడి బోర్డు చదువుకుంటూ రకరకాలుగా వ్యాఖ్యానించుకుపోతున్నారు.

డైసీ, రామూ రోడ్డుకి అటువైపు వెళ్ళి బోర్డుని చూస్తున్నారు.

ఆరుబయట వెలుగులో డైసీని చూడ్డం ఇదే మొదటిసారి. ఆమె తల పైకెత్తి అక్షరాలు చదువుతోంది. పక్కనే నిలబడి ఆమెను ఓ కంట కనిపెడుతున్నాడు.

ఆమె మెడ శంఖంలా వుంది. పెదవులకి, చుబుకానికి మధ్య ఒంపు నాజూగ్గా వుంది. ఆ రెండింటికీ సరిపోయేలా కొలిచి అమర్చినట్లుంది సన్నని ముక్కు. విశాలమైన నొసటిమీద అరచేతిని ఏటవాలుగా వుంచింది. అరచేతి నీడలో ఎండ తీవ్రతకి అరమోడ్చిన కళ్ళు చేపల్లా మెరిసిపోతున్నాయి. తెల్లటి బుగ్గలమీద సన్నని




ముటిమలు రెండు ఎండ వెలుగులో స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"అక్షరాలు బాగా వున్నాయి. వాటి కిచ్చిన షేడింగు ఇంకా బాగుంది" అంది డైసీ బిల్డింగువేపు నడుస్తూ.

"నా బోర్డు మీ ఆఫీసుని బిజీగా వుంచాలి" అని నవ్వుతూ రోడ్డువారగా పెట్టిన సైకిల్‌కి సంచీ తగిలించి తాళం తీశాడు.

అతని మనసు తేలికగా వుంది. పని పూర్తయింది. మరోసారి ఈ ఛాయలకి రాకుండా గత రెండువారాల సంఘర్షణనీ కునికిపాట్లు పడుతూ చూసిన సెకండ్ షో సినిమాలా మరిచిపోయి పధ్నాలుగురోజుల కిందటి జీవితాన్ని పునరావిష్కరించు కోవాలనుకున్నాడు.

"మరి మీ బిల్లు ?" అని అడిగింది డైసీ మెట్లు ఎక్కబోతూ.

"పోస్టులో పంపిస్తాను. చెక్ పంపే యండి" అని మరి వ్యవధి ఇవ్వకుండా "గుడ్‌బై-థేంక్స్" అన్నాడు.

"ఓ యస్-థేంక్యూ" అని వెనక్కి తిరిగింది. అతను ఊపిరి తీసుకున్నాడు.

బోర్డ్‌లెస్ హోటల్‌లో రాయని ఖాతాని పెంచుకుందుకు రామూ సైకిలు హుషారుగా ముందుకు సాగింది.




మధ్యాహ్నం ఎండవేళ!

నాలుగు రాత్రులు జాగరణ చేసిన వాడిలా ఒళ్ళు మరిచి నిద్ర పోతున్నాడు రామూ.

"రామూ లేరా" అంటూ మేనత్త లేపింది.

మాటాడకుండా చిరాగ్గా మరో వేపు తిరిగేడు.

"లేరా నీ కోసం ఎవరో అమ్మాయి వచ్చినట్టుంది. గుమ్మంలో నిలబడివుంది.

రామూ జవాబు చెప్పలేదు. ఈ సమయంలో ఎవరొచ్చినా చూసే మూడ్‌లో లేడు. అందునా ఆడపిల్ల అయితే అసలు చూసేది లేదు.

అత్త కాసేపు పిలవడం అతనికి జ్ఞాపకం వుంది. మళ్ళీ నిద్రలోకి జారుకున్నాడు. నిద్రనుండి లేచి బద్ధకాన్ని ఒదిలించుకుంటూ వుంటే వంటింట్లోంచి మరో గొంతు వినబడింది. తన గది గుమ్మంలోంచి తొంగిచూసేడు. గుండె జారిపోయింది.

"భగవాన్ ఈవిడ ఇక్కడికి దాపురించిందేమిటి? నా సుఖాన్ని చూసి సహించలేకపోతున్నావా తండ్రీ?" అను కున్నాడు.

వంటింటి గుమ్మం దగ్గర చాప మీద డైసీ కూర్చొని కాఫీ తాగుతోంది. వంటింట్లోంచి మేనత్త గొంతు వినిపిస్తోంది. మామూలే- అందరికీ వినిపించే తన జీవిత కథను డైసీకి చెబుతోంది. సట్టింట్లో చిన్న చాపమీద వంటింటి వేపు ముఖం పెట్టుకొని డైసీ ఒద్దికగా, సంసార పక్షంగా కూర్చుంటే ఆ పరిసరాలకి ఏదో కళ వచ్చినట్టనిపించింది.

రామూ లుంగీలో వున్నాడు. పైన బనీను కూడా లేదు. 'ఈ వేషంలో నన్ను చూస్తే...' పైమీద తువ్వాలు వేసుకొని అలికిడి చెయ్యకుండా ఆమె వెనకనుండి

పెరట్లో కొచ్చేడు. అదృష్టవశాత్తూ మేనత్త కూడా వంటింట్లో అల్మరావేపు తిరిగి వుంది. లేకపోతే అక్కడే నిలబెట్టి పరువు తీసేది.

డైసీ తననివెదుక్కుంటూ ఇంటికెందు కొచ్చినట్టు? ఆమె చెప్పిన పని పూర్తి చేసి మరో సారి ఆ ఛాయలకు పోకూడదని తీర్మానించుకున్నాడు తను. ఆ మర్నాడు పోస్టులో బిల్లు కూడా పంపించేశాడు.

ఇది జరిగి రెండు వారాలు కావస్తోంది. ఆ ఉచ్చునుండి బయట పడి ఎప్పటిలా హాయిగా బతుకుతున్నాడు. పంపిన బిల్లుకి ప్రతిఫలం పోస్టులో వస్తుం దని ఎదురు చూస్తున్నాడే తప్ప- స్వయంగా పోయి వసూలు చేసుకోవాలను కోలేదు. తన ఆలోచనల్లో ఆమె ఆక్ర మించుకొన్న భాగం పూర్తిగా చింపే



సాడు. కాని డైసీ సాక్షాత్తూ తన నట్టింట్లో వుందిప్పుడు.

పెరట్లో ముఖం కడుక్కొంటూ ఆలో చిస్తున్నాడు.

బట్టలు వేసుకొని ఆవిడ కంటపడకుండా పెరటి దారంట పోతే– ఏమైనా అను కుంటుందేమో? అనుకుంటే అనుకోనీ మరేం బ్రహ్మాండం బద్దలు కాదు. ఆవిడ తనంతట తానుగా వచ్చిందిగాని తను పిలవలేదు కదా! ఇంట్లోకి ఆహ్వానించిన అత్తయ్యే తిరిగి సాగనంపుతుంది. జీవిత కథని వినిపించిన సరదా కూడా తీరుతుంది.

అలా అనుకున్నాడే గాని ముఖం కడుక్కొని తన గదిలోకి వెళ్ళేడు.మహా రాణులు మనసుపడేలా మల్లె పూవులా ముస్తాబై గది బయటకొచ్చేడు.

అత్తయ్యా ఇంకా కథ చెబుతూనే ఉంది.

గది బయటకొచ్చిన రామూ కొంచెం సర్దుకొని, ''ఏ వి ఁటి లా వచ్చేరు!'' అన్నాడు నవ్వు పులుముకుంటూ.

ఓ చేతిని చాప మీద ఊతగా పెట్టు కొని, మరో చేత్తో ముఖాన ముసురుకొన్న ముంగురులు సర్దుకొంటూ వెనక్కి తిరిగి చూసింది డైసీ.

''సారీ! ఈ రోజు బాగా నిద్ర పట్టే సింది" అన్నాడు.

"ఫర్వాలేదులెండి..మీఅత్తయ్యగారితో బాగా కాలక్షేపం అవుతోంది" అంది డైసీ.

''ఆవిడ చేసే వుద్యోగం గురించి చెప్పిందిరా– భగవంతుడు తలచుకోడం వల్ల కాదూ పిల్లా జెల్లా కలిగేది?" అంది మేనత్త వంటిట్లోంచి బయటకొస్తూ.

"భగవంతుడు అలా తలచుకోడం ప్రభుత్వానికిష్టం లేదులే అత్తా'' అన్నాడు రామూ. అతని జోక్‌ని డైసీ పట్టించుకో లేదు. లేచి నిలబడింది.

''క్షమించండి ! మా ఇంట్లో చాపలే తప్ప కుర్చీలు లేవు" ఇబ్బందిగా ముఖం పెడుతూ అన్నాడు రామూ.

''ఎక్కడ కూర్చుంటే మాత్రం ఏముందిలెండి? నాకు బాగా జ్ఞానం వచ్చే దాకా కుర్చీ అంటే ఏవిఁటో ఎరుగను. మా పల్లెలో ఒక్క మునసబు గారింట్లో మాత్రం ఉండేదో కుర్చీ – అది ఏ కలె క్టరో తనిఖీకి వచ్చేప్పుడు మాత్రం బయ టకు తీసుకొచ్చేవారు" అంటూ తన హేండ్ బాగ్ తెరచి ఓ కవర్ తీసింది డైసీ.

''ఇదిగో చెక్కు– మీరు పంపిన బిల్లు మీద అడ్రస్ చూసేను. స్వయంగా అందజేసినట్లుంటుందని మీ ఇంటికి వచ్చేను''అని అందించింది.

"థేంక్సు" అని అందుకొని, తన గది లోకి దారి చూపించేడు. గదిలో చాప మీద డైసీ కూర్చుంది.

''ఇది మా తాతలనాటి ఇల్లు. నాకు జ్ఞానం రాని వయసులో అమ్మా నాన్న పోయేరు. అప్పటి నుండి నన్ను పెంచి పెద్ద చేసింది మా మేనత్తే. ఇంటి పెత్తనం అంతా ఆవిడకే వదిలేసేను" అన్నాడు రామూ.

''ఇంటి వెనుక ఆ నది చాలా అందంగా వుంది. నిజంగా ఇదో అదృష్టం" అంటూ ఇంటిని మెచ్చుకుంది డైసీ.

ఓ క్షణం ఇద్దరి మధ్యా మాటలు పలచ బడ్డాయి. మళ్ళీ డైసీయే ప్రారంభించింది.

"మీకో విషయం చెప్పి, మీ అంగీకా రాన్ని కనుక్కుందామని వచ్చేను"

"రామూ మౌనంగా వింటున్నాడు.

ఈ చుట్టు పక్కల పల్లెటూళ్ళలో మా కుటుంబ నియంత్రణ కేంద్రం పెద్ద ఎత్తున ప్రచారాన్ని నిర్వహించాలనుకుంటోంది. మీరు ఒప్పుకుంటే కొంత పని అప్పచెప్పాలనుకుంటున్నాను..."

''నేనేం చెయ్యాలంటావు?''

"కొద్ది రోజుల్లో నేను ప్రాథమిక పరిశీలన కోసం ఈ చుట్టుపక్క గ్రామాలు టూర్ చెయ్యబోతున్నాను. అక్కడక్కడ మా ప్రచారానికి సంబంధించిన సందేశాల్ని- చాన్నాళ్ళపాటు వుండేలా రాసి వుంచడం కోసం అనువైన గోడల్ని ఎన్నుకోబోతున్నాను.

హెడ్‌క్వార్టర్సు ఆదేశం మేరకు 'భార్యా భర్తా- అదో బాబూ ఇదో పాపా' బొమ్మ వేసి 'మేం ఇద్దరం- మాకిద్దరు' అని రాయాల్సి ఉంటుంది..."

ఆవిడ సీరియస్‌నెస్ చూసి రాముకి నవ్వొచ్చింది. డైసీ అఫెండ్ అయింది.

"ఇందులో నాకే జోకూ కనిపించలేదు" అంది కళ్ళు చిట్లించి.

ఏదో సంజాయిషీ చెప్పాలి కనుక "అబ్బెబ్బే అందుకు కాదండీ- మా అత్తయ్య అన్నమాట జ్ఞాపకానికొస్తేనూ" అన్నాడు.

"ఏ మాట?" డైసీ ముఖం ఎర్రబారింది. తన ఆశయాల్ని అతడు ఎగతాళిచేస్తున్నట్లనిపించింది. "దేశంలో బతికున్న వాళ్ళకే ప్రాథమిక అవసరాలు కరువవుతున్నప్పుడు - ప్రతి చిన్న అవసరానికి పెద్ద పెద్ద క్యూలు, అవిద్య, ఆకలి, దరిద్రం, నిరుద్యోగం హద్దులు మీరి పెరిగిపోతున్నప్పుడు- పుట్టబోయే తరానికి పిడికెడు మట్టికూడా దొరకనప్పుడు సమస్యల్ని పరిష్కరించడానికి బాధ్యతగల వ్యక్తిగా నేను ముందుకు రావలసిన అవసరం లేదంటారా?"

తను ఏమాత్రం పట్టించుకోని విషయాన్ని ఇంత సీరియస్‌గా,సిన్సియర్‌గా తీసుకుంటుందనిగాని, తన ప్రవర్తనని అపార్థం చేసుకుంటుందనిగాని రాము అనుకోలేదు. వృత్తిరీత్యా తనకు సంబంధించినంతవరకూ అప్పచెప్పిన పని పూర్తిచెయ్యటమే తప్ప పని అప్పగించిన వాళ్ళ ఆశయాల్ని, ఆ ఆశయాల పట్ల వాళ్ళ చిత్తశుద్ధిని ఇంతవరకు పట్టించుకున్నది లేదు. గతంలో ఎందరో ఆఫీసర్లకి బోర్డులు రాసిపెట్టేడు. వాళ్ళంతా ఫైళ్ళని ఎర్రటేపులతో చుట్టి పక్కకు నెట్టేవాళ్ళే తప్ప పని చేసేవాళ్ళు కాదని తెలుసుకున్నాడు. ఇప్పుడు డైసీనికూడా అదేరకం వ్యక్తిగా అపార్థంచేసుకున్నాడు. కాని ఈమె జనాభా సమస్యని లోతుగా పరిశీలించింది. అదొక పెనుభూతంలా, ముసకొట్టే జీమూతంలా ఆవిడకి కనిపించింది. సమస్యా పరిష్కారాన్ని యజ్ఞంలా భావించి ఆమె సైతం సమిధనొక్కటి ఆహుతివ్వాలని నడుంకట్టి నిలబడింది.

తన పొరబాటును రాము సరిచేసుకున్నాడు. ఇకముందు ఆమె నిజాయితీని ఎగతాళిచేసేలా ప్రవర్తించకూడదనీ, ఆమెను ఏ విధంగానూ గాయపరచకూడదనీ నిశ్చయించుకున్నాడు.

* * *

రాము డైసీతో గ్రామ సంచారానికి వెళ్ళిన మూడువారాల్లోనూ పనిపట్ల ఆమె నిజాయితీని మరింతగా అర్థం చేసుకున్నాడు. ఆమెతో నడచిన దూరాల్నీ, తిరిగిన ప్రదేశాల్నీ, దిక్కుల్నీ, దినాల్నీ అన్నీ మరచిపోయేడు. ఆమె ముందుగా తయారుచేసుకున్న కార్యక్రమాన్ని తూచ తప్పకుండా పాటిస్తోంది.





రైళ్ళలో, బస్సులో, టాక్సీలో— అవసరమైనప్పుడు లారీలో కూడ ప్రయాణం సాగింది. ఫలానారోజు ఫలానా గ్రామానికి వెళ్ళాలని కార్యక్రమంలో రాసివుంటే అక్కడికి వెళ్ళి తీరవలసిందే! ఎన్ని ఇబ్బందులైనా వెనుదిరిగేది లేదు. ఆమెలో ఎక్కడికక్కడ సర్దుకొనిపోయే తత్వం రాముకు ఆశ్చర్యం కలిగించింది. తను తెచ్చుకున్న చిన్న జంబుఖానాని ఎక్కడ పడితే అక్కడ పరుచుకుని హాయిగా నిద్రపోయేది. ఆహారాన్ని నిలువచేసుకోడానికి ఓ చిన్న డబ్బా, నీళ్ళ సీసా తన సంచీలో పెట్టుకొని–రామూని కూడా అలాతెచ్చుకోమంది.ఆహారం విషయంలో ఆమెకు ఎటువంటి పట్టింపులు వున్నట్టు లేదు. అన్నం, గుడ్లు, చేప, మాంసం రొట్టె. ఒకటని ఏమిటి తినడానికి ఎక్కడ ఏది దొరికితే అక్కడ దానితో డబ్బా నింపుకొనేది. మేనత్త సంరక్షణలో శుద్ధ శాకాహారిగా పెరిగిన రామూకి చాలా ఇబ్బందులు ఎదురయ్యేవి. డైసీ కోసం ఇష్టం వున్నా లేకున్నా అన్నీ మౌనంగా తింటూ బాధపడేవాడు. తొలిసారి మాంసం తిన్న రోజు అతని అవస్థ వర్ణనాతీతం. ఆకలి వేసినప్పుడు డబ్బాలు తెరుచుకుని పొలం గట్టున కొబ్బరి చెట్ల నీడలోనో, పంచాయితీ ఆఫీసు వరండాల మీదనో, పాఠశాల గదుల్లోనో కూర్చొని పొట్ట నింపుకొనేవారు. బయలు ప్రదేశంలో వున్న నూతిలో నీళ్ళు తోడుకుని, అక్కడే స్నానం చేసి, శాస్త్ర చాటైన ప్రదేశంలోకి వెళ్ళి రామూని దూరంగా వెళ్ళమని చెప్పి డైసీ బట్టలు ఆరబెట్టుకునేది. సుఖాల కోసం తాపత్రయ పడకుండా, లేనిదాని కోసం విసుక్కోకుండా ఎక్కడికక్కడ సర్దుకుపోయేది. అట్టడుగువాళ్ళ ఆతిథ్యాన్ని స్వీకరించడం కోసం గుడిసెలకు వెళ్ళేది.

"దేశంలో కోట్లాది మంది ఏ రకమైన బతుకు ఈడుస్తున్నారో– ఆ రకంగా కనీసం ఈ నాలుగు రోజులైనా బతికి చూద్దాం. పట్టణాల్లో సౌకర్యాల మధ్య బతికే మన బతుకులు యాంత్రికమైనవి; అవి సమస్యల నుండి మనల్ని వేరు చేసేవి" అంటూ వుండేది.

"మరి మీరు పట్టణంలో ఎందుకు జీవిస్తున్నట్టు?" అని రామూ అడిగితే–

"ఎప్పటికైనా ఓ చిన్న పల్లెటూళ్లో అతి సాధారణమైన గుడిసెలోనే జీవించాలనుకుంటున్నాను" అనేది.

తీరికవేళలో డైసీ గురించే రామూ ఆలోచించేవాడు.

ఆమె ముఖంలో కళలు ఎప్పుడు ఎలా మారుతాయో చెప్పడం కష్టం. ఒకోసారి అతనికి అతి సామాన్యంగా కనిపించే విషయాన్ని ఆవిడ చాలా సీరియస్‌గా తీసుకుని కళ్ళెర్రజేసేది. కారణాలు ఆరా తియ్యడానికి అతను ప్రయత్నించేవాడు కాదు. అలాచేస్తే ఆవిడ మరింతగా విసుక్కుంటుంది.

"నాకు చేతనైన రీతిలో ప్రజాసేవ చేయాలన్నదే నా ఆశయం. దానికి నేనెటువంటి జీవితానికైనా సిద్ధంగా వున్నాను. ఈ ప్రాంతాల్లో జనాభా పెరుగుదల విపరీతంగా వుంది. దీన్ని అరికట్టేపని నాకు అప్పగించబడింది. నా కృషి ఫలించి కనీసం అయిదు శాతం పెరుగుదల అరికట్టగలిగినా సంతోషిస్తాను" అంది.

'ముఖాన్ని అదోలా పెట్టుకుని మాట్లాడకపోతే— దానికి రవ్వంత చిరునవ్వు చిటికెడు స్నేహశీలత జోడించకూడదూ?' అనుకున్నాడు రామూ. అలా అడుగు

దామని చాలాసార్లు ప్రయత్నించి ఆమె కళ్ళు చూసి వెనక్కి తగ్గేడు. ఈ పర్యటనలో ఆమెగురించి చాలా పరిశోధించేడు. ఒకవేపు నవ్వుతుంది– మరోవేపు మూతి బిగిస్తుంది. ఓసారి గలగల మాట్లాడుతుంది– మరోసారి భరింపరాని మౌనాన్ని స్వీకరిస్తుంది. తన పని గురించి ప్రస్తావన రానంతసేపూ బాగానే వుంటుంది. "జనాభా" అన్నమాట గుర్తుకురావటం ఆలస్యం ఎదుటివాళ్ళ గుండెల్లో గాభరా పుట్టిస్తుంది.

"ఈవిడ చెప్పిన ప్రకారం అక్షరాలు రాయడం నాపనిగానీ నన్నుకూడా మతం పుచ్చుకోమంటే ఎలా ?" అని గొణుక్కునేవాడు రామూ. అప్పుడప్పుడు ఏదో జోక్ పేలుద్దామనుకొని, తను తీసుకున్న నిర్ణయం జ్ఞాపకం వొచ్చి ఆగిపోయేవాడు. ఇద్దరిమధ్య ఉన్న సంబంధం కేవలం బిజినెస్‌కి సంబంధించినదే అయినా– ఆవిడ తన స్పెషల్ కష్టమర్! అందుకే చిర్రుబుర్రులాడే భార్యని అనుసయించే భర్తలాగ చాలా కన్సిడరేట్‌గా వుంటున్నాడు. "అవును ఈవిడ నా భార్య ఎందుకు కాకూడదు?" అనుకొని "తొందరపడకూడదు. టైముంది" అనుకునేవాడు. "చూడ్డానికి మెత్తగా కనిపిస్తుంది గాని మనిషి చిచ్చరపిడుగు". పెళ్ళయిన తరువాత ఆవిడ చూపులు చిందులు తొక్కినప్పుడల్లా అతనికి బోర్డ్‌లెస్ హోటలేగతి.

అతని మనసులో రకరకాల ఆలోచనలు ముసురుకొంటున్నాయి!

దూరంగా కొండలు దాటుకుని మబ్బులు తరుముకొస్తున్నాయి!

వాళ్ళిద్దరూ కూర్చున్న బస్సు గతుకుల రోడ్డు మీద దుమ్ములేపుకుంటూ పోతోంది. డైసీ కూర్చున్న సీటుకి రెండు వరసల వెనుకలో కూర్చున్న రామూ దారిపక్క పరుగులు తీస్తున్న దృశ్యాల్ని చూస్తున్నాడు.

* * *

వెళ్ళిన ప్రతిచోట ఒకటే దినచర్య! ఓ ఊరు చేరుకున్న వెంటనే పాఠశాల గదిలోనో, ఇంటి అరుగుమీదనో, చెట్టు నీడలోనో ముందు స్థిరపడి, సందేశాలు రాయడానికి అనువైన గోడల్ని ఎంచుకోడానికి రామూని పంపేది. తను స్థానికంగావున్న ప్రభుత్వోద్యోగినో, ఊరి పెద్దనో కలుసుకుని, వాళ్ళ సహకారంతో జనన మరణాల చిట్టాలు సేకరించి వివరాలు డైరీలో నోట్ చేసుకొనేది. ఓ రచ్చబండ దగ్గర ఆడా మాగా, చిన్నా పెద్దా – అందర్నీ సమావేశపరచి ధైర్యంగా ధారాళంగా ప్రసంగించేది.

వాళ్ళకి అర్థమయ్యే భాషలో మానవ శరీరం గురించి, అవయవ నిర్మాణం గురించి, స్త్రీ పురుషుల లైంగిక సంబంధాల గురించి వివరంగా చెప్పేది. శిశు జననాన్ని గురించి చెబుతూ దాన్ని ఎలా నిరోధించవచ్చో బోధపరచేది. అప్పుడు తనతోపాటు తీసుకొచ్చిన పెద్ద పెద్ద పటాలు చూపించి వివరించేది. నల్లబల్ల అందుబాటులో వుంటే స్వయంగా సుద్ద ముక్కతో బొమ్మలు వేసి చూపించేది. చాలా రహస్యమైన విషయాన్ని విప్పి చెప్పవలసినప్పుడు కూడా ఇసుమంత సిగ్గుగాని, జంకుగాని లేకుండా నిర్భయంగా ప్రవర్తించేది. వింటున్న మగవాళ్ళు కాస్త సకిలించినా, ఆడజనం సిగ్గుతో ముడుచుకుపోయినా కేవలం తన చూపులతో వాళ్ళని సరిచేసేది. అక్కడ చేరిన చిన్న పిల్లల్ని పెద్దవాళ్ళు




తరిమివెయ్యబోతే వారించి "మీ కన్నా వాళ్ళే ముఖ్యంగా తెలుసుకోవాలి. ముందు ముందు అర్థంచేసుకుని బాగుపడతారు" అనేది. అయితే పసివాళ్ళని లాలనగా నిమరడంగాని, నవ్వుతూ పలకరించడం గాని చేసేదికాదు. "ఇక్కడేదో దాచి పెట్టినట్లు మందలు మందలుగా పుట్టు కొస్తున్నారు" అనే భావం ఆ విడ చూపులో రామూకి స్ఫురించేది.

రామూ ఓ ఇంటిగోడని ఎన్నుకొని ఆమెకు చూపించినప్పుడు పరిశీలనగా చూసి ఆ ఇంటి యజమానితో మాట్లాడి అద్దెకు తీసుకునే ఒప్పందాన్ని కుదుర్చు కునేది. ఆ తర్వాత రామూతో వివరంగా చర్చించేది.

"ఇప్పుడు మనం గోడలు ఎన్ను కుంటున్నాం. తర్వాత మీరు ఇటువెపు వచ్చి సందేశాలు రాసిపెట్టాలి. ప్రస్తు తానికి ఓ ముప్పై ఎంపిక చేద్దామను

కుంటున్నాను. ఎంపిక పూర్తయిన వెంటనే మీరు సాధ్యమైనంత తొందరలో ఇటువచ్చి పని పూర్తిచెయ్యాలి. మన ప్రచారం ఇక్కడ బాగా నాటుకుపోయిన తర్వాత ఓ మెడికల్ టీమ్‌తో ఇటువచ్చి ఆపరేషన్లు, అవీ జరిపిస్తాను. చాలా మట్టుకు మీ మీదే ఆధారపడివుంది. మీరెంత త్వరగా పని పూర్తిచేస్తే జనాని కంత తొందరగా ఖర్చు తక్కుతుంది. మీకు సహాయం కావాలంటే మా ఆఫీసు నుండి ఎవరినైనా పంపగలను"

"మరెవరో ఎందుకు! మీరే రాకూడదూ?" అందామనుకుని ఆగిపోయేడు రామూ.

* * *

ఆమె ఎప్పుడైనా కాస్త సవ్వే వేళ అంటూ వుంటే—ఆమె గతాన్ని గురించి, జీవితాన్ని గురించి ఏవేవో అడగాలనుకునేవాడు రామూ. ఓ చోట పనిపూర్తి కాగానే కాసేపు విశ్రాంతి తీసుకుని వెంటనే మరో వూరు ప్రయాణం అయ్యేవారు. బస్సుకోసంఎండలో ఎంతసేపైనా నిరీక్షించడానికి వెనుకాడేది కాదు. కళ్ళు మూసుకొని బస్సు వచ్చేదాకా ఏ చెట్టు మొదట్లోనో కూర్చునేది. చుట్టుపక్కల చూడ్డంగాని, తనవేపు చూస్తున్నవాళ్ళతో మాట్లాడ్డంగాని చేసేదికాదు. ఎవరినీ ఆకర్షించకుండా ఉండడంకోసం ముతక చీర కట్టుకునేది. ముఖానికి పౌడరు రాసుకోడంగాని, తల అందంగా దువ్వుకోడం గాని చెయ్యకుండా గాలికి తల రేగిపోతే అలా చేత్తోనే సవరించుకునేది. అయినా ఆమెఅవయవాలపొందిక చూపరులదృష్టిని మరోవైపు పోనిచ్చేవికావు. చాలా మంది పల్లెజనం ఆమెను ఎబార్షన్లు చేసే డాక్టరు అనుకునేవారు. ఇద్దరు ముగ్గురయితే ఆ పని చేసిపెట్టమని అడిగేరు కూడా! వాళ్ళకి తన ఉద్యోగం గురించి ఓపికగా చెప్పి, త్వరలో వైద్యబృందం వస్తుందని, ఆపరేషన్లు చేయించుకోమని సలహా ఇచ్చింది.

ప్రజల అజ్ఞానం, నిరక్షరాస్యత, పేదరికం—వీటి గురించి డైసీ మాట్లాడుతున్నప్పుడు—

"మీకీ సేవా దృక్పథం ఎప్పుడు అలవడింది?" అని రామూ అడిగేడు.

"చాలా చిన్నప్పుడు ఒక క్రైస్తవ మత గురువు వల్ల నాలో ఉత్తేజం కలిగింది" అని మాత్రం చెప్పి వూరుకుంది. అంతకుమించి అతను ఎంత ప్రయత్నించినా గతంలోకి వెళ్ళింది కాదు.

ఇంతలో బస్సు రావడంతో రామూ తన ప్రయత్నం విరమించుకున్నాడు.

* * *

బస్సు ఆగింది. ఇద్దరూ దిగేరు. దారి పక్క మర్రి చెట్టు, దాని వెనుక చిన్న చిన్న గుట్టలు, దూరంగా కొండలు కనిపిస్తున్నాయి.

"అటు చూడండి" అంటూ కొండల వేపు చూపించి "వాటి వెనుక ఓ కొండ గ్రామానికి వెళ్ళాలి. మూడు మైళ్ళు కాలినడకన పోవాలే తప్ప మరో సాధనం లేదు" అంటూ డైసీ తన సామాన్లు మోసుకుని ముందుకు సాగింది.

రామూకి చికాకువేసింది. ఇల్లు వదిలి చాలా రోజులు కావస్తోంది. పూర్తి చెయ్యవలసిన సైన్ బోర్డులు నాలుగైదు పెరటి షెడ్డులో పడివున్నాయి. గడువు తేదీ కూడా దాటిపోయింది. ఈవిడకి ఈ విషయం ఎలా చెప్పడం? "ఇరవై నాలుగ్గంటలూ నీతోనే తిరగాలంటే ఎలా?

సేలా నేను ఈ పనికి అంకితం కాలేను. నాకవతల బోల్డుపనులున్నాయి. నీ వెంటే తిరుగుతూ 'కనకండి బాబోయ్' అని ఏ గోడమీద రాద్దామా అని వెతుక్కుంటూ పోవాలంటే మిగిలినవాళ్ళ సంగతేం గాను? నీ జనాభా సమస్య కాదు గాని నా కాళ్ళు పడిపోతున్నాయి తల్లీ" అను కున్నాడు.

ఆవిడకోసం తను మరీ మెత్తబడి పోతున్నాడేమో! ప్రేమ గుడ్డిది మాత్రమే కాదు; ప్రేమించే వాళ్ళకి మూగతనాన్ని కూడా ప్రసాదిస్తుంది. కాకపోతే డైసీని తను పల్లెత్తు మాట అనడంగాని, ఆవిడ అన్న మాటని కాదనడంగాని చేయ గలుగుతున్నాడా ? ఆవిడ మెప్పుకోసం ఏనాడూ తను ఆలోచించని జనాభా సమస్యని ఈ రోజు జీవన్మరణ సమస్యే లాగ అధ్యయనం చేస్తున్నాడు. ఆమెను మౌనంగా అనుసరిస్తున్నాడు.

అలా నడుస్తూ ఎత్తైన ప్రదేశం చేరు కున్నారు. మధ్యాహ్నపు ఎండలో పల్లపు భూములు విశాలంగా పరుచుకొన్నాయి.

"ఆమె నా గురించి పట్టించుకుంటు న్నట్టు లేదు. అయితే ఏం - ఆమెను అనుసరించడానికి అవకాశం దొరి కింది. అదే పదివేలు" అనుకున్నాడు. ఆ ఉద్దేశంతోనే ఆమె వెంట అతను వచ్చాడే తప్ప ఇలా బొత్తిగా పిల్లి పిల్లను తిప్పినట్లు తిప్పుతుందని అనుకో లేదు. అలా అనిపించగానే విరక్తి కలి గింది. వెనక్కి తిరిగి ఇంటికి పోదామని పించింది. టైము చూసుకున్నాడు. నాలుగున్నర కావస్తోంది. ఈ వేళప్పుడు బోర్డులెస్ హోటల్‌లో చిక్కటి కాఫీ సిద్ధంగా వుంటుంది. వేళ మించిపోతున్న కొద్దీ అందులో వేణ్ణీళ్ళు కలుస్తూ వుంటాయి. అందుకే తనురోజూ మధ్యాహ్నం నాలుగు దాటకుండానే బోర్డులెస్ హోటల్‌కి చేరుకుంటూ వుంటాడు. ఆవేళ కాగానే గంట కొట్టినట్లు ప్రాణం కాఫీ కోసం ఆవురావురుమంటుంది.

"ఈవిడకు నా అవసరాలు, అలవాట్లు ఏ మాత్రం పట్టించుకోవలసిన అగత్యం లేనట్టుంది. ఎంతసేపూ నాలుగూళ్ళు పోదాం. నాలుగు వందల మంది పుట్ట కుండా చేద్దాం అనే తాపత్రయం! అదే కాఫీ,టీ, అన్నం, అమృతం...కాఫీ ఏర్పా ట్లేమైనా వున్నాయా అని అడగబోతే- 'భూమాత నరజాతిని మొయ్యలేక బాధపడుతుంటే నీకు కాఫీ అడగటానికి నోరెలా వచ్చింది?' అని కసురుకుంటుం దేమో !

ఆ కొండ దారి ఎండ ధాటికి బాగా వేడెక్కింది.

ఉండి ఉడిగివీస్తున్న గాలితెరలు కూడా కొండల మధ్య నుంచి రా వ డం వల్ల వేడిగా ఉన్నాయి. "అవును మరి సావాస దోషం" అనుకున్నాడు రామూ. "ఈవిడ పరిచయంవల్ల నాలో కూడ జనాభా పిచ్చి ముదిరిపోయి- రేపు ఊళ్ళోవాళ్ళ బోర్డుల మీద కూడా- 'మిత సంతానం అమితా నందం' అని రాసేస్తానేమో!" అనుకుని నవ్వుకున్నాడు.

అలా నవ్వుకుంటూనే వెర్రి మొర్రిగా ఆలోచించటం మొదలు పెట్టేడు ...

తను పని కట్టుకొని వెళ్ళిన ప్రతిఊళ్ళో ఇద్దరేసి ఆడవాళ్ళని ఎన్నుకొని. ఏడాది తిరక్కుండా ఒక్కొక్కరికి కవలల్ని పుట్టిస్తే- పాపం డైసీ అంచనావేసుకున్న అయిదు శాతం నియంత్రణ ఏమౌతుంది? ఏట్లో కలిసి పోతుంది. అంతవరకు బాగానే వుంది. మరి తనకంతపాటి



సామర్థ్యం వుందా? ఒకవేళ తనలో ఆ శక్తి నిండుకున్నా అయితే మరీ మంచిది. డైసీ ఏరికోరి అతన్నే పెళ్ళి చేసుకుంటుంది. తన జీవితాశయాలు నెరవేర్చే లక్షణాలు తన భర్తలో మూర్తీభవించినందుకు చాలా సంతోషిస్తుంది...

మళ్ళీ నవ్వుకున్నాడు. శబ్దం బయటకు రాకుండా నోరు బిగించి బాగా నవ్వుకున్నాడు.

కానీ ఒక్కసారిగా తన మీద తనకే అసహ్యం వేసింది. సంస్కారం కళ్ళెర్ర చేసింది. ఒక స్త్రీ గురించి– ఆమె వెనుక తనెంత నీచంగా, క్రూరంగా, అశ్లీలంగా ఆలోచిస్తున్నాడు! డైసీ తనకన్నా పది అడుగులు ముందు నడుస్తోంది. వదులుగా ముడి వేసుకున్న జుత్తు అడుగుల వేగానికి ఎగిరెగిరి పడుతోంది. అతని మనస్సు తరుక్కుపోయినట్లనిపించింది. ఒక్కదుటున వెళ్ళి ఆమె భుజాల్ని పట్టుకుని,



కళ్ళలోకి సూటిగా చూస్తూ ప్రాధేయ పడాలనిపించింది! ఆశయాల అసిధార మీద యవ్వనాన్ని మొగ్గలు వేయించ వద్దని, తన ప్రేమని వివరించి ప్రార్థించా లనిపించింది.

కొండదారి, మలుపు తిరిగింది. దూరంగా మామిడి, కొబ్బరి చెట్లు కల గలసిన ఆకు పచ్చని తోపూ— దానికి అల్లంత దూరంలో ఇళ్ళు కనిపించేయి.

డైసీ ఆయాసంతో రొప్పుతుంటూ నిలబడి రామూ కోసం వెనక్కి తిరిగి చూసింది. ఎండవేడికి ముఖం ఎర్రబారి, చెమటతో తడిసి ముద్దయింది. రామూకి ఓ వేపు జాలివేసింది. "హాయిగా పెళ్ళి చేసుకుని సుఖించవలసిన వయసులో, ఈ రాళ్ళతోవన ఎందుకి నడక?" అను కుని, ఇప్పటికైనా నిలబడి తనకోసం చూసినందుకు అతనికి సంతోషం కలి గింది.

"అమ్మయ్య ఎలాగైతేనేం ఊరు కనబడింది" అన్నాడు రామూ.

"ఇక్కడ పెరుగుదల రేటు చాలా భయంకరంగా వుంది. ప్రత్యేకంగా శ్రద్ధ తీసుకొని పని చెయ్యాలి" అంది డైసీ.

"ఇక్కడ ఈ కొండల మధ్య ఊరు గురించి మీకు ఎలా తెలుసు?"

"టూర్‌కి వచ్చేముందు ఈ ఊరి జనాభా లెక్కలు చూసేను. వెంటనే మేపులో దీన్ని గుర్తించి ప్రోగ్రామ్‌లో చేర్చుకున్నాను. ఇంతకు మునుపు ఓసారి ఇక్కడికి వచ్చేను కూడా!"

ఊళ్ళోకి చేరుకోగానే ఒక బక్క పలచటి మనిషి వాళ్ళకి ఎదురొచ్చేడు.

"ఇతను ఈ ఊళ్ళో స్కూలు నడుపుతున్నారు" అంటూ అతన్ని రామూకి పరిచయం చేసింది. అలాగే రామూని కూడా అతనికి పరిచయం చేసింది.

"మాస్టారూ! ఈ ఊళ్ళో కాఫీలాంటి దేమైనా దొరుకుతుందా?" అని అడగ బోయి ఊరుకున్నాడు రామూ.

ఆ మాస్టారు వాళ్ళిద్దర్నీ తన ఇంటికి తీసుకెళ్ళేడు. అది వర్షాలు బాగా కురిసే ప్రాంతం కావటంవల్ల ఇళ్ళ కప్పులన్నీ బాగా ఏటవాలుగా వున్నాయి. పెద్ద పెద్ద పెంకులతో నేసిన దిగుడుపంచలో వుంది మాస్టారి ఇల్లు. ఇంటి అరుగుమీద పెద్ద గోనె పట్టావేసి అక్కడ రామూని కూర్చో బెట్టేడు. అతని భార్య బయటకు వచ్చి డైసీని పలకరించి సాదరంగా లోపలకు తీసుకెళ్ళింది.

"గత సంవత్సరం ఇదే రోజుల్లో వచ్చారీవిడ. అప్పుడు ఓ వారం రోజులు మా ఇంట్లోనే వున్నారు. ఇదే సరియైన అదును. ఈ నెలదాటితే వర్షాలు మొద లవుతాయి. నాలుగు నెలలదాకా బయటకు పోడానికి వీలుండదు" అన్నాడు మాస్టారు రామూతో.

"మరి ఈ నాలుగు నెలలూ మీ ఆహారం, ఇతర అవసరాలు?" అడిగేడు రామూ.

"ఇప్పుడే నిలవచేసుకుంటాం. దాదాపు అన్నీ ఇక్కడ పండుతాయి. ఇంకా అవ సరాలు వస్తే వర్షం అంతగాలేని రోజుల్లో బయటకొస్తూ వుంటాం" అని చెప్పి మాస్టారు ఇంట్లోకి వెళ్ళేడు. కాస్సేపు తరువాత ఓ గ్లాసు నిండా కాఫీ, రెండు అరటిపళ్ళు తెచ్చి అందించేడు. కాఫీ అదోకరంగా వుంది. ఆతిథ్యంలో లోపాలు వెదకడం సంస్కారం కాదను కుని వాటిని ముగించేడు. కాస్సేపు నడుం

వాలిస్తే బాగుంటుందనిపించింది. కాని డైసీకి విశ్రాంతి అవసరం లేనట్టుంది. ముఖం కడుక్కొని, తల దువ్వుకొని బయటకొచ్చింది. వచ్చిన వెంటనే-

"వర్షాలు ప్రారంభం కాకముందే మనం ప్రచారం మొదలుపెట్టాలి. మా పరిశీలన ప్రకారం తేలిందేమిటంటే వర్ష ఋతువులోనే పెరుగుదల బాగా వుందని" అంది.

"వర్షపు రోజుల్లో ఇళ్ళ తలుపులు బిగించి వెచ్చగా గోరపిట్టల్లా తలదాచుకునే పల్లెజనానికి పిల్లలు పుట్టించడం తప్ప మరో పనీ పాట లేదు" అనే భావం డైసీమాటల్లో మాస్టారికి స్ఫురించినట్టుంది; వాదనకు తయారయ్యాడు.

మాస్టారిని ఒప్పించే ప్రయత్నంలో దిగింది. "టీచర్ మీసాలు చాలా పలచగా వున్నా, ధైర్యం చిక్కగా వున్నట్టుంది. అందునా డైసీతో వాదించటం అంటే సామాన్యమా!"

"సరే నెలల తరబడి రాత్రీ పగలు వర్షం కురుస్తున్నప్పుడు మీ వూరివాళ్ళేం చేస్తారో చెప్పండి" అని నిలదీస్తూ అడిగింది డైసీ.

"ఆ రోజుల్లో ఇక్కడికొక పండితుడొస్తాడు. మా ఊరి దేవాలయంలో బసచేసి మొదటి నలభై రోజులు భారతాన్ని ఆ తర్వాత రామాయణాన్ని చదివి చెబుతాడు. ఆ రెండూ పూర్తయ్యేసరికి వర్షాలు వెలిసిపోతాయి. అతన్ని తగు విధంగా సత్కరించి పంపించాక పని పాటలు చూసుకోవడం మొదలవుతుంది" అన్నాడు మాస్టారు.

"మరి ప్రతిరోజూ పురాణం విన్న తర్వాత ఆడా మగా ఇళ్ళకిపోరా?" అని అడిగింది డైసీ.

'బయట హోరుమని వర్షం కురుస్తున్నప్పుడు నాలుగు గోడల మధ్య ఆడ, మగ ఏంచేసుకునేది ఈవిడకి ఎందుకు? ఇతరుల ఆంతరంగిక విషయాల్ని ఆరా తీస్తూ ఈవిడ ఆలోచనలు కలుషితం అయిపోయేయి' అనుకున్నాడు రామూ.

"ధాన్యాలు దంచుకొని బాగుచేసుకోవడం, మిగిలిన కాలాల్లో చేయలేని చిల్లరపనులు చేసి పెట్టుకోవడం, ఇలా వర్షాకాలం పొద్దుపుచ్చటం జరుగుతుంది. అంతేగాని మా ఊరి గురించి మరీ అంత కఠినంగా ఆలోచించకండి. నేను కూడా రోజంతా స్కూలు తెరిచే వుంచుతాను. గోనెపట్టాలు నేసుకుని జనం గంటల తరబడి కబుర్లతో కాలక్షేపం చేస్తూ వుంటారు. నిజమే! పెరిగిపోతున్న జనాభాని అదుపులో పెట్టవలసిందే. దాన్ని నేను కాదనను. కాని మీరు ఊహిస్తున్న కారణాలు మరీ దారుణంగా..."

డైసీ పట్టుదల పెరిగింది.

"ఇప్పుడు మీ ఊరి జనాభా ఎంత?" అడిగింది.

"సుమారు ఏడువందల పైచిలుకు.." చెప్పాడు మాస్టారు.

"గత సంవత్సరం కేవలం ఆరు వందలు. మరిప్పుడు? ఒకేసారి నూటికి ఇరవై చొప్పున పుట్టుకు రాలేదూ? మరి ఆ రేటుతో సరిసమానంగా తిండి గింజల ఉత్పత్తి పెరిగిందా? కొత్తగా ఎన్ని ఇళ్ళు కట్టబడ్డాయి?

"మీరు ఎంత శ్రమిస్తున్నా పంటలో కేవలం మూడుశాతం మాత్రం పెరుగుదల కనిపించింది. కొత్తగా ఇళ్లు కట్టి చాలా సంవత్సరాలు దాటినట్లు ఊరిని చూడగానే తెలుస్తోంది!" చూసుకొస్తున్న




బాణాల్లాంటి ఆమె ప్రశ్నలకి బదులు చెప్పలేక ఉక్కిరి బిక్కిరి అయ్యాడు మాస్టారు. అయితే 'తన సంతానం' గురించి ఆమె నిలదీయనందుకు కొంచెం గాలి పీల్చుకున్నాడు.

ఇంతలో ఓ పిల్లలమంద ఇంట్లోంచి బిలబిలమంటూ బయటకు వచ్చింది. డైసీ వాళ్ళవేపు అనుమానంగా చూసింది. మాస్టారు గతుక్కుమన్నాడు.

"వాళ్లు ఇరుగు పొరుగు పిల్లలు. మా వాళ్ళతో ఆటలకోసం వచ్చేరు. నాకు మాత్రం నలుగురే..." అన్నాడు.

"అవునవును. గత సంవత్సరం నేనిక్కడికి వచ్చినప్పుడు ముగ్గురే అనుకుంటాను" అంది ఎత్తిపొడుస్తూ.

"నేరస్తుడిని ఇంటరాగేట్ చేసే పోలీస్ ఆఫీసర్లా ఏమిటీ చూపులు? ఆతిథ్యం ఇచ్చిన నేరానికి చిత్రవధ చేస్తోంది. ఈవిడకి పిచ్చి బాగా ముదిరిపోయింది" అనుకున్నాడు రామూ.

దేశంలో జనాభా ఏ రేటులో పెరుగుతోందో డైసీ చెబుతోంది.

"అయితే ఏం? మన దేశంలో కావలసినంత స్థలం వుంది. ఇంకా కృషి చేసి వెలుగులోకి తీసుకు రావలసిన ప్రదేశాలు చాలా వున్నాయి" అన్నాడు మాస్టారు.

తర్వాత మాస్టారు ఊరి నడిబొడ్డున మర్రిచెట్టుకింద చాలా మంది జనాన్ని పోగు చేసేడు. డైసీ వాళ్ళని ఉద్దేశించి చాలా సేపు మాట్లాడింది. స్థానిక పరిస్థితులను అన్వయిస్తూ చాలామంది లేవనెత్తిన సందేహాలు నివృత్తిచేస్తూ విపులంగా ప్రసంగించింది.

ఊళ్ళో సందేశాలు రాయడానికి అనువైన గోడలు ఎక్కడాలేవు. ప్రస్తుతానికి దీనితో సరిపెట్టి, వర్షాలు రాకపూర్వమే మరోమారు వచ్చి ముఖాముఖి కలుసుకోవాలనుకుంది డైసీ.

ఆ కొండపల్లెలో ప్రచారాన్ని ముగించుకుని, మాల్‌గుడికి తిరిగిపోయేందుకు సిద్ధమయ్యేరు. మళ్ళీ మూడు మైళ్ళు నడక సాగించి మెయిన్ రోడ్డు చేరుకోవాలి. అక్కడ నుండి కొప్పోళ వరకు బస్సు మీదో, బండిమీదో ప్రయాణం చేస్తే తమ ఊరి బస్సు దొరుకుతుంది.

మెయిన్ రోడ్డు వరకు వాళ్ళని సాగనంపడానికిమాస్టారు కూడా బయల్దేరేడు. అతని భార్య రెండు పూటలకీ సరిపోయేలా అన్నం, కూర, పెరుగు వాళ్ళ డబ్బాల్లో సర్ది పెట్టింది. డైసీతో అనుబంధం పెంచుకోవడం వల్ల ఇల్లు వదలి వెళ్ళిపోతుంటే ఆమె బాధపడింది. తల్లి చాటున నిలబడ్డ పిల్లలు డైసీని చిత్రంగా చూస్తున్నారు.

డైసీ వాళ్ళలో ఒక అమ్మాయిని చూసి, "ఛ అలా వేళ్ళు నోట్లో పెట్టుకో కూడదు. నాలిక మొద్దుబారిపోతుంది" అని మందలించింది. మరో అబ్బాయిని చూసి "తిన్నగా నిలబడ్డం నేర్చుకో. గూనివాడివై పోగలవు" అని సరిచేసి "పసివాళ్ళకి ఈ వయసులోనే మంచి అలవాట్లు నేర్పాలి" అంటూ తల్లిదండ్రుల వేపు చూసింది.

"ఈవిడ బుర్రనిండా సలహాలతో పుట్టింది. ఈమె ప్రకారం పిల్లలు అసలు పుట్టకుండా వుండటం మంచిది. ఓ వేళ పుడితే మట్టుకు నోట్లో వేళ్ళు పెట్టుకో కూడదు. గూని నడ్డితో నిలబడకూడదు" అనుకున్నాడు రామూ.

పిల్లలకి సలహాలు ఇవ్వటం పూర్త

య్యేక కన్నవాళ్ళని మరోసారి చూసి "ఈ సంతానం చాలు... ఇద్దరూ ఆలోచించుకోండి" అని చెప్పిముందుకు నడిచింది.

వీధిలో కొందరు జనం "అదిగో డాక్టరమ్మ వెళ్ళిపోతోంది" అనుకున్నారు.

దారి పొడుగునా డైసీ మాట్లాడుతూనే వుంది. మాస్టారు అన్నిటికీ "ఊఁ" కొడుతున్నాడే తప్ప, మనసులో కొంచెం భయపడుతున్నాడు. వచ్చే ఏటికి ఊళ్ళో జనాభా ఏ మాత్రం పెరిగినా దానికి అతన్నే బాధ్యుడు చేసేలా వుంది ఆవిడ ధోరణి. అ బక్కపలచటి మనిషిమీద రామూకి జాలివేసింది. ఈ ఒంటిప్రాణి ఊళ్ళో జంటలు కలవకుండా వుంచేందుకు ఏం చెయ్యబోతున్నాడో? అనిపించింది.

వాళ్ళు ముగ్గురూ మెయిన్ రోడ్డు చేరుకుని, మర్రి చెట్టు నీడలో సామాన్లు దించేరు. తుండు గుడ్డతో ముఖాన్ని అద్దుకుంటూ-

"ఏ క్షణంలోనైనా బస్సు రావచ్చు" అన్నాడు మాస్టారు. అరగంట తర్వాత కూడా అదే మాటన్నాడు. కాని బస్సు వస్తున్న జాడ ఎక్కడా లేదు.

డైసీ ఓ బండరాయిని సింహాసనంగా చేసుకుని ఠీవిగా మహారాణిలా కూర్చొంది. రాజసం వుట్టిపడుతున్న ఆమెను పరవశంతో చూసేడు రామూ. తను అలా చూస్తూవుండటాన్ని ఆమె పసిగడుతుందేమోనని భయపడ్డాడు. పూర్వ జన్మలో ఆమె కచ్చితంగా ఏ విక్టోరియా రాణియో ఝాన్సీ రాణియో అయివుంటుంది.

కాలం గడుస్తున్నకొద్దీ మాస్టారిలో ఆతృత పెరుగుతోంది. కొంచెం అసౌకర్యంగా అటూ ఇటూ తిరుగుతున్నాడు. బస్సు వచ్చేదాకా నిరీక్షించడం అతనివల్ల కావటంలేదు. ఇంటికి పోదామనిపిస్తోంది. కాని డైసీ ఏమనుకుంటుందోనని జంకుతున్నాడు.

ముగ్గురూ మూడు దేశాలనుంచి వచ్చినట్లు, ఒకరి భాష మరొకరికి అర్థంకానట్లు మౌనంగా కూర్చున్నారు. రామూ కూడా అసహనంగా మాస్టారితో పాటు అటూ ఇటూ తిరుగుతున్నాడు. బూడిదరంగులో కొండలు, చిత్రాతి చిత్రంగా పేర్చబడిన శిలా సమూహాలు, కొండల మధ్య మెలికలు తిరుగుతున్న దారి, నీలాకాశం, దూరంగా పలచటి కాంతిలో క్షితిజ రేఖ— ఇవన్నీ చాలారోజులనుంచి చూస్తుండటం వల్ల అతనిలో ఉత్సాహంగాని, ఉత్తేజం గాని కలగటం లేదు. మరొకప్పుడైతే వాటి అందాల్ని మెచ్చుకునేది అతని కళా హృదయం. కాని ప్రస్తుతం అతనికి ఈ వేళప్పుడు ఎల్లమాన్ వీధి చివర్లోను, చెట్టియార్ దుకాణం సమీపంలోను జనసందోహం చేసే అలికిడి వినాలనిపిస్తోంది.

డైసీవేపు చూసేడు. ఆమె ముఖం బాగా వాడిపోయినట్టుంది. తడి ఆరిపోయిన పెదవులు అక్కడక్కడా పగిలి బూడిదరంగులో వున్నాయి.

"కొద్దిగా మంచినీళ్ళు తీసుకోకూడదూ?" అన్నాడు రామూ.

"అప్పుడేకాదు వాటిని జాగ్రత్తగా వాడుకోవాలి" అంది డెసీ.

"పోనీ భోజనం చేస్తేనో..."

"నాకు బస్సుమీద తప్ప మరో ధ్యాస లేదు" ముక్తసరిగ అని మూతి బిగించుకుని కూర్చుంది. రామూకి చిర్రెత్తింది. ఏమిటో ఈ రోజు ఆ బక్కపలచటి మాస్టారి ముందు త నో మహారాణిలా




ప్రవర్తిస్తోంది.

"మాస్టారూ! బస్సు టైమింగ్స్ గురించి అయిడియా లేదా ?" అని అడిగేడు రాము.

"వేళ ప్రకారం చాలా అరుదుగా వస్తుంటాయి; ఒక్కొక్కమారు అసలు రానేరావు" అంటూ నసిగేడు మాస్టారు.

"అయితే ఎలా?"

"బస్సు గనక లేటయినట్లయితే ఈ పాటికి వచ్చి వుండేదే" అని ఓ క్షణం ఆగి, "ఒంటెద్దుబండి దొరకవచ్చు. ఊళ్ళోకి వెళ్ళి బండి తీసుకొస్తాను" అన్నాడు మాస్టారు.

డెసీ "అలాగే"నని తలవూపింది.

మాస్టారు ఓ గుట్టమీదకెక్కి క్షణంలో మాయమయ్యేడు.

కాసేపు తర్వాత రాము మరోసారి భోజనం గుర్తుచేసేడు. ఓ డబ్బా తెరుచుకుని ఇద్దరూ తిని నీళ్ళుతాగేరు. రాముకి ప్రాణం గూట్లోకి చేరినట్లనిపించింది. డెసీకూడా కాస్త మెరుగ్గా కనిపించింది.

సాయంత్రం నాలుగుగంటల ప్రాంతంలో ఒం టెద్దుబండి వచ్చింది. మాస్టారు బండిలోంచి కిందకి చూకేడు.

"మాస్టారూ! మీకు బాగా ఆకలేస్తోం దేమో మా భోజనంపూర్తయి చాలా సేప యింది" అంది డైసీ.

"ఊళ్ళో తినేవచ్చానులెండి" అన్నాడు మాస్టారు.

ఆ బండిమీద గూడు చాలా పాతబడి నట్లుంది; ఓ పక్కకి కొద్దిగా ఒరిగిపోయి వుంది. గూటిలోపల ఒత్తుగా పరచిన గడ్డిమీద తాటాకుల చాప వేసివుంది. ఎద్దు బక్కచిక్కినట్లుంది. దాని ముఖంమీద ఈగలు వాలుతున్నాయి. వాటిని తోలు కోవడానికి అది తల ఆడించినప్పుడల్లా మెళ్ళో మువ్వల పట్టెడ చప్పుడుచేస్తోంది.

బాడుగ గురించి కాస్సేపు తర్జన భర్జన జరిగేక బండివాడు నాలుగు రూపాయలకు ఒప్పుకున్నాడు.

"ఇతడు కొప్పాళ వరకు మిమ్మల్ని తీసుకపోతాడు. అక్కడ బస్సు పట్టు కుని మీరు మాల్‌గుడి చేరుకోవచ్చు" అని చెప్పి వాళ్ళనుండి శలవు తీసుకుని మాస్టారు మళ్ళీ గుట్టమీదకెక్కి మాయం అయ్యేడు.

డైసీ, రామూ బండి ఎక్కేరు.

బండివాడు ఎద్దును అదిలించి వెనక్కి తిరిగి చూసేడు. చూసి-

"ఎప్పుడూ కొత్త దంపతుల్ని తీసు కెళ్ళడం నా బండి ఆనవాయితీ. మరొకరి కైతే ఆర్రూపాయలకి ఒక్క దమ్మిడీ కూడా తగ్గేరకాన్ని కాను" అంటూ ఎద్దు వేపు తిరిగి మరోసారి దాన్ని అదిలించేడు.

"...ధరలు బాగా పెరిగిపోయేయి.





సానామందినాగా దారిపక్కల గడ్డితిని బతకమని నా గొడ్డును ఒదిలీసేవోణ్ని కాను. ఏటి? 'గొడ్డ'ని కదూ అన్నాను- దీన్నలా అనడం సానాతప్పు...నన్నొక పాలి 'గొడ్డ'ని ఒహడన్నాడు. అంతే ఆడి ముక్కు పచ్చడి చేసేను. ఇప్ప డంటే నానిలాగైపోనాను గాని మాంచి వొయిసులో వున్నప్పుడు జెమాజెట్టీలా గుండేవోణ్ని. నా కొడుకు- యిదిగో ఈ కొరడా కర్రంత వుండేవోడు. ఆడు నా వొళ్ళో కూకొని బండిని యమాగా తోలేవోడు. కానాడు బండి తోలడం నా కిస్టంలేదు. ఆడ్ని సదివించాలనుకొన్నాను. మాఊరి అయ్యోవారు ఆడి బుర్ర గట్టిదీ సదివితే పైకొస్తాడూ అన్నాడు."

దారి పొడుగునా బండివాడు మాట్లాడు తూనే వున్నాడు.

మువ్వల చప్పుడులో వాడి మాటలు కలిసిపోతున్నాయి.

"కాలక్షేపం బాగుంది" అనుకున్నాడు రామూ.

"మరి నీ కొడుకు ఇప్పుడేం చేస్తు న్నాడు?" అనడిగేడు.

"అదేమో నాకు తెల్దు... పట్నంలో అదేదో మిల్లులో పనిసేస్తున్నాడట. ఆడికి నానిప్పుడు గేపకం వున్నానేటి?"

అలా మాట్లాడుతూ వైవాహిక జీవితం, దాని విలువ గురించి చెప్పడం మొదలు పెట్టేడు.

"నాకు నలుగురు పెళ్ళాలు సచ్చి పోనారు. అయితే నానెప్పుడూ ఒంటరిగా బతకనేదు ఒకర్తి పోతే మరొహర్తిని పెళ్ళి సేసుకున్నాను. నాను సెప్తన్నాను కదా- మొగాడికి పెళ్ళాన్ని మించిన ఆనందం పెపంచకం మొత్తమ్మీద మరోటి నేదు. అందులోనూ నా అయిదో పెళ్ళాం..."

"నీ కెంతమంది పిల్లలు?"

"ఒక్కొక్క పెళ్ళానికి నలుగురేసి... భగవంతుడిచ్చేడు; కాదనడానికి మజ్జిన మనమెవ్వులమండీ?"

అదృష్టవశాత్తు డైసీ గూడును ఆసుకొని నిద్రపోతోంది. లేకపోతే బండివాడి నోరు బందు చేయించేది. ఎందుకేనా మంచిదని బండివాడిని మరోటాపిక్ వేవు మళ్ళించేడు రామూ.

డైసీకి తెలివొచ్చింది. "ఇంకా తోవ లోనే వున్నామా! టైమెంతయింది? "అని అడిగింది.

"ఆరు" అన్నాడు రామూ.

"బస్సేదైనా వస్తే ఎక్కి పోవడం మంచిది" అంది డైసీ .

"ఇప్పుడు బస్సుల్లేవు" అని, "ఏం బండిలో యిబ్బందిగా వుందా?" అని అడిగేడు బండ్రివాడు.

నిజానికి బండి ప్రయాణం సుఖంగానే వుంది రామూకి. ఒత్తుగా పరిచిన గడ్డి, దాని మీద మెత్తని తాటాకుల చాప– దాని వింతైన వాసన బాగానే వుంది. ఈ బండి ప్రయాణం డైసీని తనకు మరింత చేరువగా తీసుకొచ్చింది. ఇరుకైన బండి గూడులో ఇద్దరూ ఒదిగి కూర్చున్నారు. ఇద్దరి మధ్యా ఖాళీ కొంచెమే ఉంది. అదికూడా బండివాడి పుణ్యమా అని అప్పుడప్పుడు మరింత తగ్గుతోంది. ఎగుడు తోవ కావటంవల్ల బండి తేలిపోయినట్లనిపించిన ప్రతిసారి అందులో వెనుక కూర్చున్న రామూని కాస్త ముందుకి–అంటే డైసీకి దగ్గరగా రమ్మనేవాడు బండివాడు.

అప్పుడు తనకి, డైసీకి మధ్య దూరాలు చెరిగి పోతున్నట్లు, ఆమెకు చేరువ అవుతున్నట్లు రామూకి అనిపించేది. డైసీ కూడా కాస్త సులభంగానే కనిపిస్తోంది. జనం ముందు నిలబడి మాట్లాడే టప్పటి గాంభీర్యం, అంటి ముట్టని తనం ఇప్పుడు డైసీలో కనిపించటం లేదు. మొదటిసారి అతను థర్డ్ క్రాస్‌లో ఏడో నంబరు ఇంటి తలుపు తట్టినపుడు, తలుపు తెరిచి అతన్ని లోపలికి పిలచిన నాటి ప్రసన్నత ఆమె ముఖంలో గోచరిస్తోంది.

అతను నిస్సందేహంగా ఆమెను ప్రేమిస్తున్నాడు. ఆ భావం అతని మనసును మెత్తగా గిల్లి, గిలిగింతలు పెట్టినప్పుడు ఓసారి తనివితీరా చూద్దామనిపిస్తుంది. కాని ఆమె చూపులు ఎదురైతే మట్టుకు ఎక్కడలేని వణుకు మొదలవుతుంది. ధైర్యం చేసి మాటలు కలిపితే జనాభా పెరుగుదల, కుటుంబ నియంత్రణ తప్ప మరో విషయం గురించి ఆవిడ నోరు విప్పదు. సంగీతం, సాహిత్యం, రాజకీయాలు– ఇవేవి ఆవిడకు అక్కరలేదు. బహుశ అవి తన ఏకాగ్రతకు భంగం కలిగిస్తాయని కాబోలు వాటిని దూరంగా ఉంచింది.

తన ధ్యానం తప్ప మరో ధ్యాస లేని యోగినిలా బతుకుతుంది. మరి ఇలాంటి మనిషితో జంట కలపటం ఎలా? ఒకలా చేస్తే బాగుంటుంది. ముందు ఏమీ తెలియని అమాయకుడిలా, ఆమె నుండి ఎంతో నేర్చుకోవలసిన వాడిలా ప్రవర్తించాలి. అలాంటి శిష్యపరమాణువులకి గురువుగా వ్యవహరించడం ఆవిడకి చాలా ఇష్టం. ఓ సారి అలాంటి సంబంధం ఏర్పడితేచాలు రెండో దశకి తాపీగా చేర్చుకోవచ్చు. మొదట కుటుంబ నియంత్రణ మీదసందేహాలతో ప్రారంభించి క్రమంగా ఆవిడ జీవితాన్ని ఆరాతీసి– బండి దారిలో పక్షాక బస్తాలో వడ్లు నేల

మీద గుమ్మరించినట్టు మనసులో ప్రేమని ఆమె ఎదుట కుప్పపోయొచ్చు అనుకున్నాడు రామూ. అనుకుని—

"కుటుంబ నియంత్రణకు సంబంధించిన సాధనాల మీద నాకు కొన్ని సందేహాలున్నాయి" అన్నాడు.

"ప్రత్యేకించి దేని గురించి అడగాలనుకుంటున్నారు?" అంది డైసీ అతని కళ్ళల్లోకి సూటిగా చూస్తూ.

ఇలా ఎదురు ప్రశ్న వేస్తుందని అతను అనుకోలేదు.

"మీరు అందరికీ చెబుతుంటారు కదూ— అప్పుడు నాకేవో సందేహాలు తల ఎత్తుతూ వుంటాయి" అన్నాడు

"అది సరే—మీరు దేన్ని గురించి అడగాలనుకుంటున్నారు?"

రామూ ఏదో చెప్పేడు.

అది చాలా స్వల్ప విషయం కాబోలు. డైసీ బిగ్గరగా నవ్వింది. అంతలా నవ్వి



చాలా కాలం అయింది. ఆమె నవ్వుకి తట్టుకోలేక రామూ తలదించుకొన్నాడు.

బండివాడు కూడా ఆ నవ్వుకు అదిరి పడ్డాడు.

"మీకు శరీర శాస్త్ర పరిజ్ఞానం లేదా?" అంది డైసీ.

దొరికిపోయేననుకున్నాడు. 'ఉంది' అని చేప్తే అన్నీ తెలిసి, కావాలని నంగనాచిలా నటిస్తున్నాడని చెడుగా ఊహించుకుంటుంది. 'లేదు' అంటే కనీసజ్ఞానం లేని బడుద్ధాయిగా అర్థం చేసుకుంటుంది.

"స్కూల్లో అయ్యవారు చెప్పిన సైన్స్ పాఠం తప్ప..." తనకేం తెలీదు అన్నట్లు మాట్లాడేడు రామూ.

"ఏం? మీరంత అమాయకులా?" అని అడిగింది డైసీ తన నంగనాచితనం పసి కట్టేసిందని బాధపడిపోతున్నాడు.

"అందుకే చాలా చిన్న తరగతుల నుండి ఎడ్యుకేషన్ ప్రవేశపెట్టాలని నా అభిప్రాయం..." అంటూ అప్పటిదాకా మామూలుగా వున్న మనిషి ఉపన్యాస ధోరణిలో పడిపోయింది. తను చెబుతున్నది ఒక్కడికా, వందమందికా అన్నది కాదు ముఖ్యం. ఆ చర్చ వచ్చినప్పుడు ఆమెను ఏ శక్తో ఆవహిస్తుంది. తను కూర్చున్నది ఓ గూడుబండిలో అనిగాని, వింటున్న వ్యక్తి తన వయసులో వున్న మగాడనిగాని పట్టించుకోకుండా స్త్రీ పురుషుల సంయోగం నుండి, శిశూదయం వరకు విడమరిచి చెప్పింది.

టైము ఏడు కావస్తోంది. కొవ్వూరు నుండి బస్సు ఎనిమిదింటికే బయల్దేరుతుంది. మూడు గంటల నుండి ప్రయాణం సాగుతూనేవుంది.

బండివాడు ఉన్నట్టుండి పెద్ద కేక పెట్టేడు.

"ఏమైంది" ఇద్దరూ కంగారుగా అడిగారు.

ఎద్దు బండిని లాగుతూ లాగుతూ ఒక్కసారి ముందుకు తూలి పడింది. ముందువేపు కుడికాలు మెలికపడి దెబ్బ తగిలి ఎద్దు బాధతో కూలబడిపోయింది.

రామూ, డైసీ బండి దిగేరు.

బండివాడు దెబ్బ తగిలిన చోట పరీక్షగా చూస్తున్నాడు. ఒకేసారి జాలి, కోపం పుట్టుకొచ్చేయి. కొరడా కర్రతో దాని మూపురం మీద ఓ పోటుపొడిచేడు.

"సూడండి బాబూ! తెలివితక్కువ ముండ కాలు ఇరగ్గొట్టుకుంది. తెలివైన జంతువు కళ్ళు నెత్తిమీద ఎట్టుకుని బరువుల్లాగదు. దార్లో అగ్గేవుందో బుగ్గేవుందో కసింత చూసుకుని నడుస్తాది. ఇదేటి సేసిందో చూడండి. ఆ గతకలో అడుగేసి ముందుకి జోగిపోనాది. నిచ్చేపం లాంటి కాలుకి నిస్కారనంగా దెబ్బ తగిలీసినాది" అంటూ ఎద్దుని బండి నుండి విప్పి దాని కాలుని చేతిలో తీసుకుని కళ్ళంట నీళ్ళు పెట్టుకున్నాడు. "ఇప్పుడేటి మార్గం? మరిది బండి లాగనేదు" అని ఆలోచనలో పడ్డాడు.

బాగా చీకటి పడిపోయింది. టైము ఏడు దాటింది అనడంకన్నా ఎనిమిదికి దగ్గరౌతోందనే చెప్పాలి. బస్సు అందడం అసాధ్యం. ఇద్దరిలోనూ ఆతృత ఎక్కువౌతోంది.

"మరేం చేద్దాం?" అన్నారిద్దరూ.

ఇక్కడికి దగ్గిట్లోనే ఓ పల్లెటూరుంది. అక్కడికి తీసికెళ్ళి వొయిద్యం చేయించాలి" అన్నాడు బండివాడు.

"మా కర్మాన మమ్మల్నొదిలేసి దాని కాలి వైద్యం కోసం పోతాడు కాబోలు" అనుకున్నాడు రామూ.

"ఆ ఊళ్ళో ఒకాయన ఆకు పసరుతో మంచి వైొయిద్యం చేస్తాడుబాబూ!నాలుగు పూటల్లో నయమైపోతాది..."

"అలాగే కానీవయ్యా – ఇప్పుడు మా గతేంకావాలి?" రామూ గొంతులో కాస్త చికాకు ధ్వనించింది.

"మీరిక్కడే వుండండి బాబూ – ఆ ఊర్లోనే మావాడున్నాడు.అతగానికాడ ఓ జత ఎడ్లున్నాయి. అందులో ఒకదాన్ని అట్టుకొచ్చి మిమ్మల్ని కొప్పాళ సేరు సాను... నా మాట నమ్మండి బాబూ, మరేం గాబరానేదు"

"ఎంత దూరం వుంటుంది?"

"నాకాడ గజం బద్దగానుందేటి కొలిసి సెప్పడానికి" కాస్త నవ్వు పులుము కుంటూనే అన్నాడు. మీరిక్కడే వుండండి మరేం బయంనేదు. ఈ జాగా సానా మంచిది. నా చిన్నతనం నించి రాత్రి పగలు తిరుగాడుతున్న సోటు. సుబ్బరంగా తినేసి నిచ్చేపంగా తొంగోండి" అని చెప్పి బండిని ఓ చెట్టు కిందకి చేర్చి ఎద్దును తోలుకుని వెళ్ళిపోయేడు.




మువ్వల చప్పుడు కొంతవరకూ విని పించి క్రమంగా ఆగిపోయింది. చవితి చంద్రుడి మీద మబ్బుతునక తటాలున జారిపోయింది. చల్లగా వీస్తున్న గాలి కెరటాల్లో ఎండుటాకులు రోడ్డు వార పల్టీలు కొడుతున్నాయి. సద్దు మణిగిన చోట ఏకాంత భావన ఇద్దరికీ గుర్తుకొచ్చింది. ఇబ్బంది పడ్డారు. మనసుల్ని గిల్లి వదిలే ఏకాంతం మనుషుల నైతిక బాధ్యతని పెంచింది.

రామూ ఓ క్షణం ఈ అవకాశాన్ని ఆహ్వానించేడు. కాని ఒంట్లో సన్నని వణుకు. వేసవిలో చలివేసింది. బండి వాడు తమ మధ్య వున్నంతసేపూ వాడి ఉనికిని ఇద్దరూ గుర్తించలేదు. వాడు వెళ్ళిపోగానే మూడో వ్యక్తి లేని లోటు కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. ఇద్దరూ అపరిచితుల్లాగ నిలబడిపోయేరు.

"చల్లటి గాలి వీస్తోంది" అన్నాడు రామూ.

"అవును" అంది డైసీ. ఆ గొంతు శృతిలో తేడాలేదు.

"సగం విరిగిన చంద్రుడు చాలా బాగున్నాడు"

"అవును"

"పున్నమినాడైతే ఇంకా బాగుం టాడు"

"..."

ఆమె బండివాడు వెళ్ళినవేపు చూస్తూ "ఏం మనిషి? ఇలా అర్ధాంతరంగా వదిలి వెళ్ళిపోయేడు" అంది.

"ఏం మీకు భయంగా వుందా?"

ఆ మాట చాలా తేలిగ్గా తీసుకుని "దీని కన్నా విపరీతమైన పరిస్థితులు నాకు తెలుసు. నా ఉద్దేశం అదికాదు. వెళ్తున్న వాడు ఆ ఊరిపేరు కాస్త చెప్పి పోవచ్చు కదా!" అంది.

"ఈ బండిని ఇక్కడే వదిలిపెట్టి మనం ఎక్కడికేనా పోతేసరి – వాడికి తగిన శాస్తి జరుగుతుంది" అన్నాడు




రామూ.

డెసీ అతని సలహాని త్రోసిపుచ్చి ఆ చీకట్లో తన మామూలు సింహాసనం కోసం వెదికింది. టార్చితో వెదికితేతప్ప కనిపించని చోట ఉంటాక బండరాయి. పోయి దానిమీద కూర్చుంది.

"పురుగుపుట్ర లేకుండా చూసుకోవాలి" అంటూ ఆమెకు కొంత దూరంలో రామూ కూడా కూర్చున్నాడు. అతనిలో సందేహం తల ఎత్తింది.

ఇప్పుడు ఆమెకు ఎంత దూరంలో కూర్చోవాలి?

తన ప్రవర్తన పట్ల ఆమెలో అనుమానాలకు తావీయని దూరం ఎంత?

అతను నిశ్చయించుకోలేక పోతున్నాడు. మూడో వ్యక్తి ఉన్నంతసేపూ బండిలో ఆమెను దాదాపు స్పృశించినంత దూరంలో కూర్చున్నతను- ఇప్పుడు అనుమానాలకు తావీయని దూరం కోసం ఆరాటపడుతున్నాడు.

"ఎనిమిదిన్నర కావస్తోంది. అన్నం తీసుకురానా?" అని అడిగేడు రామూ.

అంగీకార సూచకంగా తల వూపింది డైసీ.

అతను బండి దగరకు వెళ్ళి అన్నం డబ్బా, నీళ్ళ సీసా తీసుకొచ్చాడు. ఆమె డబ్బా మూత తెరిచి అరటి పండు రెండు భాగాలు చేసింది. మూతలో పెరుగు అన్నం వుంచి, అరటి పండు ముక్క అందులో పెట్టి అందించింది.

అందుకుని మౌనంగా భుజించేడు.

చింత చెట్టు మీద కొంగల గుంపులు వింతగా అరుస్తున్నాయి. రోడ్డుకి అటువేపు తుమ్మ పొదలో కీచురాళ్ళు రొద చేస్తున్నాయి. అతని దృష్టికి ఇది మనసులు కలవని దంపతుల మొదటి రాత్రి!

భోజనం పూర్తయ్యాక ఆమెలో కొంత మార్పు కనిపించింది.

"అక్కడ ఆఫీసులో ఈపాటికి కరస్పాండెన్స్ కట్టలు కట్టలుగా పెరిగిపోయి ఉంటుంది. ఫీల్డు వర్క్ ఎంతైనా చేస్తాను గాని, ఆ డస్కు దగ్గర కూర్చొని అదే పనిగా రాయాలంటే నాకు చాలా బద్దకం" అంది.

రామూ మనసు కుదుట పడింది. "ఫర్వాలేదు మాట్లాడుతోంది" అనుకుని "కావాలంటే నేను సాయం చేస్తాను. సందేహించకండి" అన్నాడు.

"మీకా శ్రమ దేనికి గాని నేనే చూసుకుంటానులెండి... కుర్చీలో కూర్చుని చెలాయించే వుద్యోగానికి నేను తగనేమో" అంది డైసీ.

"అహఁ- అలా అనకండి. నేను ఒప్పుకోను. మీరు ఆఫీసులో చాలా హుందాగ కనిపిస్తారు. ఆ రోజు నేను బోర్డుతీసికొచ్చినప్పుడు గమనించానుకదా! అన్నట్టు చాలా రోజులైంది కదూ?" అటో మధుర స్మృతిలా గుర్తు చేసేడు.

"చాలా అంటే? పన్నెండు వారాలేగా అయింది" అంది అతన్ని నిరాశ పరుస్తూ. రామూ ఇబ్బందిగా నవ్వేడు.

"నాకు మాత్రం ఎన్నో జన్మల నుండి మనం కలుసుకున్నట్టుగా వుంది" అన్నాడు.

"అది నిజంగా భ్రమ. మీకు పునర్జన్మల మీద నమ్మకం వుందా?"

"మీకు?" ఆమెనుండి కచ్చితమైన జవాబు రాబట్టాలని అడిగేడు.

"లేదు" నిర్ద్వంద్వంగా చెప్పింది.

"దానికేం వుందిలెండి కొందరు నమ్ముతారు- మరికొందరు నమ్మరు"

"మరి మీ నమ్మకం?"

"ఇంతవరకూ ఆలోచించడానికి సమయం చిక్కలేదు..." అని నిట్టూర్చి "బాగా అలసిపోయినట్లున్నారు. మీరు బండిలో పడుకోండి. నేను బయట కాపలా వుంటాను" అన్నాడు రాముా.

"మీరు కూడా అలసిపోయేరు కదా! మీరే పడుకోకూడదూ నేనిలా కూర్చుంటాను" అంది డైసీ.

"వద్దు-ఇది మగవాళ్ళ డ్యూటీ... మీరు పడుకోండి"

ఆమె కాస్సేపు ఆలోచించి "సరే" అని దుప్పటి, తలగడ తీసుకొచ్చింది. "మీరు బండి కింద పడుకోండి. నేను లోపల పడుకుంటాను" అంటూ కొంచెం గడ్డి తీసుకుని కింద ఒత్తుగా సర్దింది. దాని మీద దుప్పటి వేసి, తలగడా పెట్టి అతని పక్క సిద్ధం చేసింది. ఆ దృశ్యం అతనిలో మధురమైన తలపులు రేపింది. అతను కూడా బండిలోకి టార్చి వేసి దుప్పటి బయటకు తీసి, బాగాదులిపి డైసీ కోసం పక్క సిద్ధం చేసి "బండివాడు వచ్చేవరకూ కాస్త కునుకు తీస్తేమంచిది" అన్నాడు. ఆమె బండి గూడులోకి మెల్లగా పాకి తలగడని సరిచేసుకుంటూ "అవును" అంది. రాముా బండి కింద దూరి పడుకున్నాడు.

వెన్నెల, నక్షత్రాలు,చల్లగాలి అతన్ని ప్రశాంతంగా వుండనివ్వటం లేదు. పక్కమీద అటూ ఇటూ దొర్లేడు. వెల్లకిలా పడుకొని రెండు చేతులు గుండె మీద పెట్టుకుని బండి కింద భాగాన్ని తదేకంగా చూస్తున్నాడు.

గత మూడు వారాల్లో ఆమెతో గడిపిన క్షణాలు గుర్తు చేసుకుంటున్నాడు. మూడు సంవత్సరాలకు గాని దృఢపడని పరిచయం ఈ మూడు వారాల్లో బలపడింది. అందులో బండి ప్రయాణం ఇద్దరినీ చాలా దగ్గరగా తీసుకొచ్చింది. అటూ ఇటూ జోగినప్పుడు ఇద్దరి భుజాలు రాసుకున్నాయి. రెండు మూడు సార్లు చక్రం గతకలోకి దిగినప్పుడు ఒకరి ఒళ్ళో మరొకరు పడ్డారు కూడా! కోరికల అలలమీద అతను మత్తుగా తేలిపోతున్నట్లు అనిపించింది. ఆమెను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాడు. అయితే తనలో అల్లిబిల్లి ఊహలు, అదుపు తప్పి చెలరేగుతున్న కోరికలు-వీటిని మాత్రం అరికట్టాలి. కాముణ్ణి దహించిన శివనేత్రం కోసం తను ధ్యానం చెయ్యాలేమో! తల బయటకు పెట్టి ఆలోచించేడు. తలపులు ప్రశాంతతని రెచ్చగొడుతున్నాయి. కామదహనం చేసిన కన్ను కోసం కళ్ళు మూసుకుని ధ్యానించవలసినవాడు కనబడని మంటల్లో దహించుకుపోతున్నాడు. మతి చలించిన ఏనుగులాంటి ఆలోచనలు మనసును కుమ్మేస్తున్నాయి.

ఒక్కసారి బండిలోకి వెళ్ళి డైసీని బలవంతంగా అనుభవిస్తే-ఆమె గర్భవతి అవుతుంది; గతిలేక తన పంచన చేరుతుంది. అప్పుడు ఆమెకు మంచి జీవితాన్ని రుచి చూపాలి. ఉద్యోగం కోసం గడపదాటనివ్వకుండా పూర్తిగా తన మీదే ఆధారపడేలా చేయాలి. ఓ ఇంటి కప్పు కింద ఒకే గదిలో ఒకే మంచంమీద ఇద్దరూ ఒకటై కలల కాశ్మీరాంబరాలు కప్పుకొని, గాజు కెరటాల సముద్రం మీద తేలిపోవలసిన కమ్మని వయసులో అర్థంలేని ఆశయాల ఎడారిలో ఆమె బ్రతుకు వెళ్ళమార్చటం అతను భరించలేడు. అతనికీ పథకంలో- ఊహిస్తున్న ఫలితాల్లో ఎక్కడా లోపం కనిపించ





లేదు. చల్లని రాత్రి, చుక్కలు పొదిగిన నీలాకాశం కింద బాహు బంధనలో ఆనందపు లోతులు చూడవలసిన జంట— మానవ కల్పితమైన అడ్డుగోడకి అటూ యిటూ పడివుండటం తనకిష్టంలేదు. అడ్డుగోడని పడగొట్టి అనుభవాల మధుర కావ్యానికి తొలిపంక్తి రాయడం తనకు దోషం అనిపించలేదు.

అస్తమిస్తున్న చంద్రుణ్ని చూసేడు. విలువైన కాలంలో కొన్నిక్షణాలు కరిగిపోయేయి. ఇంకా ఆలస్యం చెయ్యకూడదు. కలిసివచ్చిన అవకాశాన్ని కాలదన్నకూడదు. తటపటాయింపులకు స్వస్తిచెప్పి తరుణ యవ్వనాన్ని అనుభ



వించాలి. మెల్లగా బయటకువచ్చి అడుగు ముందుకేసేడు. ముందు మెల్లగా పిలిచి ఆమెకు తెలివి వచ్చేదాకా నిరీక్షించి ఆ తరువాత పక్కకి చేరితే మంచిదని పించింది. కాని కోరిక తొందరపెట్టింది. తాత్సారానికిది తగని సమయం అంది. జారిపోయిన ప్రతిక్షణం నిన్నగా మారి పోతుందని, చేజారిపోయిన అవకాశం నీ జీవితాన్ని నిరాశల చితిమీదకి నెట్టేస్తుందని హెచ్చరించింది. చలివేసింది. ఒంట్లో సన్నని వణుకు. గుండెను బిగబట్టుకుని బండి మీదకి ఎగబ్రాకేడు.

"భయపడకు... నేనే నీ ప్రియమైన రామూని... నన్ను అపార్థం చేసుకోకు" అంటూ చీకట్లో ఆమెను కౌగలించుకో బోయి తుళ్ళిపడ్డాడు. కాని అక్కడ డైసీ లేదు. చీకట్లో దుప్పటిని ఆత్రంగా తడిమేడు. ఉంగరం కోసం వెదికినట్లు గడ్డిపొరకింద చేతులు పోనిచ్చి అక్క డక్కడా వెదికేడు. "ఎక్కడికి పోయింది?" అతనిలో పరాభవజ్వాల ఉవ్వెత్తున లేచింది. కోపం ముంచు కొచ్చింది. "రాత్రి ఎవడితోనో లేచి పోయుంటుంది. నేను దానికి తగనేమో!"

"డైసీ డైసీ" ఆ చీకట్లో అటూఇటూ తిరుగుతూ అరిచేడు. తనగొంతు తనకే వికారంగా, బొంగురుగా భయంకరంగా వినిపించింది. ఎక్కడా లేదు. మాయమై పోయింది. మోహినీ పిశాచంలా నన్ను రెచ్చకొట్టి, వెర్రెక్కించి— ఇలా దిక్కు మాలిన చోట అర్ధరాత్రి చీకట్లో ఒక్క డినీ వదిలేసి పోయింది. అలా కొంతసేపు తిరిగి తన చోటుకు పోయి పడుకున్నాడు.

తెల్లవారుతుండగా తెలివొచ్చింది. బయటకొచ్చేడు. కాస్సేపటికి బండివాడు నవ్వుతూ వచ్చేడు. వెనక పొడుగాటి కొమ్ముల మైసూరు ఎద్దు వుంది.

"మా ఈరకాడిని లేగ్గొట్టేసరికి సగం రాత్రి గడిచిపోనాది బాబూ... ఓ పట్టాన లేసినాడుకాడు... మీకు బాగా నిద్ర పట్టిందా?'' అన్నాడు నవ్వుతూ.

"పట్టింది...పట్టింది"అన్నాడు రామూ.

"అమ్మగారు నిద్రలేస్తే బయల్దేరి పోదాం" అంటూ, "అమ్మగారు లెగ డానికి ఆలీసమౌతాదా?'' అని అడిగేడు బండివాడు.

"లేదు లేదు లేచేరు"అన్నాడు రామూ.

"ఏరీ ఎక్కడున్నారు?"

సమాధానం కోసం రామూ తడుము కున్నాడు. వును డైసీ ఏది? ఎక్క డుంది?

"నూతిగ్గాని ఎల్లుంటారేమో— ఇక్క డికి దగ్గిర్లో అల్లా సింత సెట్ల ఎనకాల ఉంది. అసలు లోతేలేదు. ఇదిగిలా సెయ్యితో అందుకోదవే. అందుకనే బండిని ఇక్కడ నిలబెట్టాను. మీరు అసలు సూడనే లేదా?" అన్నాడు బండి వాడు. చింత చెట్ల మధ్య చీకటి జాడలు పూర్తిగా చెరిగిపోని దారిలో, రాత్రి మంచులో తడిసి ప్రాతస్సంధ్యా కిరణాల నులి వెచ్చని స్పర్శలో తడారబోసు కుంటున్న మల్లె మొగ్గలా డైసీ వస్తోంది.

"అదిగో అమ్మగారొస్తున్నారు" అన్నాడు బండివాడు.

ఆమె నొసటి మీద అక్కడక్కడ నీటి బిందువులున్నాయి. చీరె కొంగుతో ముఖాన్ని అద్దుకుంటూ రామూ పక్క నుండి నడిచి వెళ్ళింది. ఆమె కట్టుకున్న కెంపు రంగు చీరె అతని కళ్ళల్లో ఒక్క సారి జ్వలించింది.

"ఎద్దుకి కాసిన్ని నీళ్ళు పెట్టి తొంద

 

రగా బయల్దేరదాం" అని బండివాడు చింత చెట్లు వేపు దారి తీసేడు. రామూ బండివాడిని అనుసరించేడు.

"మీరు గభాలుమని తెమిలి పోనారంటే సిటంలో కొప్పాల సేరిపోతాం. బస్సుల స్టాండు కాడ మంచి కాపీ ఒటేలుంది".

రామూ బదులు చెప్పకుండా మౌనంగా నూతి వేపు నడిచేడు.

అతని కళ్ళలో ఎర్రదనం తగ్గలేదు. ఆమె బహుశ రాత్రి జరిగిన సంఘటనకు సంజాయిషీ ఆశిస్తూ ఉంటుంది. ఆమె దృష్టిలో తను చెయ్యబోయిన అఘాయిత్యాన్ని నిజాయితీగా ఒప్పుకొని క్షమార్పణ చెప్తానేమోనని ఎదురు చూస్తూ వుంటుంది. కాని తను పలకరించకుండా, కనీసం కన్నెత్తి చూడకుండా వెళ్ళిపోవడాన్ని గురించి ఆశ్చర్యపోతూ వుంటుంది. ఎందుకు పలకరించాలి? తన్ను నిరాశపరచిన ఆవిడ ముఖంలోకి పనికట్టుకుని చూడవలసిన అవసరం ఏమొచ్చింది? "ఆవిడ చేసిన పని తప్పా?" ఎదురు ప్రశ్న వేసింది మనసు. "అసలు అరాచకాన్ని తలపెట్టినదెవరు? నీలోని అదుపు తప్పిన కాముకత నిన్న రాత్రి ఆమెను మొండిగా అనుభవించి వుంటే నువ్వెక్కడ వుండేవాడివి? జైలు గోడల మధ్య జీవితాంతం జీవచ్ఛవంలా పడి వుండేవాడివి. ఆమె తప్పు చెయ్యలేదు. తప్పు చేయబోయిన నిన్ను సరిచేసింది. ప్రమాదపు సరిహద్దుకు చేరువలోనున్న నిన్ను బయటకు లాగి నీ భవితవ్యాన్ని భస్మం కాకుండా రక్షించింది" రామూ బుర్ర వేడెక్కిపోయింది.

"జరిగిన దాని గురించి ఆలోచించకూడదు. జ్ఞాపకాల తేనెటీగల్ని రెచ్చగొట్టి మనసు తూట్లమయం చేసుకోకూడదు. తనలో చిచ్చు రగిల్చిన దుష్ట శక్తుల్ని శాశ్వతంగా సమాధి చేయాలి."

నూతి నీళ్ళతో తలని తడుపుకొని తేలికపడ్డాడు.

అలా నిర్ణయం తీసుకొని తేలికపడ్డ మనిషి బండిలో కూర్చుని వెళుతున్నప్పుడు తిరిగి సోడా బుడ్డిలోని గోళీకాయలా కొట్టుకోడం మొదలు పెట్టేడు. ఆమెతో మాట్లాడకుండా వుండలేకపోతున్నాడు.

"చాలా కృతజ్ఞుణ్ని" అన్నాడు.

"ఎందుకు?" అన్నట్టు చూసింది డైసీ.

"నన్ను నా నుంచి రక్షించినందుకు"

"అలాగా..." అని వూరుకొంది. అదిగో ఆ మంకుతనమే అతన్ని చిత్రవధ చేస్తోంది.

"మీరెక్కడున్నారు?"

"చింత చెట్టు మీద"

"రాత్రంతానా?"

"తెల్లవారే వరకు"

"క్షమించండి. అక్కడ మీకు చాలా ఇబ్బందిగా వుండి వుంటుంది"

"కాని అదే నాకు కాస్త సురక్షిత ప్రదేశంగా అనిపించిది"

"లేకపోతే...?"

"ఆ పులి నన్ను మింగేసివుండేది"

"చాలా పెద్ద పులా?"

"అవును. అది నా బండి కింద చాప మీద బక్కురుతూ గూడు దగ్గరకొచ్చి నిలబడింది. చీకట్లో దాని కంట పడకుండా మరోవేపు నుండి చప్పుడు చెయ్యకుండా జారుకుని చెట్టు మీద కెక్కేను"

"మీకు చెట్టెక్కడం కూడా వచ్చా"

"చిన్నప్పుడు నేర్చుకున్నాను. 'దెయ్యాన్ని పెళ్ళాడవలసి వచ్చినప్పుడు చింత చెట్టు ఎక్కడం నేర్చుకోవాలి' అని

మా బామ్మ సామెత చెప్పేది. దాని అంతరార్థం యిప్పుడు బోధపడుతోంది"

"కాని మీ కింకా పెళ్ళి కాలేదుగా?" చాలా గడుసుగా అడిగేననుకున్నాడు.

ఆమె చురుగ్గా చూసింది. చూసి, "దాని అర్థం పెళ్ళొక్కటే కాదు స్నేహం కూడా..." చాలా సీరియస్‌గా అంది.

బండివాడు ఈ భాగోతం అంతా వింటున్నాగు. "ఏటి ఇద్దరూ దెబ్బలాడుకున్నారా?" అని అడిగేడు.

"అవును" అన్నాడు రామూ.

"నేను బాగా తాగొచ్చినప్పుడు నా పెళ్ళాన్ని చితక బాదేవోణ్ణి... కాని మీరు బాగా సదూకున్నోళ్ళుగదా అలా తగూలాడుకోవచ్చా?" అని వూరుకున్నాడు



డైసీ తన మౌన సమాధిలోకి వెళ్ళి పోయింది. రాత్రి తన నుండి దూరంగా చెట్టుమీదకి తరిమిన వ్యక్తికి ఇప్పుడు చేరువగా కూర్చోడం అతనికి సిగ్గనిపించింది. ఆమె చెప్పిన సామెతకి అర్థం ఏమిటి? మేనత్త కూడా చాలాసార్లు ఈ సామెతని చెప్పింది. తనతో ఆమె పెళ్ళి అయిపోయినట్లు డైసీ వూహించుకొంటోందా? లేక తన ఆలోచనల్ని పసిగట్టి ఆ ప్రస్తావన తీసుకొచ్చిందా?

"బహుశ నన్ను మునుపటిలా తేలికగా తీసుకోకుండా కాస్త సీరియస్‌గా ఆలోచిస్తోందేమో– అలా అయితే ఈ మౌనం ఎందుకు?" ఆమెను సుతారంగా చూసేడు. అతన్ని గుచ్చినట్లు చూసింది.

"నా కళ్ళకి మీరు విక్టోరియా రాణిలా కనిపిస్తున్నారు" అన్నాడు. చాలాఅజాగ్రత్తగా, తొందరపాటుతో చేసిన వ్యాఖ్య అది. కావాలనే అలా అన్నాడు. నిన్న రాత్రి అంత ఒత్తిడికి లోనైన తరువాత ఇక తెగించడమే మంచిది. ఇకముందు కూడా అలాగే వుండాలని నిశ్చయించుకున్నాడు. పిరికితనంతో ఒదిగిపోతూ, మొగమాటంతో ముడుచుకుపోతూ,మాట తీరు తెలీని మొద్దబ్బాయిలా ఇక వుండదలచుకోలేదు. డేషింగ్‌గా– డోన్ట్‌కేర్ మాష్టర్‌లా వుండాలి.

ఆమె తనను గౌరవించటం నేర్చుకోవాలి. పెన్సిల్ చెక్కుకునే బ్లేడు ముక్కలా అవసరపడినప్పుడు వెదికి తీసుకొంటూ తీరిపోయిన తరువాత మూలన పడేసే పద్ధతి మారాలి. తను చేసింది తప్పు ఎంతమాత్రం కాదు. క్షమార్పణ కోరుకోవలసిన అవసరం అంతకన్నా లేదు. ప్రాణుల నరాల్లో ప్రవహించే విద్యుత్ తన యవ్వనాన్ని తట్టి లేపిందేగాని ఇది సృష్టిలో లేనిదీ, అక్కరకు రానిదీ కాదు.

అలా ముఖం ముడ్చుకుని కూర్చోవలసినంత అపచారం ఏం జరిగిందనీ? తనెంతగా ఆమెకోసం తపిస్తున్నాడో? తన పనులు మానుకుని, స్నేహితులూ, సరదాలూ కట్టిపెట్టుకుని, రోజుల తరబడి ఆమె వెంట ఒళ్ళు హూనం చేసుకుని తిరుగుతూవుంటే– తనపట్ల మాటమాత్రం అభిమానం వ్యక్తం చెయ్యక పోగా పైపెచ్చు ఏదో ఘోరం జరిగిపోయినట్లు ముఖం పెట్టుకుని కూర్చుంది. ఎంత తల బిరుసు?

"మీరు అనవలసిందేమీ లేదా?" అన్నాడు కొంచెం గీరగా.

"ఏమీ లేదు"

"నేను మిమ్మల్ని విక్టోరియా రాణిలా వున్నారన్నాను. దానిమీద వ్యాఖ్యానించవలసిన అవసరం లేదా?"

"ఎందుకిలా అనవసరంగా నన్ను కవ్వించాలని చూస్తున్నారు? అసలు మీ ఉద్దేశం ఏమిటి?" అంది అతని వెపు రోషంగా చూస్తూ.

"మిమ్మల్ని హుషారుగా ఉంచాలని. అంతే–నాకు తెలియక అడుగుతాను... దేనికిలా వూరికే బిగుసుకు పోతున్నారు? ఏం తప్పు చేశానని అంత ఉక్రోషం? నేను నా..."

"ఆపు– ఓయ్– బండి ఆపు" బండివాడి భుజాన్ని తట్టి గట్టిగా అంది డైసీ.

బండివాడు భయపడుతూ చూసేడు.

"సేకేనయ్యా చెబుతున్నది. ఆపమంటూంటే అర్థం కావటంలేదూ?" మళ్ళీ గదించింది. బండి ఆగింది. తన సామాన్లతో బండిమీంచి దిగి "అతన్ని తీసు

కెళ్ను. నేను బండిలో వచ్చేదిలేదు" అంది డైసీ.

"ఇంకా సానాదూరం వుంది తల్లీ" అన్నాడు బండివాడు.

"అది నీ కనవసరం. ముందతన్ని తీసుకెళ్ళమని చెబుతున్నాను" అంది కోపంగా. రాముా కూడా దిగిపోయేడు.

"మీకా శ్రమ అఖ్ఖర్లేదు. నేనే నడుస్తాను. మీరు బండిమీద వెళ్ళొచ్చు" అన్నాడు.

"ఏటి బాబూ బొత్తిగా సిన్నపిల్లల్లాగ?" అంటూ బండివాడుకూడా కిందికి దిగేడు. "ఇద్దరూ బండెక్కండి ముందు" అభిమానంతో ఆజ్ఞాపించేడు. "బగమంతుడు ముడెట్టేసినాక యిడిపోతాం అంటే ఈలౌతాదా? మీకు పిల్లా పాపా ఇంకా కలగనేదేటి? సంసారం అన్నాక కసింత పట్టు యిడుపు వుండాలేగాని— తెగిపోయేవరకు తాడు లాక్కూడదు. పదండి పదండి. బస్సుస్టాండుకాడ ఒటేల్లో టిపినీ తిని ఏడి కాపీ తాగినారంటే ఇద్దరూ మళ్ళీ సరదాగా బస్సెక్కిపోతారు"

"అలా మాట్లాడకు. మేం అసలు భార్యాభర్తలం కాం" అంది డైసీ.

"ఆవిడ మాటలు నమ్మకు— మా కెప్పుడో పెళ్ళయింది" అన్నాడు రాముా మొండిగా.

బండివాడు సన్నగా నవ్వేడు "వొయిసులో వున్న దంపతులకు సుఖాలు కావాల. రేత్రి మీకు సానా యిబ్బందిగా గడిసి వుంటాది. అందుకే ఈ సిర్రబుర్రలు. ఇవి అందరికీ వుండేవిలెండి బాబూ పదండి"

రాముాకి చాలా సరదాగానే వుంది కాని డైసీకి ఒళ్ళు మండిపోతోంది.

"అతను నా భర్త కాడని చెబుతూ వుంటే చెవుడా నీకూ? అతను నాదగ్గర పనిచేసే వ్యక్తి. కేవలం కూలి పుచ్చుకొని పనిచేసిపెడతాడు. అంతే!"

రాముా గట్టిగా నవ్వడం మొదలు పెట్టేడు. నవ్వు ఆపుకొంటూ —

"చూశావా చూశావా ఈరోజుల్లో భార్యలు ఎంతకు తెగించిపోయేరో! పోనీ కదాని పనిలో సాయపడదామనివస్తే నన్నో పనివాడికింద జమకట్టేస్తోంది" అన్నాడు.

"అతను ఒట్టి అబద్ధాలకోరు, మోసగాడు" అరిచింది డైసీ.

"అవును నేను అబద్ధాల కోరునే. మోసగాడినే. ఒప్పుకుంటున్నానుసరేనా?" మరింతగా రెచ్చగొడుతున్నాడు రాముా.

"చూసినావా తల్లీ! అతగాడు అంతా మరిసిపోయి కలిసిపోనాడుకాడా? నువ్వొ అలాగే కలిసిపోవాల. అసలే ఆకల్తో వున్నట్టున్నారు. పదండి పదండి ఒటేలు కాడికి తీసికెళ్తాను..."

"నీ వాగుడు కట్టిపెట్టి నోరు మూసుకోవయ్యా" అని బండివాడిని కేకేసింది.

"సరే తల్లీ తప్పయిపోనాది" చెంపలు వేసుకున్నాడు. "కాని మీరు తొందరగా రండి. బస్సుకింకా టయిమున్నాది. ఇంకా జాప్యం సేసినారంటే ఈ రోజు కూడా రోడ్డే గతవుతాది. మీకు దండం ఎట్టుకుంటాను. బండి ఎక్కండి..." అంటూ డైసీ ఎదురుగా రోడ్డు మీద సాష్టాంగపడ్డాడు బండివాడు.

"అంత పెద్ద మనిషిచేత అలా దండం పెట్టించుకుంటున్నందుకు సిగ్గుపడాలి" అని రాముా డైసీ భుజం పట్టుకుని బండి వరకు నడిపించి "ఎక్కండి" అన్నాడు. ఆమె కదల్లేదు. రెండు చేతులతో ఎత్తు

 

కుని ఒక్కసారి ఆమెను బండిలో కుదేశాడు రామూ.

బండివాడు తన స్థానంలో కూర్చున్నాడు. ఎద్దు కదిలింది. డైసీ ముఖానికి కొంగు అడ్డుపెట్టుకుని వెక్కి వెక్కి ఏడుస్తోంది. రామూ మనస్సు చివుక్కుమంది. అయినా మొండిగా అలాగే కూర్చున్నాడు.బండివాడు వెనక్కి తిరిగి "అమ్మగారిని కసింతసేపు ఏడవనీయండి. మనసు తేలిక పడతాది" అన్నాడు రహస్యంగా.

అంతలోతు గుండె మనిషి అమాంతం కంటతడి పెట్టుకోడం, నెట్టుకొస్తున్న దుఃఖాన్ని తట్టుకోలేక కుమిలి కుమిలి ఏడవటం చూసి అంతవరకు సాహసం చూపిన వ్యక్తి ఇప్పుడు చల్లారిపోయేడు. తన బలమైన పిడికిట ఆమె భుజాలు నలిగి ఎముకగాని విరిగిందేమో! అతనిలో నిద్రిస్తున్న శాడిస్టు ఒక్కసారి మీసం మెలేసేడు.

డైసీ ఇంకా ఏడుస్తోంది. ఎదురుగా కూర్చున్నా ఆమె ముఖంలోకి చూడలేకపోతున్నాడు. ధైర్యం లేకనా? కాదు. కంట తడిని చూసి గుండె దిటవు సడలిపోతుందేమోనని.

లాలనగా ఆమె భుజాన్ని నిమిరేడు. కళ్ళకి అడ్డం పెట్టుకున్న చెయ్యి గట్టు మీదకి వురికే కెరటంలా లేచి అతని చేతిని అవతలకు నెట్టేసింది.

"చొరవ తీసుకోవాలని చూస్తున్నావు కదూ? అంతు తేల్చకుండా వదిలిపెడతాననుకోకు. పోలీసులకి రిపోర్ట్ ఇస్తాను. ఇంతకు ఇంతా అనుభవించేలా చేస్తాను" అంది.

ఆవిడ స్పిరిట్‌ని మెచ్చుకున్నా పోలీసుల మాట ఎత్తేసరికి భయం వేసింది. తాను జైలునుండి తిరిగివస్తూంటే ఊరంతా పగలబడి నవ్వుతుంది. తన శత్రువు పెయింటర్ జయరాజ్‌గాడు మార్కెట్ గేట్‌దగ్గర నిలబడి "చూశారా! ఆ రామూగాడు ఆడ కష్టమర్ల మీద ఎలా చేయి చేసుకున్నాడో" అంటూ అదే పనిగా అరుస్తాడు. 'చొరవ' అన్నమాట పెనుభూతంలా కనిపించింది.

"దయచేసి జరిగినదంతా మరిచిపోండి. నన్ను క్షమించండి... ఏదో హాస్యం ఆడబోయి అనవసరంగా సీన్ క్రియేట్ చేసేను" అన్నాడు రామూ. ఆమె సన్నని పెదాలు దగ్గరగా బిగుసుకున్నాయి. ఆవిడ పళ్ళు నూరుతోందేమో – ఆ వినిపిస్తున్న చప్పుడేమిటి? తన భ్రమ కాబోలు.

బండివాడికి ఈ తగాదా మా చెడ్డ సరదాగా వుంది. ఓ పక్క ఎద్దు తోక నులిపెడుతూనే మరోపక్క రామూలో చల్లారుతున్న కసిని ఎగదోస్తున్నాడు. 'ఇదంతా ఆటలో భాగం – మీరేం తగ్గిపోకండి' అన్నట్టున్నాయి వాడి మాటలు. దారిపొడుగునా ఈ ముసలి తొత్తుకొడుకు మాటలు విని కదూ తను మరింతగా రెచ్చిపోయింది? ఈ కుమ్ములాట వీడికి బొమ్మరి మేళంలా వుంది కాబోలు.

ముందేం జరగబోతోందో! అనవసరంగా కొండంత ఆపదలో ఇరుక్కున్నాడు చూస్తూ చూస్తూ కత్తులబోను లోకి అడుగుపెట్టేడు. "దేవుడా దేవుడా! కొప్పాళలో పోలీస్‌స్టేషన్ వుండకూడదు తండ్రీ!" అని ప్రార్థించసాగేడు.

బండి కొప్పాళ గ్రామం చేరుకుంది. బస్టాండ్ దగ్గర జనం పలచగావున్నారు. బండివాడికి డబ్బులిచ్చేసి వాడివేపు కొరకొరా చూసి డైసీ బస్సువేపు దారితీసింది.

రామూ ఆవిడ సామాన్లని మొయ్యబోతే బలవంతంగా లాక్కొని బస్సెక్కింది డైసీ.

రామూ తాపీగా బస్సెక్కి ఆవిడ కూర్చున్న సీటుకి ఆరు వరసల వెనకాల ఓ చోట ఇరుగ్గా కూర్చున్నాడు.

టికెట్‌కోసం కండక్టరు వచ్చేడు.

"ఆ మొదటి వరసలో కిటికీ దగ్గర కూర్చున్నావిడ టికెట్టు తీసుకుందా?" అడిగాడు రామూ.

"తీసుకున్నారు"

"ఒకటా? రెండా??"

"ఒక్కటే"

రామూ తనకోసం ఓ టిక్కెట్టు తీసుకుని ఆమె పోలీస్ స్టేషన్‌కి వెళ్ళనందుకు సంతోషించేడు.

చీకటి పడుతుండగా బస్సు మాల్‌గుడి చేరుకుంది.

డైసీ చకచక దిగి జట్కా మాట్లాడింది.

రామూ కాళ్ళీడ్చుకుంటూ తన ఇల్లు చేరుకున్నాడు.




గడ్డురోజులు మొదలయ్యాయి.

అనుమానం, భయం రామూ మనసును పట్టి పీడించసాగాయి. డైసీ పోలీసుల దగ్గరకు వెళ్ళడాన్ని గురించి పదే పదే వూహించడం మొదలు పెట్టేడు. ఫర్వాలేదు సర్కిల్ ఇన్‌స్పెక్టర్‌తో తనకు పరిచయం ఉంది. భుజాలు పూసుకొని తిరిగే మిత్రుడని చెప్పలేడుగాని కాస్త ముఖ పరిచయం వున్న మనిషిగా చెప్పుకోవచ్చు.

అతను డైసీ యిచ్చిన రిపోర్ట్ నమోదు చేసుకుంటాడా? చేసినా చెయ్యొచ్చు. చాలా కరాకండి మనిషి. అమ్మాయిల మీద గలాటా జరిగితే అసలు వూరుకోడు. అలా అయితే ఏ క్షణానైనా తన యింటి తలుపుల మీద లాఠీ దరువులు వినిపించవచ్చు. తన చేతికి బేడీలు వేసి పోలీసులు ఈడ్చుకుపోతుంటే వీధి వీధంతా ముక్కు మీద వేలేసుకుంటారు. చెట్టియార్ దుకాణం దగ్గర జనాలు తన వేపు అదోలా చూస్తూ "బోర్డులు గీసుకునే వాడు– వాడి స్థానం ఎక్కడో తెలుసుకోవాలి" అంటారు. తన గురించి నిజం తెలిసిన కొందరు "అయ్యో పాపం" అని జాలిపడతారు. "అయినా ఆ అమ్మాయికి ఇదేం బుద్ధి? వయసులో వున్న కుర్రాణ్ణి వెంట తిప్పుకొని, వగలు కురిపించి, వెర్రెక్కించి– ఇప్పుడు పోలీసు రిపోర్టు ఇస్తుందా?"

"ఇంతకన్నా అమాయకులు దొరకలేదు కాబోలు దానికి! ఎంత మంచి వంశం నుండి వచ్చేడు. తండ్రినాడు లేదు, తాతల నాడు లేదు ఇలాంటి అవమానాలు? వాడి మీదే ఆశలు పెట్టుకొని బతుకుతున్న ముసలి దాని ప్రాణం హరీమంటుంది.."

రామూ బుర్రలో నిప్పు బాగా రాజుకుంది. అనుమానాలతో, భయాలతో అతని మనసు రంపపు కోతకు గురి అవుతోంది. ఆందోళన బాగా పెరిగింది. డైసీ నుండి తనకు రావలసిన ఛార్జీల మాట అటుంచి ఆఫీసు వేపు వెళ్ళడానికి ధైర్యం

చాలటం లేదు. తెగించి వెళ్ళినా పలక రించకపోవచ్చు లేదా పోలీసుల్ని పిలి పించి బేడీలే వేయించవచ్చు.

ఆమెతో పరిచయం అయిన తొలి రోజుని కసిదీరా తిట్టుకున్నాడు. ఆ రోజే "బోర్డురాసే తీరిక తనకు లేదని" చెప్పేసి వుంటే కథ ఇంతవరకు వచ్చి వుండేది కాదు. ఇప్పుడు వీధిలోకి పోవాలంటేనే భయంగా వుంది. ఏ ఒక్కరు తన వేపు అదోలా చూసినా గుండె పీచు పీచు మంటుంది; గిల్టీగా వుంటుంది. అందుకే తన గదిలోనే కూర్చుని సాధ్యమైనంత పెద్ద పుస్తకాలతో కాలక్షేపం చేస్తు న్నాడు.

మేనత్త దిన చర్యలో మార్పులేదు. ఉదయం అయిదు గంటల మొదలు రాత్రి పదింటి వరకు యధావిధిగా గడియా రంలా పని చేసుకుపోతోంది. నిద్ర పోవాలని అనిపించినప్పుడు ఉత్త నేల మీద తలకింద ఏ పీట చెక్కో పెట్టు కుని నిద్రపోతుంది. "ఆమెలో ఎంతటి ప్రశాంతత ఉంది!" అనుకునే రాము ఆమె కూడా ఈమధ్య లోలోపల ఆందోళనకు లోనౌతున్నట్లు పసికట్టేడు. ఆవిడకి బాగా తెలిసినవాళ్ళు చెట్టియార్ దుకాణం దగ్గర, వినాయకుడి మందిరం దగ్గిర అతను డైసీతో తిరగడాన్ని గురించి చెవులు కొరుక్కోడం ఆవిడ వింది. డైసీని తొలిసారి ఇంట్లోకి ఆహ్వా నించి వంట గది దగ్గర చాప వేసి కూర్చోబెట్టి, కాఫీ ఇచ్చి తన జీవిత కథ వివరించింది ఆవిడే అయినా తొలినుండి డైసీ తీరుపట్ల అనుమానపడుతూనే ఉంది. వయసులో వున్న తన మేనల్లుడిని వెంటబెట్టుకొని డైసీ ఊరేగడం ఏద్దూ రంగా అనిపించింది. మనసులో మాట బయటకు అనకపోయినా లోలోపల మథనపడుతూనే వుంది.

రాము ఊరినుండి వచ్చిన రోజు నేరుగా తన గదిలోకి వెళ్ళిపోయాడు. సామాన్లు విప్పదీసి పెరట్లోకి వెళ్ళి స్నానం చేసి వచ్చేడు. ఉలుకూ పలుకూ లేకుండా భోజనం ముగించి తిరిగి తన గదిలోనికి వెళ్ళిపోయేడు. ఇల్లు వదిలి అన్ని రోజులు కావచ్చినా— ఓ గంట క్రితం వీధిలోనికి వెళ్ళి అప్పుడే తిరి గొచ్చినవాడిలాగ ప్రవర్తించేడే తప్ప తన ప్రయాణాన్ని గురించి ఒక్క ముక్క మాట్లాడలేదు. సాధారణంగా వీధి లోకి వెళ్ళి ఇంటికి తిరిగొచ్చిన తరువాత తన కంట పడ్డ వాళ్ళని అనుకరించి వేళా కోళం చెయ్యనిదే అతనికి పొద్దు గడ వదు. అలాంటి మనిషి ఇలా మూగనోము పట్టడం మేనత్తలో కొంచెం ఆశ్చర్యాన్ని, ఎక్కువగా ఆందోళనని కలిగించింది. "ఆ వగలమారి వీణ్ణి ఏం చేసిందో— నిక్షేపంలాంటి కుర్రాడు. వీడిని ఆ నారా యణమూర్తే కాపాడాలి" అని ప్రార్థిం చింది.

రోజులు గడిచేయి. అతని దిన చర్యలో మార్పులేదు. రోజంతా అలా పుస్తకాలు ముందేసుకుంటాడే తప్ప ఊళ్ళో తిరిగి నాలుగు బోర్డులు సంపా దించడం గాని, పెరటి షెడ్డులో పని చేసుకోడం గాని పూర్తిగా మరిచి పోయేడు. మేనత్త కలుగజేసుకోక తప్పింది కాదు. అతని గది గుమ్మం దగ్గర నిలబడి—

"నువ్వు ఊళ్ళో లేనప్పుడు ఆ గాజుల దుకాణంవాడొచ్చేడురా" అంది.

"వాడా? ఆ రోజు 'అరువు రేపు—

నగదు నేడు' బోర్డు అక్కర్లేదని తిప్పి కొట్టాడే- అమ్మాయిల చేతులు పిసికే వెధవ వాడొచ్చాడా!" అనుకున్నాడు, "ఎవరో కొత్త డాక్టరుట- అతని మనిషి రెండుసార్లు వచ్చి వెళ్ళేడు. బోర్డు రాస్తానన్నావట... చాలా మంది వచ్చే వాళ్ళు... అసలు నువ్వు ఊళ్ళో ఉంటేనా..." అనేసి వెళ్ళిపోయింది.

చదువుతున్న పుస్తకాన్ని పక్కకు పెట్టి గదంతా కలయచూసేడు. చిందర వందరగా వుంది. కుట్లు విడిపోతున్న పుస్తకాన్ని ఓ పాత సూట్‌కేసులో దాచి పాత కాగితాలు, పత్రికలు ఓ మూల బొత్తుగా పెట్టేడు. అందులో ఓ పత్రిక మీద కుటుంబ నియంత్రణ ప్రకటన చూసి విరక్తిగా నవ్వుకున్నాడు.

ఇక ఈ జన్మలో డైసీ తనతో మాట్లాడదన్న భావం భరింపరానిదిగా, ఆమె దృష్టిలో తనొక మదోన్మత్తుడిగా చిత్రింపబడడం భయంకరంగా తోస్తోంది. ఆమెకు దూరంగా ఇలా ఒంటరిగా బతకాలంటే దిగులుగా వుంటోంది. హాయిగా సాగు



తూన్న ఆలాపనలో అపస్వరంగా ప్రయాణ చివరి ఘట్టంలో ఆ సంఘటన చోటు చేసుకుంది. అదే గనక జరిగి వుండకపోతే—థర్డ్‌క్లాస్‌లో ఏడోనెంబరు ఇంటికి ఈపాటికి తను ఎన్నిసార్లు వెళ్ళుండేవాడో! డైసీ తన ఇంటికి వచ్చి పెరట్లో నది ఒడ్డున కూర్చుండి తనతో ఎన్ని కబుర్లు చెప్పేదో! ఆ సమయంలో అతను కోరికని బయటపెట్టి వుండేవాడు. ఇష్టం లేకుంటే ఆ మాట తాపీగా అనేదేమో గాని "చొరవ" అనిగాని, "పోలీస్‌రిపోర్టు" అనిగాని బెదిరించి వుండేది కాదు.

మత్తెక్కించే అత్తరువాసన—చురుకైన చూపులు—అంతగా సన్నంగాలేని గొంతు—మాటల్లో పొదుపరితనం,.... ఇవన్నీ విలువైన జ్ఞాపకాలు. మళ్ళీ ఆ రోజులు వస్తాయా? ఒంటెద్దు బండిలో ఎదురెదురుగా కూర్చొని ఆమెతో ప్రయాణం చేసే సువర్ణావకాశం జీవితంలో మరోసారి వస్తుందా? తనెంత మూర్ఖుడు! అరుదైన ఆమె సాన్నిహిత్యాన్ని దురుసైనప్రవర్తనతో దూరం చేసుకున్నాడు. మగువ మనసు అర్థం చేసుకోకుండా మగతనంతో లొంగదీసుకోవాలనుకున్నాడు. అతనికి పిచ్చెక్కుతోంది. వెర్రిగా అరుస్తూ మార్కెట్ రోడ్డు మీద పరుగెత్తాలనివుంది. ప్రేమించడం తప్పుకాదని పేగులు తెగిపోయేలా అరవాలనుంది.

డైసీ నుండి దూరమైన ఎనిమిదోరోజు!

మనసు చిక్కపెట్టుకుని గతాన్ని మరచిపోవాలని నిశ్చయించుకొన్నాడు. కావలసినది కాకమానదు అనే వేదాంతాన్ని అలవరచుకొన్నాడు. పిరికివాణ్ణి లోకం మరింతగా భయపెడుతుందని అర్థం చేసుకుని రాబోయే పరిణామాన్ని గుండె ధైర్యంతో ఎదుర్కోవానికి సిద్ధమయ్యేడు. గడ్డం గీసుకుని, శుభ్రంగా తయారై సైకిల్ మీద వీధిలోకొచ్చేడు. మనసులో ఓ మూల బెరుగ్గా వున్నా ఓ సారి అలా తిరిగొస్తే అంతా పాతబడుతుందని సరిచెప్పుకున్నాడు. దారిలో చెట్టియార్ రాము వేపు అదోలా చూడ్డం అతను గమనించేడు. వెంటనే సైకిల్ ఆపి --అతన్ని నిలదీసి

"నిజం చెప్పు. గుండెలమీద చెయ్యి వేసుకుని నా గురించి ఏం విన్నావో అంతా చెప్పు" అని అడగాలనిపించింది.

కాని అలా అడగకుండా తిన్నగా బోర్డులెస్ హోటల్‌కి పోయి తన సీట్లో కూర్చుని కాఫీ తాగేడు.

చాలా మంది చాలా రకాలుగా పలకరించేరు. కాని ఎవ్వరికీ సమాధానం చెప్పలేదు.

కొందరు. బంధువుల్ని, స్నేహితుల్ని కలిసేడు. ఫర్వాలేదు తన గురించి ఎవరూ చెడుగా విన్నట్టులేదు. పోలీసు రిపోర్టు ఇవ్వబడినట్లు లేదు. అలా అయితే ఆ సమాచారం క్షణాల మీద వారి దాకా వచ్చి వుండేదే!

మధ్యాహ్నం ఎండ పలచగా వుంది. కోర్టు ఆవరణ పచ్చగా వుంది. తను కప్పుకున్న భయాల దుప్పటిని విదిలించుకుని ఈరోజు బయటకు రావడం మంచిదైంది. రేపటి నుండి తన వృత్తికి సంబంధించిన పనులు మొదలు పెట్టుకోవచ్చు.

కోర్టు ఆవరణ దాటి పక్కనే వున్న పోలీస్‌స్టేషన్‌లోనికెళ్ళాడు. గేటు దాటిన తరువాత దారికి అటూ ఇటూ సన్నజాజీ పందిళ్ళు, వరండా అంచు మీద పూల కుండీలు, స్థంభాలను అంటుకుని పైకి ఎగబాకుతున్న తీగెలు చాలా అందంగా వున్నాయి. కటకటాల వెనక్కి వెళ్ళ




డానికి ఇది తొలి మజిలీ కాదుకదా! దీపం మీదకు ఎగిరే పురుగులా తను అనవసరంగా పోలీసుల కోటలోనికి అడుగు పెడుతున్నాడేమో! జైల్లో పెడితే పెట్టేరు — అనుక్షణం భయంతో చచ్చి సగమైపోయేకన్నా అనుమానం తీర్చు కోవడం మంచిది అనుకున్నాడు. అను కున్నాడే గాని మరుక్షణమే మరలి పోదామనిపించింది. కాని మనసులో ధైర్యం వెన్నెముకను నిటారుగా నిలబెట్టింది. ఫర్వాలేదు ముందుకు పదమంది. విజయమో వీరస్వర్గమో తేల్చుకోమంది.

వరాండా దాటి హాలులాంటి ఆఫీసు గదిలోకి అడుగు పెట్టేడు. గోడలకి సున్నం వేసి ఎన్ని సంవత్సరాలైందో— వెంటిలేటర్లలోంచి వస్తున్న కాసింత వెలుతురూ ఆప్పుకుపోతోంది. ఓ వేపు చిన్న కటకటాల గదివుంది. "అందులో నన్నుమూడు రోజులుంచడం ఖాయం" అనుకున్నాడు రామూ. అలికిడి విని కుసుకుడీస్తున్న సబ్ ఇన్‌స్పెక్టర్ తలఎత్తి రామూ వేపు చూసి—

"నీకోసం మావాళ్ళని పంపిద్దామను కుంటున్నానయ్యా! నువ్వే వచ్చేసేవు" అన్నాడు గట్టిగా నవ్వుతూ.

రామూ ఒళ్ళు చల్లబడిపోయింది. రక్తం గడ్డ కట్టినట్లయింది. చీకటి గుహ లాంటి ఆ పోలీస్ స్టేషన్‌లో ఊపిరి ఆడటం లేదు.

చెమటతో బనీను విపరీతంగా తడిసి పోతోంది. కటకటాల అరవేపు చూసేడు. అందులో మాసిన గెడ్డంవాడు కూర్చొని వున్నాడు. "ఇహనుండి నా మిత్రుడు" అనుకున్నాడు.

"అలా నిలబడిపోయావేం? రా ఇలాకూర్చో" అని ఇనస్పెక్టర్ కుర్చీ చూపించేడు. రామూ అతను చెప్పినట్లు చేసేడు.

"మిమ్మల్నోసారి చూసిపోదామని..."

"నేనే నీ ఇల్లు వెతుక్కుని వద్దామను కుంటున్నాను"

రామూ నాలుక పిడచకట్టుకు పోయింది. "మీకు నా ఇల్లు తెలుసా సార్?" తడబడుతూనే అడిగేడు.

"పోలీస్ డిపార్ట్‌మెంట్ వాళ్ళం — అడ్రస్‌లు ఆచూకీ తియ్యడం కష్టం అంటావా?" ఎంత చల్లగా అన్నాడు. పులికి పంజా విసరడం అంటే మాచెడ్డ సరదా. "ఓ వేళ ఎవ్వడైనా ఓ.వి.గా వున్నా అది నాలుగురోజులే. ఆ తరువాత మాకు చిక్కక మానడు.

"ఓ.వి. — అంటే ఏవిటి సార్?" అడిగేడు రామూ

"అవుటాఫ్ వ్యూ" అని పైన వెంటి లేటర్ దగ్గర డబ్బా చప్పుడు విని ఆగి పోయేడు. "దీని సిగతరగ మళ్ళీ వచ్చిం దయ్యా! ఓయ్ ఫైవ్‌నాట్ సెవెన్" హాలు దద్దరిల్లేలా అరిచేడు.

"కమింగ్ సర్?" వరండాలోంచి ఓ గొంతు వినపడింది. పోలీసుని పిలుస్తున్నాడు; కొట్లో వెయ్యమని చెప్తాడు కాబోలు. ఫైవ్ నాట్ సెవెన్ యూనిఫారమ్‌లో టిప్‌టాప్‌గా వచ్చి ఇన్ స్పెక్టర్‌కి సెల్యూట్ చేసేడు. రామూ అతనికి లొంగిపోవడానికి సిద్ధపడి,లేచి నిలబడ్డాడు. ఇన్‌స్పెక్టర్ అతన్ని కూర్చో మని సైగచేసి, ఫైవ్ నాట్ సెవెన్‌ని చూసి—

"పొద్దుముంచా కోతి మళ్ళీ వచ్చిం దయ్యా" అన్నాడు. అందరూ తలలు పైకెత్తి చూసేరు. వెంటిలేటర్‌లోంచి ఓ

చిన్న కోతిపిల్ల చెయ్యిపెట్టి అక్కడున్న డబ్బాని అందుకొని లాక్కుపోవాలని ప్రయత్నిస్తోంది.

"హే...హే...వెళ్ళు" ఫైవ్‌నాట్ సెవెన్ చేతులు విసురుతూ డేన్స్ చేసేడు. కోతి పిల్ల చెయ్యి వెంటనే వెనక్కిపోయింది.

"అక్కడ వెంటిలేటర్ దగ్గర డబ్బాతో నల్లులమందు పెట్టేను. అది అందుకోవాలని కోతిపిల్ల తాపత్రయం. అది గనక నోట్లో పెట్టుకుంటే కక్కున చస్తుంది. ఆ పాపం నా మెడకి చుట్టు కొంటుంది. పోనీ కింద ఎక్కడన్నా పెడదామా అంటే – ఎవడన్నా ఖైదీ స్నానానికని బయటకు వచ్చినప్పుడు డబ్బాడు మందూ తాగి ఛామ్మన్నాడంటే జనం తిరగబడి పోలీస్టేషన్ తగల బెడతారు. ఎలా చావడం?" అన్నాడు సబ్ ఇన్‌స్పెక్టరు.

"ఇక్కడ నల్లులు విపరీతంగా వున్నాయా?" అన్నాడు రామూ.

"ఉపద్రవంగా వున్నాయి. ఆ కట కటాల కొట్లల్లో అయితే మరీనూ. ఓ సారి అందులోకెళ్తే నీకు బాగా అర్థం అవు తుంది. చీకటిపడడం భయం. గోడలమీంచి పటాలాలు పటాలాలు దిగుతాయి. ఆకాడికీ వారానికోసారి మందుతో గోడలు కడిగిస్తూనే వుంటాను."

"ఓ సారి అందులోకి వెళ్తే తెలుస్తుంది – అంటున్నాడు. కొంప దీసి కొట్లో పెడతాడు కాబోలు" అను కున్నాడు రామూ. అనుకొని "ఇంతకీ పిలిపించిన సంగతి....." అన్నాడు నసుగుతూ

"అది మరిచేపోయానయ్యా – మరేం లేదు....." అని – ఇన్‌స్పెక్టరు మొదలు పెట్టేడు. ఇంతలో వరండాలో పెద్దగా అరుపులు వినబడ్డాయి. జనం – పాతిక ముప్పయి మంది వుంటారు... లోపలికి తోసుకొచ్చేరు. వస్తూనే ఒకడ్ని మెడ పట్టుకుని ఇన్‌స్పెక్టర్ కాళ్ళదగ్గరికి తోసేరు. వాడిపిల్లు పట్టుకొని ఇన్‌స్పెక్టర్ పైకి లేపాడు. లేపి–

"ఏరా పట్టపగలే ఇళ్ళల్లో జొర బడ్డావా" ఫెడెల్మని ఓ దెబ్బ వేసాడు. ఇద్దరు కానిస్టేబుళ్ళు అతని ఆజ్ఞ మేరకు వాడిని బరబరా ఈడ్చుకొనిపోయి ఓ అరలోనికి తోసి తాళం వేసారు.

"ఈ రోజు ఉదయమే వాడిని విడుదల చేసేం. మళ్ళా ఏదో అఘాయిత్యానికి తయారయ్యేడు దొంగ రాస్కెల్" అంటూ టోపీ పెట్టుకొని బెత్తం పట్టుకొని "మీరు వెళ్ళండి. నేను వస్తున్నాను. స్పాట్ చెక్ చేసి ఫస్ట్ రిపోర్ట్ రాయాలి" అని జనానికి చెప్పి, "నువ్వుండవయ్యా– త్వరగా వస్తానులే" అని రామూతో అని టకటకమని చప్పుడు చేసుకుంటూ ఇన్‌స్పెక్టర్ వెళ్ళిపోయేడు.

పోలీస్‌స్టేషన్ మళ్ళీ నిశ్శబ్దంగా తయారైంది. తనొక్కడే అక్కడ కుర్చీలో ఎంతసేపని కూర్చోగలడు? బయటకు వెళ్ళిపోవానికి ప్రయత్నిస్తే మెడపట్టుకొని ఫైవ్‌నాట్ సెవెన్ నల్లుల గదిలో పడేస్తాడేమో! కాస్సేపట్లో ఫైవ్ నాట్ సెవెన్ వచ్చేడు. ఓసారి అతన్ని పరీక్షించి చూద్దామని రామూ వరండాలో సైకిల్ తీసుకొని బయల్దేరబోయేడు.

"వెళ్ళిపోతున్నారా?" అన్నాడు ఫైవ్ నాట్ సెవెన్.

"అవును"

 

" అలాగేకానీండి! దొరగారొచ్చేసరికి చాలా లేటవుద్ది" అన్నాడు ఫైవ్‌నాట్ సెవెన్.




పదిహేను రోజులు గడిచాయి.

రామూ గాడీలో పడ్డాడు. ఎప్పటి లాగే హుషారుగా పనులు చకచకమని చేసుకుపోతున్నాడు. పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళి వచ్చాక అనుమానాలు పటాపంచలై పోయేయి. తన ఖాతాదారులను కలుసుకున్నాడు. పాత బాకీలు వసూలయ్యేయి. కొత్త ఆర్డర్లు వచ్చేయి. పెయింటర్ జయరాజ్ తన బిజినెస్‌ని తన్నుకుపోయేడన్న అపోహకూడా తొలగిపోయింది.

అతన్ని చూడగానే ఖాతాదారులకి ప్రాణాలు లేచివచ్చేయి. మార్కెట్ గేట్ దగ్గర సబ్బుల కంపెనీవాడు రామూని కౌగలించుకున్నాడు. కట్‌పీస్ క్లాత్ సెంటర్‌వాడు "రక్షించావయ్యా సమయానికొచ్చేవ్" అని పిలిచి కొత్తబోర్డులు రెండు పురమాయించేడు. పుస్తకాల దుకాణం వాడైతే అల్లంత దూరంలో రామూని చూడగానే ఆనందం పట్టలేక కేకలేసేడు. ఒకరిద్దరు తప్ప అందరూ అతని పునర్దర్శనానికి ఆనందించినవాళ్ళే.

బోర్డ్‌లెస్ హోటల్లో బాతాఖానీ— చెట్టియార్ దుకాణం దగ్గర పలకరింపులు— మేనత్త చెబుతున్న ఆత్మకథ— పెరటి షెడ్డులో కలిపిన రంగులు, కదలాడుతున్న కుంచెలు— ఇసుక మేటమీద ఆరబెట్టబడుతున్న బోర్డులు— చేతినిండా పని— జేబునిండా డబ్బు.

గాజుల దుకాణంవాడితో స్నేహం మళ్ళీ కుదిరింది. రెండు మూడుసార్లు రామూ కోసం ఇంటికి వచ్చి, అడ్వాన్స్ కూడా చేతిలోపెట్టి 'అన్ని రకముల నైలాన్ గాజులు అమ్మబడును' అని బోర్డు రాసిపెట్టమన్నాడు.

"నా పాతబాకీ సంగతి?" అని రామూ అడిగేడు.

"ఫ్రెండ్స్ మధ్య పాత బాకీలేమిటి గురూ!" గాజులవాడు తప్పించుకో బోయేడు.

"నువ్వా జయరాజ్‌గాడి దగ్గరకు పోవలసింది— వాడే నీకు తగినవాడు తప్ప నిజాయితీగా పనిచేసేవాళ్ళంటే నీక్కొట్టదు" అన్నాడు రామూ.

"చూడు గురూ! వ్యాపారంలోనాణ్యత నాకు ముఖ్యం. అది లేనినాడు దుకాణం మూసేస్తాను గాని ధస్తే వ్యాపారం చెయ్యను. అనాకాణీ పెయింటర్ల చేత బోర్డులు గీయించే బదులు ఖాళీ బోర్డు వేలాడదీయడం ఉత్తమం" అన్నాడు గాజులవాడు. ఆ మాటలకు రామూ పొంగిపోయేడు. జయరాజ్ గురించి తన మనసులోమాట గాజులవాడి నోటంట బయటడిపడినందుకు చాలా సంతోషించేడు.

* * *

సాయంత్రం చాలా చల్లగా వుంది. అత్తయ్య ఇంట్లో లేదు; మందిరానికి వెళ్ళినట్టుంది. పెరటి షెడ్డులో కూర్చొని రామూ చాలా సీరియస్‌గా పని చేస్తున్నాడు. వీధిలో అలికిడి బాగా తగ్గింది. పీచుమిఠాయివాడు గంట వాయించు

కుంటూ పోతున్నాడు. అంటే టైము ఏడు కావస్తోందన్నమాట!

షెడులో లైటు వెలిగించేడు. ఆ వెలుతురులో బేస్‌వర్క్ పూర్తిచేసిన బోర్డుని పరీక్షగా చూసేడు. రంగు పూసిన భాగాన్ని గోడవేపు తిప్పి, బోర్డుని గోడకు చేరబెట్టేడు. లేచి, ఒళ్ళు విరుచుకుని కొద్దిగా వెనక్కి తిరిగి చూసేడు. నదిలో స్నానానికని వచ్చిన పిల్లకాయలు పెరటిగోడ మీంచి తొంగి చూడడం పరిపాటి. వాళ్ళందరి ముఖాలు తనకి గుర్తు. కాని మసక చీకటిలో ఇప్పుడొక కొత్త ముఖం కనిపించింది. నక్షత్రాల వెలుతురులో స్పష్టాస్పష్టంగా కనిపిస్తున్న అవుట్‌లైన్–పెద్దతల, గాలికి రేగుతున్న జుట్టు, ఎత్తయిన నుదురు, సన్నని గడ్డం. తను చూస్తున్నది నిజమా? గోడ మీద మోచేతులు నిలబెట్టి, అరచేతుల మీద గెడ్డాన్ని ఆన్చి డైసీ నవ్వుతూ చూస్తోంది.

చేతిలో వున్న బ్రష్‌ని అవతల పెట్టి దృష్టి మందగించిన వాడిలా తడబడుతూ గోడని సమీపించేడు. తన చేతిని గోడ మీదికి పోనిచ్చి ''డైసీ'' అంటూ ఆమె తలని పట్టుకుని చూసేడు.

"అవును నేనే" అంది కొంచెం మందంగావున్న గొంతు. రామూకి సందేహం తీరిపోయింది.

"ఇలా వచ్చేరేం? వీధి వేపు నుండి పిలవలేకపోయేరా?'' అడిగేడు.

"పిలచి పిలిచి చాలా సేపు నిరీక్షించేను. జవాబు రాలేదు''

"అత్తయ్య మందిరానికి వెళ్ళింది...'' అతనికి వాక్యం ఎలా పూర్తి చెయ్యాలో అర్థం కాలేదు. "ఇలా చుట్టూ తిరిగి రావడం శ్రమ కదూ? వీధివేపు నుండి పిలిస్తే వచ్చేవాణ్ణిగా'' అన్నాడు.

"కారణం ఇదివరకే చెప్పేను" అంది డైసీ.

"అవునవును. కాని నేను అడుగుతున్నది ఇలా ఎందుకొచ్చేరని?"

"ఇంకెలా రావడం బాజా భజంత్రీలతోనా?"

"అవును. అత్తవారింటికి పెళ్ళికూతురు అలాగే రావాలి" అందామనుకుని నాలుక అదుపులో పెట్టుకున్నాడు. "పోలీస్ స్టేషన్‌లో ఇనస్పెక్టరు నోటంట తన సందేహం తీరనేలేదు. ఆ రోజునాటికి డైసీ రిపోర్టు ఇచ్చివుండకపోయినా–ఈ మధ్య కాలంలో ఇచ్చిందేమో! ఇచ్చి వీధి గుమ్మంలో పోలీసుల్ని కాపలా పెట్టి పెరటి తోవలో నేను పారిపోకుండా చూడ్డానికి వచ్చిందేమో? అందుచేత పొరపాటున కూడా ఒక్క పిసరు చనువు ప్రదర్శించకూడదు'' అనుకున్నాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?'' అడిగింది డైసీ.

"మిమ్మల్ని దూరం...చేసుకున్నాను. ఈ మధ్య పనుల ఒత్తిడి...కలుసుకోలేకపోయేను'' అన్నాడు రామూ తడబాటుతో.

"నేను కూడా పనుల ఒత్తిడిలోనే వున్నాను. ఈ మధ్య చేసిన టూర్ గురించి రిపోర్టు తయారు చేసి హెడ్ క్వార్టర్స్‌కి పంపడంతో ఒక్క క్షణం కూడా తీరిక చిక్కలేదు"

"బహుశ అవన్నీ ఆలోచిస్తూ వుండడం వల్లనే గాబోలు ఆ రోజు మీరు గుడ్‌నైట్ చెప్పలేదు'' వద్దు వద్దనుకుంటూనే కథలోకి వస్తున్నాడు రామూ.

''ఎప్పుడు?'' అడిగింది డైసీ.

"అదే కొప్పాళనుండి ఇక్కడికి





బస్సు మీద వచ్చిన రాత్రి మాట్లాడకుండానే వెళ్ళిపోయారుగా"

"మరో రోజు మీకు గుడ్ మార్నింగ్ చెప్పానా- ఆ రాత్రి గుడ్ నైట్ చెప్పడానికి?"

"అ...వు. నను...కోం...డి"

"మీకు రావలసిన ఫీజు గురించి కనుక్కోడానికి ఆఫీసుకి వస్తారేమో అనుకున్నాను"

"దానికేంలెండి. మీ దగ్గర డబ్బు ఎక్కడికి పోతుంది-ఎప్పుడు కావాలంటే అప్పుడే అడిగి తీసుకుంటాను"

"అలా వీల్లేదు. మీరు ఫారాలు నింపి సంతకాలు చెయ్యాలి. అవి హెడ్ క్వార్టర్స్‌కి పంపితే అక్కడనుండి పే ఆర్డర్ రావాలి"

"అలాగా!" రామూ ఓ క్షణం ఆగి, "ఇక్కడ నిలబడి మాట్లాడుకుంటున్నాం ఏమిటి?" అన్నాడు.

"మీరు ఇక్కడే కనిపించేరు కనుక" అంది డైసీ.

అతనికి ఏం అడగాలో తోచలేదు. ఆమె రాక పగటికలలా వుంది. తన ఇంటి పెరటి గోడని ఆనుకుని తనతో మాట్లాడుతోందంటే అతనికి నమ్మ శక్యం కాకుండా వుంది.

"మీరు నా కోసం వచ్చారా?" అని అడిగేడు.

"కాకపోతే ఈ వీధికి రావలసిన పని నాకేం వుంది!" అన్నదామె.

"నదివేపు అలా షికారుగా వచ్చేరేమో అనుకున్నాను"

"అవును. అందుకోసం కూడా రావచ్చుగా" అంది అనుకోకుండా.

రామూ సగంలో వున్న పనులు అలాగే విడిచిపెట్టి గోడదూకి డైసీ పక్కకు చేరేడు. మధ్యాహ్నం నుండి క్షణం తీరిక లేకుండా పనిచేస్తున్న సంగతి మరచిపోయి కనీసం ముఖం కడుక్కొని తల దువ్వుకోవాలన్న ధ్యాసైనా లేకుండా ఆమెను నదివేపు తీసుకెళ్ళేడు.

ఇసుక తిన్నెదాటి రాతిమెట్ల మీదకి చేరుకున్నారు. నక్షత్రాలు అందంగా మెరుస్తున్నాయి. చీకటి ముఖమల్‌లా మెత్తగా వుంది. నదిమీంచి వీస్తున్న గాలిలో ఆమె రాసుకున్న అత్తరు పరిమళం కలసిపోయి అతనిలో అలసట పూర్తిగా పోగొడుతోంది. నదిలో పాదాలు పెట్టుకుని ఆఖరి మెట్టు మీద కూర్చున్నారిద్దరూ! అతను ఎవర్నీ లక్ష్యపెట్టే స్థితిలోలేడు. తను డైసీ సన్నిధిలో వున్నాడు. అంతకన్నా ఇంకేం కావాలి. పాదాలమీద అలలు గిలిగింతలు పెడుతున్నాయి. అవతల ఊరు సద్దుమణిగింది. డైసీని ఓసారి తనివితీరా చూసేడు. మనసులో అనురాగం అలలైసాగింది; కెరటంలా పైకి లేచింది. అప్రయత్నంగా ఆమెకు దగ్గరగా చాలా దగ్గరగా జరిగేడు. ఆమె జరగలేదు. కాని "అదిగో మళ్ళీ చిక్కుల్లో పడుతున్నావ్" అంది.

"నిన్ను ప్రేమిస్తున్నాను డైసీ! నువ్వు లేకుండా బతకలేను" అన్నాడు.

"అలా అనవద్దు—నేను నమ్మలేను. 'నిన్ను ప్రేమిస్తున్నాను. నువ్వంటే అభిమానం. నీ కోసం ఏమైనా చేస్తాను' లాంటి మాటలు కృత్రిమంగా వాస్తవానికి దూరంగా వినిపిస్తాయి నాకు. అవి పుస్తకాలు చదివి, సినిమాలు చూసి నేర్చుకున్న చిలకపలుకులు"

మనసులో తుమ్మెదలా రొదపెడుతున్న ప్రేమని బయటపెట్టడం కృత్రిమం

ఎందుకవుతుందో అతనికి అర్థంకాలేదు. ఆమె నదిలోకి దూకమంటే సిద్ధంగా వున్నాడు తను. ఇద్దరి మధ్య నిశ్శబ్దం గూడుకట్టుకొంది. అతని వేళ్ళు మెల్లగా ఆమె అరచేతిని తాకేయి. ఆమె అడ్డు చెప్పలేదు. తన అరచేతిని పూర్తిగా చేర్చి మెత్తగా నొక్కేడు. చల్లగా వుంది.

"ఇన్ని చెప్పినా ఇంకా పిచ్చిపోలేదు" అంది.

"నువ్వు పక్కనేవుంటే పిచ్చికాక మరేమిటి?" అన్నాడు.

తన గుండె లోతుల్లో నిక్షిప్తమైన అనుభూతుల గనుల్ని తవ్వి, ఆమెముందు కుప్పపోయాలని, తన జీవితాన్ని ఆమె ముందు చాపలా పరచి పుంఖాను పుంఖాలైన భావజాలాన్ని నిజాయితీగా వ్యక్తపరచాలని, ఆమె దృక్పథంలో మార్పు తెచ్చి ఆమె అనురాగ వెల్లువలు తన హృదయ కేదారాలకు మళ్ళించాలని రామూ ఆరాటపడుతున్నాడు.

కాని మనసులోని భాషని మాటలలోకి తర్జుమా చెయ్యటం వీలుకావటంలేదు. వాక్య నిర్మాణం కుదరటంలేదు. పట్టుకుంటే పారిపోయే పాదరసంలా భావాలు మాటలకి అందటంలేదు. అందిన వాటిలో ఏది ముందో ఏది వెనకో తేలటంలేదు. అయినా ప్రయత్నించేడు. ఆమె పరిచయం తన జీవితాన్ని మలుపు తిప్పిందని, అందుకు ఎంతగానో ఋణపడి వున్నానని చెప్పేడు. జీవితంపట్ల తనకున్న అభిప్రాయాల్ని, జీవనం కోసం సైన్‌బోర్డు పెయింటర్‌గా స్థిరపడడానికి కారణాల్ని, అక్షరాలమీద తనకున్న అభిమానాన్ని,

వాటి అందచందాల్ని, తీరుతెన్నుల్ని, వాటికి సంబంధించి తను చదివిన శాస్త్రాల్ని చెప్పి, పెయింటర్‌గా స్థిర పడటంలో సార్థకతని డైసీ అర్థంచేసు కునేలా వివరించేడు.

తన కాలేజీ రోజుల్ని, అప్పుడు ఎదురైన అమ్మాయిల్ని, ఆ తర్వాత తన కొచ్చిన పెళ్ళి సంబంధాలని, బ్రహ్మచారిగా వుండిపోవాలని తను తీసుకున్న నిర్ణయాన్ని, ఆనంద్ భవన్ లాడ్జిగదిలో నాగపూర్ అకౌంట్స్ ఆఫీసరు కూతురితో ఎడంగా కూర్చొని మాట్లాడకుండా గడిపిన సాయంకాలాన్ని చెప్పేడు.

ఆ తర్వాత వృత్తిరీత్యా ఆమెను కలుసుకున్న రోజున తనపట్ల రేగిన కుతూహలాన్ని, ఆమె చరిత్ర తెలుసుకోవాలన్న ఉబలాటాన్ని, ఆ ఉబలాటంతో ఆమె ఇంటి తలుపు తట్టి అడుగుపెట్ట డాన్ని, ఆఫీసులో కళ్ళజోడు సంఘటనని, అత్తరు గుబాళింపుని, ఆ తర్వాత ఆమె ఛాయలకు పోరాదని తీసుకున్న నిర్ణయాన్ని - కాని ఆమె తన ఇంటికి వెతుక్కుంటూ వచ్చిన తరువాత పల్లెటూళ్ళు పర్యటించడాన్ని, ఆఖరి రోజు రాత్రి తన తొందరపాటుని, పోలీసు రిపోర్టు గురించిన భయాన్ని కాస్త అటూ ఇటూ అయినా మొత్తానికి పూర్తిగా చెప్పగలిగేడు.

డైసీ ఓపిగ్గా వింది. ఇంకా చెప్పడానికి అతనికేమీ కనిపించలేదు. తన మాటలు మనస్ఫూర్తిగా విందో లేదో తెలుసుకోవాలని డైసీ ముఖంలోకి చూసేడు. కాని చీకటివల్ల ముఖంలోని భావాలు చదవడానికి వీలుకావడంలేదు.

"నువ్వు చెప్పినట్లు నేను ప్రేమ పిచ్చిలో పడ్డాను. నువ్వు కాదంటే ఇది నయంకాని పిచ్చి-నువ్వుతప్ప మరొకరు నయం చేయలేని పిచ్చి. నా గురించి బాగానే వివరించగలిగేనని అనుకుంటున్నాను. మరి నీ గురించిన వివరాల్ని ఆశించడంలో తప్పులేదు కదూ?" అన్నాడు రామూ ఆమె అరచేతిని మెల్లగా నొక్కుతూ.

"నా గురించి ఎటువంటి వివరాలు ఆశిస్తున్నావు నువ్వు?... నువ్వువినిపించిన గతానికి, వినాలనుకుంటున్న చరిత్రకి ఏ విధంగానూ పొంతనలేదు" అంటూ సన్నగా నవ్వింది డైసీ. రామూ ఏదో అనబోతే తిరిగి తనే ప్రారంభించింది. "నీ కుతూహలం అర్థం చేసుకోగలను. మన పరిచయం అయి కొన్ని నెలలు కావస్తోంది. నా గురించి తెలుసుకోవాలని నువ్వు ఆశించడం సహజం. సరే నా కథని ఎక్కడనుండి ప్రారంభించడం?"

రామూ శ్రద్ధని మూట కట్టుకుని కూర్చున్నాడు. ఆమె ఏకాగ్రతకి అంతరాయం కలిగించకూడదన్న ఉద్దేశంతో ఇంతసేపూ ఆమె చేతిలో ఉంచిన తన చేతిని తొలగించేడు. డైసీ చెబుతోంది. కాని ఆమె గొంతులో సీరియస్‌నెస్ లేదు. గంభీరమైన వాతావరణంలో ఒక వ్యక్తి తనఅంతరంగాన్ని కొండంత నిజాయితీతో తవ్వి కుప్పగా పోసిన తరువాత కేవలం బదులు తీర్చడం కోసమే అన్నట్లు చెబుతోందిగాని గుండెబరువు దిగుతున్న జాడ ఎక్కడాలేదు. రామూలో కొంచెం నిరుత్సాహం కలిగింది.

"నా గురించి రంగురంగుల కలలు కనే కన్నా నన్ను నన్నుగా తెలుసుకో. ఆరాధనా భావాన్ని అవతలకు నెట్టి అపోహలు లేకుండా ఆలోచించు. నువ్వు చెప్పిన తీరులో ఉద్వేగం వుంది. దానికి కదిలి నేనీ కథ చెప్పటం లేదు. నీ

 

ప్రభావం నా మీద ఎంతమాత్రం లేదు. కేవలం బాకీ తీర్చడానికే ఈ కథ... నిన్ను పెయింటర్ రామూగా చూసేనే తప్ప ప్రేమించే దృష్టితో చూడలేదు. నీ పనితనం నాకు నచ్చింది. నీకో పని అప్పచెప్పాలని నా వెంట తీసుకెళ్ళాను. ఆడదాన్నని అలుసుతీసుకోబోయేవు..హద్దులు మీరాలనుకున్నావ్... మళ్ళీ అదంతా దేనికి గాని మధ్యలో అడ్డు పడకుండా జాగ్రత్తగా విను" అంటూ ప్రారంభించి తన బాల్యం గురించి చెప్పింది.

అడవులు, కొండలు దాటి నదులకు అవతలవున్న ఓ కుగ్రామంలో తన చిన్ననాటి రోజులు గడిచేయంది. అయితే ఆ ఊరు పేరేవిటో మాత్రం చెప్పలేదు. అందులో తన తండ్రికి భూములు, తోటలు వుండేవి. వాళ్ళది చాలా పెద్ద కుటుంబం. అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు, చిన్నాన్నలు, పిన్నమ్మలు, వదినెలు, మేనత్తలు ముసిలీముతకా చాలామంది ఆ ఉమ్మడి కుటుంబంలో వుండేవారు. ఆ ఇంట్లో పదిహేను మందికిపైగా చిన్న పిల్లలే ఇంచుమించు ఒకే ఈడువాళ్ళు. ఇల్లు ఒక హాస్టల్లా వుండేది...

"నాకు ఎప్పుడూ ఏకాంతంగా వుండాలనిపించేది. కాని మా ఇంట్లో అది సాధ్యం అయ్యేది కాదు. ఇల్లు పెద్ద కోటలా వున్నా ఎక్కడ చూసినా మనుషులే సర్కస్ కంపెనీలాగ. తీరిగ్గా కూర్చుని ఆలోచించడానికి ఓమూల ఖాళీ గాని, ఒక్క నిమిషం ప్రశాంతిగాని వుండేది కాదు. మా గదిలో పీలుకాక మరో గదిలోకి వెళ్తే చాలు పిన్నమ్మో, మేనత్తో జబ్బ పట్టుకుని పనులు పురమాయించేవాళ్ళు. గదుల్లో శాంతి లేక వరండాలోకి వెళ్తే నా తోటివాళ్ళు చుట్టుముట్టి ఆడితేగాని వదిలిపెట్టేవాళ్ళుకారు. వాళ్ళతో తగువు పెట్టుకుని, నన్ను వెలివేసేలా ప్రవర్తించినా నన్ను వెంటాడి తమలో కలుపుకొనేవాళ్ళు...

ఇంట్లో గొడవలతో నా చెవులు హోరెత్తిపోయేవి. పిచ్చెక్కి పోతున్నట్లు అనిపించేది. చంటి పిల్లల ఏడుపులు, ఆడేపిల్లల అరుపులు, ఈడొచ్చినవాళ్ళ కొట్లాటలు, పెద్దవాళ్ళ అదిలింపులు, ముసలివాళ్ళ సణుగుళ్ళు, సాధింపులు... అదంతా పెద్ద సంతలా మతి చలించిన వాళ్ళు మసలే లోకంలా వుండేది. ఆ ఇంట్లో ఆకు చప్పుడైనా నాకు డప్పుల మోతలా అనిపించేది. ప్రతి చిన్న విషయానికి ఉద్రేకపడే స్వభావం నాలో చోటు చేసుకుంది. మనసులో సున్నితమైన చోటు అనేది వుంటే అదిమొరటుగా తయారైంది.

నా తల్లిదండ్రులకు నేనంటే ఎందుకంత అభిమానమో అర్థం అయేదికాదు. ఏ కారణం వల్ల నా అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు నా చెలిమిని వాంఛిస్తున్నారో, ఎందుచేత ఇంటిల్లిపాదీ నన్ను హత్తుకుని ఆప్యాయత కురిపిస్తున్నారో బోధపడేది కాదు. అంతమందిలో ఒతకడం నాకిష్టంగా వుండేదికాదు."

"ఈ కారణం వల్లనే కాబోలు దేశంలో జనాభా మితిమీరకూడదన్న అభిప్రాయం నీలోబలంగా నాటుకుపోయింది" అన్నాడు రామూ.

అతను అడ్డు తగిలినందుకు అసహనంగా చూసింది.

"అది నిన్న మొన్న నాలో కలిగిన అభిప్రాయం, దానికీ నా బాల్య జీవితానికీ ఎలాంటి సంబంధమూ లేదు. అనవసరంగా ఒకదానితో మరొకటి ముడి పెట్టా



లని ప్రయత్నించకు. చిన్ననాటి అనుభవాల ప్రభావం ప్రస్తుత భావాల మీద ఉందని తీర్మానించకు. లంకంత కొంపలో నేనొక్కర్తినే పెరిగి వుండినా ఇప్పటి భావాలు ఇప్పటివే- మార్పు వుండేది కాదు" అని మందలించి మళ్ళీ కొనసాగించింది.

"నేను ప్రతి రోజు మా ఊరు నుండి మైలున్నర దూరం నడిచి హైరోడ్డు చేరుకొని, అక్కడ బస్సు పట్టుకొని పట్నంలో కాన్వెంట్‌కి వెళ్ళేదాన్ని. ఎందుకో నాకు చదువు మీద కూడా ఆసక్తి క్షీణించింది. నిరర్థకమైన ఈ గానుగెద్దు జీవితాన్ని అధిగమించి ప్రయోజనకరమైన పనులు చేయాలని అనిపించేది. కానీ మా ఇంట్లో వాతావరణం నన్నొక జడ పదార్థాన్ని చేసింది. ఇలా తప్ప జీవితం మరోలా ఉంటుందని, మూకుమ్మడి బతుకు మీద ఆసక్తి పెరుగుతుందని ఏనాడూ కలలు గనలేదు. నా పెళ్ళి ప్రస్తావన మా ఇంట్లో తల ఎత్తేవరకు నా జీవితంలో మార్పు ఉంటుందని ఎంత మాత్రమూ ఊహించలేదు. ఇంట్లో పిల్లల మూక నా చుట్టూ చేరి ఎగతాళి చెయ్యటం మొదలు పెట్టేరు. మా నాన్న మిగిలిన చిన్నాన్నలతో కలిసి తీవ్రంగా ఆలోచించేవాడు. పోస్టులో నా జాతకం చాలా అడ్రస్సులకు వెళ్ళింది. ఊరిలో ప్రతి ఒక్కరూ నా వేపు అదోలా చూసేవారు.

"ఓ రోజు మా అమ్మ నన్ను గదిలోకి పిలిచి త్వరగా తయారు కమ్మంది. నేను గంగిరెద్దులా అలంకరించుకొని కూర్చుంటే ఓ కుర్రాడు మా ఇంటికొచ్చి నన్ను చూస్తాడట! అతనికి నచ్చితే తాంబూలాలు పుచ్చుకుంటారట. నా ఒంట్లో సెగలు పుట్టేయి. ఈ పద్ధతి నాకు సమ్మతం కాదని కచ్చితంగా చెప్పేను. నన్ను మరొకరు పరీక్షించి నచ్చడం, నచ్చక పోవడం నా కిష్టం లేదన్నాను. బదులుగా ఆ వచ్చే మనిషిని పరీక్షించి నేనే అభిప్రాయం చెబుతానన్నాను.

"నా మాట విని ఇంట్లో వారంతా అదిరిపడ్డారు. పెద్ద వాళ్ళు ముక్కు మీద వేలేసుకున్నారు. ముసలివాళ్ళు "మా కాలంలో ఇవి ఎరుగుదుమా" అని బుగ్గలు నొక్కుకున్నారు. మా నాన్న అగ్గి రుద్రుడై పోయాడు. నన్ను ఎంతలా తిట్టాలో అంతలా తిట్టి చెయ్యి చేసుకో బోయేడు. మా చిన్నాన్నలు అడ్డుకున్నారు. మా రెండో చిన్నాన్న నన్ను గదిలోనికి తీసికెళ్ళి ముందు బతిమాలి, లొంగకపోతే మందలింపులోకి దిగాడు. 'పిచ్చిపిచ్చిగా అరవకు. ఇంత వరకూ ఇది జరగని పని అని నీకు తెలీదా" అన్నాడు. ఇంత వరకూ జరగని పనే అయితే మరొకరు దాన్ని మొదలుపెట్టడం మంచిదన్నాను. అసలు నాకు పెళ్ళి చేసుకునే వుద్దేశం లేదని, ఉద్యోగం చెయ్యాలని వుందని అన్నాను."

ఈ మాటలకు రామూ గుండెలో చలి వేసింది.

"మొత్తానికి నీ మాట నిలబెట్టుకున్నావు. ఇప్పటికైనా అభిప్రాయాన్ని మార్చుకోరాదా?" అన్నాడు. కాని డెసీ అతని వ్యాఖ్యానాన్ని లెక్క చెయ్యలేదు. "మొత్తానికి నన్ను ఒప్పించేరు. నాకు మా ఇంట్లో అందరికన్నా మా రెండో చిన్నాన్నంటే చాలా ఇష్టం. అతని మాటను తోసిపుచ్చలేక బాగా ఆలోచించి, ఓ నిశ్చయానికొచ్చి అలంకరణకు ఒప్పుకున్నాను. అంతే! ఇంట్లో ఆడవాళ్ళ నగ

 

లన్నీ నాకు తగిలించేరు. ముక్కు, చెవులు, మెడ, చేతులు, కాళ్ళు అన్నీ ఆభరణాలతో బరువెక్కి పోయేయి. దానికితోడు ఆ పట్టుచీరె, నడుముకు ఒడ్డాణం— నాకు ఊపిరాడలేదు. నా అంతట నేను అడుగు తీసి అడుగు వెయ్యలేని స్థితి! బహుశ పెళ్ళిచూపుల సమయంలో పిల్ల ఎటూ పారిపోకుండా అలా ఆభరణాలతో కట్టి పడేస్తారు కాబోలు. నా వ్యక్తిత్వానికి గుర్తింపు నశించిపోతోందని బాధ కలిగింది. అయినా ఆ క్షణంలో భరించి ఊరుకున్నాను.

నన్ను చూసిన మా అమ్మ ముఖంలో కొండంత సంతృప్తి కనిపించింది. అప్పటికి నా వయస్సు పదమూడేళ్ళే! అయినా నా మట్టుకు నాకు సొంత అభిప్రాయాలేర్పడ్డాయి. ఏం చేస్తే నా భవిష్యత్తు బాగుంటుందో ఊహించగలిగే శక్తి నాలో అలవడింది.

పిల్ల, పెద్ద, ముసలి, ముతక అందరూ నా చుట్టూ చేరి నా అందాన్ని తెగ వర్ణించేరు. పెళ్ళికొడుకుగారు తల్లి తండ్రులతో రాగానే మా వాళ్ళు ఎంత హంగామా చేసేరని! భూప్రపంచం మీద పెళ్ళికొడుకు లభించడం చాలా కష్ట సాధ్యమైన పనిలాగా, అతనొక అరుదైన బహుమానంలాగా మా వాళ్ళు భావించేరు.

పెళ్ళికొడుకు బాగానే వున్నాడు. కాని అది నాకు పట్టే విషయం కాదు. వంద ఎకరాల భూమి, తోటలు, దొడ్లు చాలా పెద్ద ఆస్తి. ఒకడే కొడుకు. పెళ్ళికొడుకు తండ్రి ఉంగరాల వేళ్ళతో మీసాలు దువ్వుకొంటూ తన పుత్రరత్నం గుణగణాల్ని, వ్యవహార జ్ఞానాన్ని, తెలివి తేటల్ని వర్ణిస్తూంటే అతని భార్యామణి భర్తగారి మాటలకు వంత పాడుతోంది.

వాళ్ళ వ్యవహారం చూసి నాకు నవ్వొచ్చింది. నేనేదో సిగ్గుతో తల వంచుకుంటానని అనుకొన్న వాళ్ళకి ఆశాభంగం అయింది. వాళ్ళ దృష్టిలో నేను చాలా బాధ్యతా రహితంగా ప్రవర్తించేను. నా ప్రస్తావన రాగానే నేను జంబుఖానా మీంచి లేచి ధీటుగా నిలబడ్డాను. కట్టుకున్న పట్టుచీరె రెపరెపలాడింది. ఒంటి మీద సర్వాభరణాలు జిగేల్మన్నాయి; చప్పుడు చేశాయి."

రాముకి నవ్వొచ్చింది. "నేను ఆ దృశ్యాన్ని ఊహించగలుగుతున్నాను. సిల్కు చొక్కాలో ఆ పిలక పెళ్ళికొడుకు అష్ట వంకర్లు తిరిగి పోయుంటాడు. కదూ?" అన్నాడు.

"అతనికి పిలక వుందని నేను చెప్పలేదు. పల్లెటూరి వేషభాషలు అతనిలో ఎంతమాత్రమూ లేవు" అంది డైసీ.

రాముకి ఎందుకో పెళ్ళికొడుకు మీద అసూయ కలిగింది. "వాడికి మెల్లకన్ను వుండి వుంటుంది" అన్నాడు.

"కానే కాదు— నేను ముందే చెప్పాను. అతను అందగాడే"

రాము మళ్ళీ ఏదో అనబోతే వారించి తన కథ కొనసాగించింది.

"నేను లేచి నిలబడి రెండడుగులు ముందుకేసేను. పెళ్ళి కొడుకు కళ్ళల్లో నేను కొరతానేమోనన్నంత భయం కనిపించింది. నా నడక తీరు చూసి ప్రతి ఒక్కరూ దిగ్భ్రాంతిచెందేరు. పెళ్ళికొడుకు తండ్రి కుమారుడి గుణగణాలు వర్ణిస్తూ తెరిచిన నోరు ముయ్యకుండా అలాగే నా వేపు బొమ్మలా చూస్తూ కూర్చుండి పోయేడు.

మా అమ్మ గట్టిగా మందలించింది. 'చేసిన తప్పుకు చెంపలు వేసుకుని పెద్ద వాళ్ళముందు సాష్టాంగపడు' అంది. నేను చెయ్యనని అడ్డంగా తల ఊపేను. పెళ్ళి కొడుకు నన్ను సూటిగా చూస్తూ 'ఎన్నో క్లాసు చదువుతున్నావ్?' అనడిగేడు. పెళ్ళి చూపుల్లో అడిగే సాధారణమైన ప్రశ్నే అది. బదులుగా—

'నువ్వెన్నో క్లాసు?' అనడిగేను.

పెళ్ళికొడుకు హడలిపోయేడు. అతను మూడో క్లాసు దాటలేదని ఆ తర్వాత నాకు తెలిసింది. షాక్‌నుండి తేరుకుని 'నువ్వు పాడగలవా?' అని అడిగేడు.

'మరి నువ్వో?' అని అడిగేను.

అతని తండ్రి కలుగజేసుకుని 'మా వాడికి మంచి విద్వాంసుడిచేత సంగీతం నేర్పించేను. త్వరలో మద్రాస్ మ్యూజిక్ అకాడమీలో పాడబోతున్నాడు కూడా' అని 'మరి నీకు పాడడంవచ్చా?' అని అడిగేడు.

నేను జవాబు చెప్పబోయేలోగా మా నాన్న నన్ను వారిస్తూ—

'పట్నం నుండి వారానికి మూడుసార్లు సంగీతం మాస్టారు ఇక్కడికి వస్తూవుంటాడు... అని పూర్తిచెయ్యబోయేలోగా నేను అందుకుని

"కాని నాకు అబ్బలేదు...నా కట్టే ఆసక్తి కూడా లేదు' అన్నాను.

ఇలా చాలా తతంగం జరిగింది. మొత్తానికి సంబంధం బోలా కొట్టేసింది. ఇంకా నేను విజృంభించబోయేదాన్నే కాని పదిమంది నన్ను మరో గదిలోకి బరబరమని ఈడ్చుకుపోయేరు. చాలా రోజులు ఒంటరిగా గడిపేను. ఇంట్లో ఎవ్వరూ నాతో మాట్లాడలేదు. నా ప్రవర్తన వల్ల కుటుంబ గౌరవం మంటగలిసిపోయిందని వంశ ప్రతిష్ట నాశనం అయిపోయిందని గగ్గోలు పెట్టేరు. భవిష్యత్తులో నాకుగాని, మరే ఆడపిల్లకిగాని సంబంధాలు కుదరడం అసాధ్యం అని మొత్తుకున్నారు. తరతరాల నుండి మా వాళ్ళు గాజు భరిణెలా కాపాడుకొస్తున్న పేరు ప్రఖ్యాతుల్ని చిద్రుపలు చిద్రుపలు చేసి బయటకొచ్చేను..." అంటూ ఆగింది.

దూరంగా తాలూకా ఆఫీసులో గంటలు వినిపిస్తున్నాయి.

రామూ ఏం జరుగుతోందో తెసుకునేలోగా డైసీ గభాలున లేచి, టైము చూసుకుని చకచకమని నడుచుకుంటూ వెళ్ళిపోయింది.

"అప్పుడే తొమ్మిదయి పోయింది. ఇంత ఆలస్యం అవుతుందనుకోలేదు" అంటూ చీకట్లో వెళ్తూ ఆమె అన్న మాటలు మాత్రం వినిపించేయి. చెప్పా పెట్టాకుండా అకస్మాత్తుగా అలా వెళ్ళిపోవడంతో రామూకి కోపం వచ్చింది. "ఈవిడని ఎలా అర్థంచేసుకోవాలో నాకు సాధ్యంకావడంలేదు" అనుకుని కాళ్ళీడ్చుకుంటూ ఇసుక మేటని దాటి పిట్టగోడ ఎక్కి తన షెడ్డువేపు చూశేడు.

తలుపు దగ్గర మేనత్త నిలబడి ఆశ్చర్యపోతూ చూసింది!

"తలుపు తీసేవుంది కదా గోడలు గెంతడం దేనికి?" అని అడిగింది. "ఈ ముసలమ్మకి మరేంపనిలేదు; పెరటి తలుపులు బార్లా తెరుచుకుని నిలబడింది" అనుకున్నాడు. మేనత్త వాళ్ళిద్దరూ కుదుర్చుకున్న ఒప్పందాన్ని ఉల్లంఘించి అతని షెడ్డుని దాటుకుని పెరటిలోకి వచ్చింది. తన షెడ్డువేపు పనిలేకుండా ఆవిడ




రాకూడదు. ఆ ప్రదేశానికంతటికీ అతను ఏకచ్ఛత్రాధిపతి. అప్పుడప్పుడు బొగ్గుల కోసం, కర్రపేళ్ళ కోసం అతని షెడ్డు వేపు మేనత్త రావడం కద్దు. అలా వచ్చినప్పుడు సైతం అతని అనుమతి తీసుకొని రావాలేతప్ప హఠాత్తుగా రాకూడదు. ఒక్క నదిలో స్నానానికి వెళ్ళినప్పుడు మాత్రం ఆమె యథేచ్ఛగా వెళ్ళొచ్చు.

"కాని ఇప్పుడు ఏ పనిమీద వచ్చినట్లు? తన మీద నిఘా వెయ్యడానికి తప్ప ఏ కారణం లేకుండా పెరట్లోకి వచ్చి తీరుబాటుగా తలుపులు తెరుచుకొని నిలబడవలసినంత అవసరం ఏం వచ్చింది? మెట్లమీద ఇద్దరినీ చూసే వుంటుంది. చూస్తే చూడనీ మరేం ఫర్వా లేదు" అనుకుని "తలుపులెందుకు తెరిచేవ్?" అని అడిగేడు చిరాగ్గా.

"వీధి తలుపులు అలా తెరిచే వున్నాయి. పెరట్లోకొచ్చి చూస్తే నువ్వు లేవు. ఇంట్లో ఎవడన్నా జొరబడ్డాడేమోనని భయంవేసింది. పెరట్లో ఏదో అలికిడైతే తలుపులు తీసి చూసేను"




బాగా పొద్దుపోయిన తర్వాత థర్డ్ క్లాసులో ఏడో నెంబరు ఇంటి తలుపు తట్టేడు రామూ. ఈ సారి ఎటువంటి జంకు లేదు. చాలా ధీమాగా నిలబడ్డాడు.

డైసీ తలుపులు తెరిచి లోనికి రమ్మంది. ఆమె చాలా అలసటగా కనిపిస్తోంది.

'పని ఒత్తిడి ఎక్కువగా ఉందేమో; బాగా అలసిపోయింది. పాపం' అనుకున్నాడు.

వీధిలో చల్లటి గాలి వీస్తోంది.

నాలుగైదు గాలి కెరటాలు ఇంట్లోకి ఒకేసారి చూసుకొచ్చి ఆమె జుట్టును చిందర వందర చేసేయి.

ఆమె నొసట మీద ముసురుకున్న ముంగురులు సవరించాలని ముచ్చటపడి మూడడుగులు ముందుకు వేసేడు. రామూ.

"అదిగో చిక్కుల్లో పడవద్దు."

"ఒకప్పుడు అలా మసలుకున్న వాణ్ణే. తెలివితేటలు, తర్కవితర్కాలు నాకూ తెలుసు! మొండికెత్తిన వాళ్ళ బుర్ర నసాళానికి అంటుకుపోయేలా మాట్లాడ్డం కూడా నాకు చేతనౌను"

"ఆహా అలాగని నాకు తెలీదు.. ఏదీ నీ తెలివి తేటలు, తర్కవితర్కాలు కాస్త పనికి వచ్చే వాటిలో చూపించ రాదూ! చాలా సంతోషిస్తాను. బుర్ర తిరుగుడు సమాధానాలు, దూకుడు తప్ప నీలో మరేం చూడలేదు"

"......"

"హె..హె.. దూరంగా వుండు ఏవిఁటిలా..."

"ఏం ముట్టుకుంటే తప్పా? నది ఒడ్డున మెట్ల మీద నాతో చేతులు కలుపలేదా!"

"అప్పుడు బాగా చీకటిగా వుంది."

"ఇప్పుడు మాత్రం ఎందుకు కాకూడదు?" అంటూ స్విచ్ ఆఫ్ చెయ్యబోయేడు రామూ.

అడ్డుపడింది డైసీ.

ఆమెను తప్పించుకుని ఒడుపుగా లైటు ఆర్పేశాడు.

.........

కాస్సేపటిదాకా తిరిగి లైటు వెలగ లేదు.

వెలిగిన తరువాత డైసీ మెల్లగా అంది

"నువ్వింకా కొంచెంసేపు ఇక్కడ ఉండాలనుకుంటే రోడ్డు మీద సైకిలు తెచ్చి ఇంట్లో పెట్టు. అంతేగాని ఇంత రాత్రి వేళ సైకిలు అక్కడ వుండడం దానికీ, నాకూ కూడా మంచిది కాదు."

"చిత్తం. దేవిగారి ఆజ్ఞ"

"ఛీ. సిగ్గులేని మనిషి"

"ఏయ్"

* * *

రాముా దినచర్యలో మార్పువచ్చింది.

పగటి పూట షెడ్డులో బోర్డులు గీయడం లేదా వ్యాపారం పని మీద ఊళ్ళో తిరిగి రావడం, పొద్దు వాటారగానే మల్లె పువ్వులా తయారై టింగురంగామని సైకిల్ మీద వెళ్ళిపోవడం - ఇదీ అతని దినచర్య.

మేనల్లుడి ప్రవర్తన చూసి అత్త విస్తుపోతోంది.

సాయంత్రం కాగానే ఇస్త్రీ బట్టలు, అద్దం ముందు షోకులూ, ఈల పాటలు, సైకిలు మీద వెళ్ళిపోవడాలు ఆవిడ బాగా గమనిస్తోంది.

చెట్టియార్ దుకాణంపక్క శక్తి లాండ్రి వాడు అన్న మాటలు ఆవిడకి గుర్తు కొచ్చేయి.

"మా బేరం బాగా వుందమ్మా! మీ మేనల్లుడికి బట్టల మీద శ్రద్ధ బాగా పెరిగింది. రోజూ ఇస్త్రీ చెయ్యాలంటాడు-ఒక్క మడత ఉన్నా ఒప్పుకోడు."

చెట్టియార్ దుకాణం దగ్గర కూడా ఏవో మాటలు వింది.

మందిరం దగ్గర కూడా ఆ మాటలు వినవలసి వస్తుందేమోనని ఆవిడ భయం. అందుకే అక్కడ ఎవ్వరితో మాట్లాడ్డం మానుకుంది. ఆ మాటల్లో మేనల్లుడి తిరుగుళ్ళ గురించి ప్రస్తావన రావచ్చు.

అందరితో కలివిడిగా వుండే ఆవిడ ఒక్కసారిగా బిగుసుకుపోవడం అందరికీ ఆశ్చర్యం కలిగించింది.

ఆరోజు మధ్యాహ్నం రాముూకి అన్నం వడ్డిస్తూ అడుగుదామని ఊగిసలాడుతోంది. అడిగితే అలిగి లేచి వెళ్ళిపోతాడేమోనని జంకి, అన్నం తినడం పూర్తయ్యేవరకూ నిగ్గబట్టుకుని అతను మజ్జిగ తాగుతుండగా అడిగింది.

"రోజూ సాయంత్రం నువ్వెక్కడికి వెళ్తున్నావ్?" అంతకన్నా చాకచక్యంగా అడగడం ఆవిడకి చేతకాలేదు.

రాముూ మాట్లాడలేదు.

మజ్జిగ తాగి, కంచం ముందునుంచి లేచి పెరట్లోకి వెళ్ళాడు. చేతులు కడుక్కొని మధ్య గదిలోకి వచ్చాడు. వంటింట్లోకి వెళ్ళి మేనత్తకి బదులు చెప్పాలో, తన గదిలోకి పోయి కాస్సేపు కునుకుతీయాలో నిశ్చయించుకోలేక అలా నిలబడ్డాడు.

ఈమధ్య భోజనం చేసాక కాస మత్తుగా వుంటోంది. అలా పోయి గదిలో చాపమీద నడుం వాలిస్తే సాయంత్రానికి ఫ్రెష్‌గా వుంటోంది. అప్పటినుండి రాత్రి చాలా సేపటివరకు డైసీ ఇంట్లో నే వుంటాడు తను. ఆ సమయంలో ఆకలి గుర్తుకు రాదు-నిద్ర రమ్మన్నా రాదు.

డైసీ పరిస్థితి కూడా దాదాపు ఇలాగే వుంటోంది.

పగటివూట హుషారు తగ్గి ఆఫీసులో కునికిపాట్లు పడుతోంది. ఈ కొత్త అలవాటును చూసి అక్కడికి వచ్చేవాళ్ళు నివ్వెరపోతున్నారు. అందుకే ఓ రోజు నిశ్చయానికొచ్చి, "ఈరోజునుండి నువ్వు తొందరగా ఇంటికి పోవాలి రాముూ; రాత్రి తొమ్మిది దాటితే ఇక్కడ ఉండకూడదు" అంది.

అలా చెప్పిందేగాని ఆరోజు రాత్రి తాలూకా ఆఫీసులో పదకొండు గంటలు కొట్టేవరకూ అతనితో మాట్లాడుతూనే వుంది.

గంటలు వినగానే వాచీ చూసుకుని అతనికి వీధి ద్వారం చూపించింది. రాముూ మారుమాట్లాడకుండా సైకిల్‌ని బయటకు తీసి ఇంటికి బయల్దేరాడు.

దారిలో గంటల వాడిని తిట్టుకుంటూ 'ఇవాళ రాత్రి ఆ గంటని తీసుకెళ్ళి నూతిలో పడేయాలి' అనుకున్నాడు.

డైసీ పెట్టుకున్న నియమం పని చెయ్యనే లేదు.

ఒక్కొక్కరోజు తాలూకాఫీసు గంటలు కూడా ఇద్దరూ మరిచిపోయేవారు.

మరి కొన్నాళ్ళకి అతను ఏకంగా రాత్రుళ్ళు అక్కడే పడుకుని తెల్లవారకమునుపు లేచి వీధుల్లో జనసంచారం మొదలు కాకుండానే ఇంటికి చేరుకోవడం మొదలైంది.

అంతవరకూ సహనం వహించి, నోరు మూసుకున్న మేనత్త ఇక ఉండబట్టలేక





పోయింది. ఆమె అడగడంతో రాములో కోపం కస్సుమని లేచింది.

తనేం అడ్డాల్లో బిడ్డవా ఆమెకు చెప్పనిదే ఏపనీ చెయ్యకుండా వుండ డానికి ?

తనికి ముప్ఫై ఏళ్లొచ్చాయి. ఏది మంచి ఏది చెడ్డ తనకి తెలుసు. తను డైసీని ప్రేమిస్తున్నాడు. రేపోమాపో పెళ్ళి కూడా చేసుకోబోతున్నాడు. దానికి ఊరివాళ్ళ అనుమతి తీసుకోవాలా? వాళ్ళంతా ఎవరు తనను కాదనడానికి ? ఇది తన జీవితం; తన ఇష్టం.

లోకంలో ఎంతమంది ఆడా మగా కలిసి బతకటంలేదు? వాళ్ళందరూ పని కట్టుకుని వచ్చి, వీళ్ళని ప్రాధేయపడి సమ్మతం అయిన తరువాతే ఆ పని చేస్తున్నారా ?

"నీకో విషయం చెబుదామనుకుం టున్నాను. అక్కడా ఇక్కడా చెప్పు కోగా నీకిపాటికి తెలిసేవుంటుంది. నేనో అమ్మాయిని పెళ్ళి చేసుకోబోతున్నాను"

"........."

"ఇదివరకే ఆ అమ్మాయిని మన ఇంట్లో చూసేవు కూడా"

మేనత్త చేతిలో సత్తుగిన్నె పట్టుతప్పి కింద పడింది.

"ఆ అమ్మాయేనా ! ఏ కులం ?" నీరసంగా అడిగింది.

"అవన్నీ అనవసరం. ఆమె నా భార్య కాబోతోంది. అంతవరకే తెలుసు కోడం మంచిది"

"కిరస్తానీ అమ్మాయి కదూ ? పేరు..."

"డైసీ. అంటే ఓ పువ్వుపేరు" పువ్వు పేరనే తెలుసుగాని అది ఎలాంటి పువ్వో, అతనికి తెలియదు. అమెరికాలో, ఇంగ్లండులో కనిపించే పువ్వని మాత్రం తెలుసు.

"కిరస్తానీ అమ్మాయిని చేసుకుంటు న్నావా ? నువ్వు..."

"మతాలు వేరైనా మనుషులొక్కటే" అని విడమరిచి చెప్పడానికి అతనికి ఓపిక లేదు. "ఆమెను డైసీగానే తెలుసు కున్నాను తప్ప ఏ మతస్థురాలో నేను కనుక్కోలేదు. అది నాకవసరం లేదు మరి. నువ్వు కూడా నాలాగే పట్టించుకో పద్దని కోరుకుంటున్నాను. ఆవిడ మన లాంటి మనిషి. అంతవరకూ చాలు. ఆవిడ నాకు నచ్చింది. నాలుగు రోజులు కలిసివుంటే నీక్కూడా ఆ అమ్మాయి నచ్చుతుంది. దయచేసి మమ్మల్ని ఆశీర్వ దించు..."

అతని మాటలకి మేనత్త చలించలేదు. ఓ క్షణం నిట్టూర్చి వెంటనే తన పనిలో పడిపోయింది.

ఆమె నుండి జవాబు కోసం ఎదురు చూసిన రాముకి ఆశాభంగం అయింది. జరగరాని అవమానమేదో జరిగి తల తీసేసినట్లు అనిపించింది. ఇష్టమో, అయి ష్టమో ఆమె నుండి జవాబు రాబట్టాలన్న అతని ప్రయత్నం మొదట్లోనే నీరుకారి పోయింది. "సమ్మతం అయితే చెప్పాలి లేదా తగువుకి రావాలి. అంతేగాని ఆ మౌనం దేనికి ?" కోపంతో స్రరుమని వెనక్కితిరిగి గదిలోకి వచ్చాడు.

గదిలో చాపమీద పడుకుని ఓ లావు పాటి పుస్తకం అందుకున్నాడు. పేజీలు తిరగేస్తున్నాడే తప్ప అక్షరాల మీద మనసు లగ్నం కావటం లేదు.

ఇన్నాళ్ళూ తను ఏ పని చేసినా, ఎలాంటి నిర్ణయం తీసుకున్నా దానిని

మేనత్త ఆమోదిస్తుందన్న నమ్మకంతోనే చేసేవాడు. ఆవిడకి సచ్చచెప్పడంగాని, సంజాయిషీ ఇచ్చుకోడంగాని ఇంతవరకు జరగలేదు. ఆమెకూడా తనకు ప్రాము ఖ్యత లభించాలనిగాని, తన పెద్దరికాన్ని అతను గుర్తించాలనిగాని ఎప్పుడూ అను కోలేదు. మేనల్లుడు సంపాదిస్తే తను వండి పెట్టడం. అంతకు మించి ఆమె ఏనాడూ "ఎందుకు ? దేనికి ?" అని అడిగి ఎరుగదు.

కాని ఇలా జరగడం ఇదే మొదటి సారి !

రాము ఆలోచిస్తూ పుస్తకం గుండెల మీద పెట్టుకుని అలాగే నిద్రపోయేడు.

సాయంత్రం నాలుగు గంటలకు లేచేడు. గబగబా ముఖం కడుక్కుని వంటింట్లోకొచ్చేడు. అత్తయ్య లేదు. మట్టికుంపటిలో కొద్ది నిప్పుల మీద కాఫీ గిన్నె వుంది. కాఫీని చిన్న గ్లాసులోనికి ఒంపుకొన్నాడు. ఇంట్లో ఎక్కడా అత్తయ్య అలికిడి లేదు. బహుశ మంది రానికి వెళ్ళిపోయుంటుంది. ఈ రోజు తొందరగా వెళ్ళిపోయిందే ? వెళితే వెళ్ళనీ అక్కడే మనశ్శాంతి లభిస్తుంది. అయినా ఆవిడ మనసు గాయపరచేటంత పని తను ఏం చేసేడని ? ఈ ఒంటరి జీవితానికి స్వస్తి చెప్పాలనుకుంటున్నాడు. డైసీ ఈ ఇంట్లోకి అడుగు పెట్టబోతోంది. అది మేనత్తకి ఇష్టం లేకపోతే తనేం చెయ్య లేడు.

ఎప్పుడూ వీధిలోకి వెళ్ళేముందు ఫలానా చోటుకి వెళ్తున్నానని చెప్పడం ఆవిడ అలవాటు. అంతేకాదు. "ఇల్లు జాగ్రత్త, తలుపులు వేసుకో"అని ఒక టికి రెండుసార్లు హెచ్చరిస్తేగాని ఆవిడకి మనసు ఒప్పదు. కాని ఈ రోజు ఏమీ మాట్లాడకుండానే వెళ్ళిపోయింది. తన మీద కోపం వచ్చివుంటుంది. ఇకముందు కూడా తనతో మాట్లాడకూడదని తీర్మా నించుకుని వుంటుంది. అలా జీవితాంతం వుండిపోగలదా ? ఆవిడకే తనమీద ఇష్టం లేకపోతే కాఫీ తయారుచేసి, వెచ్చగా ఉండడంకోసం పొయ్యిమీద కూడా పెట్టి ఎందుకు వెళ్ళింది ?

అలా ఆలోచిస్తూ కాఫీతాగి బోర్డుల పని పూర్తి చేసేసరికి టైము ఆరున్నర అయింది.

ఆరోజుకి పని ముగించేడు. డైసీ తన కోసం ఎదురు చూస్తూ వుంటుంది; త్వరగా వెళ్ళాలి. బట్టల కోసం వీధి చివర లాండ్రీకి బయల్దేరేడు. దారిలో మేనత్త కనిపించింది.

"మందిరానికి వెళ్ళలేదా?"

"లేదు. నువ్వుబయటికి వెళ్తున్నావా?"

"అవును.త్వరగా లాండ్రీకి వెళ్ళి బట్టలు తెచ్చుకోవాలి. ఇంకా ఆలశ్యం అయితే వాడు దుకాణం మూసి వెళ్ళిపోతాడు" అని చెప్పి తాళం చెవి ఆవిడకి ఇచ్చివెళ్ళి పోయేడు.

పావుగంట తరువాత ఇంటికి వచ్చేడు. న్యూస్‌పేపర్లో మడత పెట్టిన సిల్కు చొక్కాని తన గదిలో పెట్టి బయట కొచ్చేడు. మధ్యగదిలో ఓమూల మేనత్త కూర్చొని వుంది.

"రామూ! ఓ సారిలా వచ్చి కూర్చో గలవా నీతో కొంచెం మాట్లాడాలి?" అని అడిగింది.

ఆవిడ అడిగిన తీరు ఎంతో జాలిగా అనిపించి వెంటనే ఎదురుగా చాప మీద కూర్చున్నాడు.

అలా కూర్చున్నప్పుడు అతని జీవితం ఒకేసారి పాతికేళ్ళ వెనక్కి తిరిగినట్టని




పించింది. అయిదేళ్ళనాడు తనకి అ, ఆలు దిద్దించి, శ్లోకాలు వల్లె వేయించడానికి అత్తయ్య అలా చాపమీద కూర్చోబెట్టేది. ఇన్నేళ్ళ తరువాత మళ్ళీ అలా కూర్చున్నాడతను. కాని టైముమించిపోతోందన్న ఆత్రుత లోలోపల ఎక్కువౌతోంది. డైసీ తన కోసం చాలా సేపటి నుంచి ఎదురు చూస్తూ వుంటుంది. ఆ మాట బయటకు చెప్పడానికి జంకుతున్నాడు. "చూస్తే చూడనీ-మరేం పర్వాలేదు" అని మేనత్త అంటుందేమోనని అనుమానం.

"నేను కాశీ వెళ్దామనుకుంటున్నానురా! కొంచెం సాయం చేసిపెట్టు"అంది మేనత్త తాపీగా.

"ఎప్పుడు?"

"ఓ వారం రోజుల్లో. ఇక్కడ నుండి కొంతమంది బయల్దేరుతున్నారు. వాళ్ళతో కలిసి వెళ్దామని..."

"ఎవరెవరు వెళ్తున్నారేంటి?" ఆమె వెళ్ళిపోతోందన్న దిగులు అతనిలో ఆవరించింది.

"మన ఇంటికి ఎడంగా మూడోఇంట్లో వున్న ఆండాళమ్మ వెళ్తోంది. మొన్ననే చెప్పింది. ఇప్పుడు వాళ్ళింటికే వెళ్ళి వస్తున్నాను''

"ఆవిడ ఏమంది?"

"అలాగే బయల్దేరమంది"

"ఎన్నాళ్ళు?''

"మొత్తం మూడు నెలల యాత్ర. మొదట బదరీ, హరిద్వారం వెళ్తున్నారు''

"అంటే హిమాలయాలకా!"

"అవును. అప్పుడే ఏర్పాట్లు పూర్తయ్యాయి. మనిషికి ఏడొందల ఏభై అవుతుందట.

"......"

"బదరీలో భగవంతుడిని దర్శించుకుని, వీలైతే అమరనాథ్ కూడా వెళ్ళి మంచురూపంలో వున్న శివలింగాన్ని అర్చించి, గంగమ్మ తల్లి జన్మించిన చోట స్నానం చెయ్యాలని వుంది. అలా దారి పొడుగునా స్నానాలు చేస్తూ కాశీలో విశ్వేశ్వరుణ్ణి చేరుకుని యాత్ర ముగిస్తాను. అంతే! ఆతర్వాత నేను జీవించక పోయినా ఫర్వాలేదు."

రాము ఆలోచనలో పడ్డాడు. అంత డబ్బు ఎలా సమకూర్చడం? ఏడొందల ఏభై రూపాయలంటే తనబోటివాడికి సర్వసామాన్యమైనదా? బేంకులో బేలన్సు ఉందంటే తన పెళ్ళి ఖర్చులకి కూడా సరిపోదు. వసూలు కావలసిన వాటిలో చాలామట్టుకు రాని బాకీలే! డైసీ నుండి రావలసిన మొత్తం కూడా ప్రస్తుతానికి లేనట్టే. పల్లెటూళ్లలో గోడలమీద ప్రచారాలు రాసిన తరువాత గాని పెద్ద మొత్తంలో సొమ్ము రాదు. అది సెప్టెంబరులో గాని జరిగేపని కాదు. అప్పటికి తన పెళ్ళి కూడా అయిపోతుంది.

"పోస్టాఫీసులో నా పేర నాలుగొందల ఏభై వున్నాయిగా. నువ్వు మిగతా సొమ్ము సర్దిపెడితే చాలు" అంది మేనత్త

"అవుననుకో - అది నీ తిరుగు ప్రయాణానికి కూడా సరిపోతుందా?"

"సరిపోవచ్చునేమో; నేను అడగలేదు. ఓ వేళ నేను తిరిగి రానంటే ఆ మేరకు తగ్గిస్తారు కూడా!"

"తిరుగు ప్రయాణం ఎప్పుడు?"

"అది... నేను ఆలోచించలేదు"

"అంటే ?''

"చూడు నాయినా-నాకు వయసుడిగి పోయింది. నా బోటివాళ్ళు కాశీ వెళ్ళేక అక్కడతో బతుకు పరిసమాప్తం కావాలని

కోరుకుంటారే తప్ప ఈ బంధాల్లోకి రావాలని ఆశించరు. అక్కడికి వెళ్ళేక నేను పదిరోజులే బతకవచ్చు లేదా పదేళ్ళు జీవించవచ్చు. అది నాకు ముఖ్యం కాదు. కాశీలో ప్రాణాలు విడిచి గంగమ్మతల్లిలో నా బూడిద కరిగిపోతే చాలు" మేనత్త నిట్టూర్చింది.

రామూ మనసు చివుక్కుమంది. తన నిర్ణయానికి ఎదురు చెప్పలేక అత్త కాశీ వంకతో ఇల్లు వదిలి పోతోందని గ్రహించేడు. చిన్ననాటి నుండి కంటికి రెప్పలా కాచుకున్న మేనత్త అతనికి దూరమై పోతోందన్న భావన మనసుకు ముల్లులా గుచ్చుకుంది.

"వద్దత్తయ్యా-నువ్వెక్కడికీ వెళ్ళొద్దు నాతో వుండి పో" అన్నాడు.

"అదికాదు నాయనా! ఈ అవకాశం కోసమే ఇన్నాళ్ళు నిరీక్షించేను. ఈ ఒక్కటీ చేజారిపోతే..."

"మరేం ఫర్వాలేదు. నేను మరో సారి పంపిస్తాను. నువ్వెక్కడికీ వెళ్ళడానికి వీల్లేదు" రామూ ఆజ్ఞాపించేడు.

ఆమె కళ్ళల్లో నీళ్ళు నిలిచేయి. దృష్టికి అడ్డం వస్తున్న కన్నీటిని తుడుచుకుంది.

అత్తయ్య కంటతడిని చూడడం అతనికి ఇదే మొదటిసారి. కదిలిపోయేడు. తనకు జ్ఞానం వచ్చిన దగ్గర నుండి ఆమె తనతో తప్ప వేరొక చోట ఏ ఒక్కనాడైనా వుండడం అతను ఎరగడు. బతిమాలేడు. కాని ఆమె మారు పలకలేదు.

"నేను డైసీని పెళ్ళి చేసుకోడం ఇష్టం లేక నువ్వు వెళ్ళిపోతున్నావు కదూ? అలా అయితే ఇప్పట్లో నేను పెళ్ళి చేసుకోను."

"ఇది మంచి అవకాశం బాబూ! అంత దూరం ఒంటరిగా వెళ్ళగలిగే శక్తి సామర్థ్యాలు నాకు లేవు. ఆండాళమ్మ మనకు తెలిసిన వ్యక్తి. మనం అంటే గౌరవం ఉన్నావిడ. ఆవిడతో వెళ్ళిపోతే ఏ ఇబ్బందులు ఉండవు"

"నువ్వుండిపోతే నేను ... డైసీతో పెళ్ళి రద్దు చేసుకుంటాను" అని చెప్పలేడు. ఓ వేపు ప్రాణప్రదంగా ప్రేమించిన డైసీ-మరో వేపు గుండెల్లో దాచుకుని పెంచిన మేనత్త. ఒకరితో ఉండాలంటే మరొకరిని త్యాగం చెయ్యాలి. ఏదీ నిశ్చయించుకోలేక చిన్న పిల్లాడిలా ఏడ్చాడు.

"లేదు నువ్వు వెళ్ళడానికి వీల్లేదు. నిన్ను వదులుకోలేను" అన్నాడు.

రామూ కన్నీళ్ళు చూసి ఆమె మరింతగా దుఃఖించింది. అతని కన్నీటిని తుడిచి-

"నీ బతుకు నువ్వు బతకాలిరా! ఎన్నాళ్ళిలా వుంటావు? పెళ్ళి చేసుకోవాలని కోరిక పుట్టినందుకు చాలా సంతోషం. నాకు ఆ విషయం కొంచెం ముందుగా తెలిసివుంటే ఎంత బాగుండేది. పది పన్నెండు సంబంధాలు వచ్చేయి. జాతకాలు కూడా ఇచ్చి వెళ్ళేరు."

"నీకు అర్థం కాదు అత్తయ్యా. ఎవరో ఒకరిని ముడివేసుకోవాలన్న కోరికతో ఈ పెళ్ళి చేసుకోవడం లేదు. డైసీని ప్రేమించేను. ఆవిడే నా జీవిత భాగస్వామి కావాలని కోరుకుంటున్నాను. దయచేసి మమ్మల్ని ఆశీర్వదించు. నా పెళ్ళి తర్వాత కావలిస్తే నిన్ను కాశీ పంపిస్తాను. నీ ఇష్టం వచ్చినన్నాళ్ళు అక్కడ వుండి నామీద ఏమూలైనా కాస్త అభిమానం మిగిలి నన్ను చూడాలని నీకు అనిపించినప్పుడు నువ్వు తిరిగి రావొచ్చు"

"........."




"ఆమెతో కలిసి ఈ ఇంట్లో వుండడం నీకు ఇష్టం లేకపోతే ఆవిడ వేరే చోట వుంటుంది.

"నువ్వు ఆవిడతోనే వుంటావు... అంతేనా?" ఆవిడ సక్రమంగానే అడిగింది. నిజమే. అతను రెండు ముక్కలై పోతే తప్ప అక్కడ ఇక్కడ ఒకేసారి ఉండగలగడం అసాధ్యం. పెళ్ళయిన తరువాత ఒక్క క్షణం కూడా డైసీని విడిచి వుండలేనని అతనికి తెలుసు. కొద్దిగంటల ఆలశ్యానికే ఇవాళ కొట్టుకు పోతోంది అతని మనసు. అక్కడ డైసీ ఒంటరిగా తనకోసం ఎదురుచూస్తూ ఏమనుకుంటోందో !

"ఆ అమ్మాయి గురించి చాలా కథలు విన్నాను. ఆవిడ ఇల్లు వదిలి పారి పోయి వచ్చిందికదూ?" ఇన్ని రోజులుగా దాచుకున్న అనుమానాలు బయట పెడు తోంది మేనత్త.

రామూ ఉద్రేకాన్ని అదుపులో పెట్టు కున్నాడు.

"అదంతా అనవసరం. మంచి ఉద్దేశంతోనే ఆ పని చేసింది. ప్రజాసేవ చేయాలన్న ఆశయాలతో అయినవాళ్ళని సైతం వదిలిపెట్టి వచ్చింది. సేవా దృక్పథం ఆవిడ మతం. అంతకు మించి ఆవిడకి మరో దేవుడూ, వేరేమతం వున్నాయని నేననుకోను. ఏనాడూ నేను ప్రశ్నించలేదు కూడా. పేద బతుకుల సేద దీర్చడమే ఆమె పూజా పునస్కారాలు. డబ్బు కోసం, మేడ మిద్దెలకోసం ఆమె ఎన్నడూ ఆశించలేదు. అవసరం అయితే గుడిసెలో కూడా బతుకుతుంది గంజినీళ్ళు తాగి, మట్టినేలమీదే పడు కుంటుంది..."

"మరలాంటి మనిషితో నువ్వెలా కాపరం చెయ్యగలవు? ఆశయాలు ఆవిడకి వున్నాయి; ఒప్పుకుంటున్నాను. మరి నీకున్నాయా? నీకు ఆవిడని ప్రేమించడమే కావాలిగాని-ఆవిడ వేటికోసం ఇల్లు వదలి వచ్చిందో అవసరంలేదు. అవసరం అయితే నీకన్నా ఆవిడకి ప్రజాసేవే ఎక్కువనిపించవచ్చు. అప్పుడు నీ గతేం కావాలి?" మేనత్తలో ఇంత తర్కం వుందని రామూ అనుకోలేదు.

"నిక్షేపంలాంటి సంబంధాలు...వకీళ్ళు, జడ్జీలు, డాక్టర్లు పిలిచి పిల్లనిస్తామంటు న్నారు. నిన్ను నెత్తిమీద పెట్టుకొని నీక్కావలసినవన్నీ సమకూరుస్తారు"

అత్తయ్యకి ఎలా బోధపరచాలో అతనికి అర్థంకాలేదు. పరిమితమైన ఆవిడ అవగాహన పట్ల విచారించేడు. తను ఎంత బోధపరచినా ప్రయోజనంలేదు. అపోహలతో నిండిన ఆలోచనా సరళిలో మార్పు తీసుకురావడం అసాధ్యం.

"నువ్వెంతైనా చెప్పు ఆవిడ మంచి అమ్మాయి" అని మాత్రం అనగలిగేడు.

"ఆమె కులం ఏమిటి ? గతం ఎలాంటిది ? ఇల్లు వదిలి పారిపోయిన సంగతి తెలీదా?" రెట్టించి అడిగింది మేనత్త.

"అవును అయితే ఏమంటావ్? ఆ మాటకొస్తే నువ్వు మాత్రం ఇప్పుడు ఇల్లు వదిలిపోవటంలేదా?" అలా అడగ కుండా వుండలేకపోయేడు.

"ఆఖరికి నీ కంటికి ఆవిడ, నేను ఒకేలా కనిపిస్తున్నామన్నమాట; మా ఇద్దరికీ తేడాయే లేదన్నమాట?"

"అవును. ఇద్దరూ నాకు కావలసిన ఈ ఇంట్లోనే ఉండవలసిన వాళ్ళు"

"నీ బుర్రలో ఏ పిశాచమో తిష్టవేసు క్కూర్చొంది. నీ కళ్ళకి మాయపొరలు

కమ్మే సేయి" ఆవిడ గొంతు వణికింది.

"చూడ త్తయ్యా. భవబంధాలనుండి విము క్తికోసం నువ్వు ఇల్లు వదలిపోవటం లేదూ? అలాగే డైసీ కూడా మూఢ భావాల సంకెళ్ళ నుండి విముక్తి కోసం పారిపోయి వచ్చింది....ఇప్పుడదంతా దేనికి గానీ ఆవిడ తన కథ పూర్తిగా నాకు చెప్పింది. గత్యంతరంలేక ఈ పని చెయ్యవలసి వచ్చింది-అంతే. అంతకు మించి మరోలా ఆలోచించవద్దు"

వీధిలో పీచు మిఠాయివాడి గంట వినిపించింది. అంటే టైము ఏడు దాటు



తోంది. పెరట్లో చెట్లమీద పక్షుల అలికిడి ఎక్కువైంది. సమయం మించిపోయి చాలా సేపయింది.

లేచి ముఖం కడుక్కుని, బట్టలు వేసుకుని, శుభ్రంగా తయారై సైకిల్ తీసుకొని గడప దిగేడు.

"భోజనానికి వస్తావా?" అని అడిగింది మేనత్త.

"అలాగే" సైకిలు ఎక్కబోతూ ఆగేడు– "మార్కెట్ గేటు దగ్గర షాపు వాడికి బోర్డు రాసిపెట్టాలట; కనుక్కుందామని వెళ్తున్నాను. త్వరగా వచ్చేస్తానులే" అని సైకిలు ఎక్కేడు.

ఆ మాటలు మేనత్తలో ఎంతమాత్రం నమ్మకం కలిగించలేదు.

"నేనలా మందిరం వేపు వెళ్తున్నాను. త్వరగా వస్తే మట్టుకు నన్ను పిలుపు" అని చెప్పి ఇంట్లోకి వెళ్ళింది.




అలా వెళ్ళిన రాముా మర్నాడు మధ్యాహ్నం భోజనం వేళకి తిరిగొచ్చేడు.

రాత్రి చాలాసేపు డైసీతో మేనత్త గురించే చర్చించేడు. డైసీ అనేదంతా ఒక్కటే "ఆవిడని వెళ్ళనీ - వెళ్ళాలని ఆవిడకి అంత కోరికగా వున్నప్పుడు నువ్వెందుకు అడ్డు చెప్పడం? అది మూఢ నమ్మకమే కావచ్చు. కానీ ఆవిడని వెళ్ళనీ"

"వెళ్ళనిస్తాను కాని తిరిగి ఇంటికి రాదట..." కంట తడిపెట్టేడు రాముా. గంగానది పొంగిపోయినట్టు - ఆ వరదల్లో తన మేనత్త కొట్టుకు పోతున్నట్లు అనిపించింది.

ఛ...ఛ ఏమిటిది రాముా బొత్తిగా చిన్న పిల్లాడిలా? అత్తయ్య తిరిగి రానన డంలో తప్పేముంది ? నేనే ఒక మూఢ భక్తురాలినైతే జీవితపు చివరి అంచుల్ని అలాంటి చోట గడపాలన్ని, ఆ రకమైన చావునే అనుభవించాలని కోరుకునేదాన్ని. ఆ వాతావరణంలో ఆవిడకి మనశ్శాంతి లభించవచ్చు, - మరిన్ని రోజులు అద నంగా బతకవచ్చుకూడా! నువ్వు అనవసరంగా దిగులు చెందకు. అత్తయ్యని పంపించు."

డైసీ మాటలు అతనికి కొంత ఉపశమనం కలిగించినా ఓ మూల సందేహం తల ఎత్తింది. తన దారి నుండి మేనత్తను తొలగించుకోవడం కోసం డైసీ ఇలా సలహా ఇవ్వటంలేదుకదా?కాని ఆ అనుమానాన్ని మొగ్గలోనే త్రుంచివేసేడు. పుట్టుకల గురించి సలహాలు ఇచ్చే ఈ ఆవిడ చావుల గురించి కూడా సలహా ఇస్తోంది. అంతకన్నా మరేం కాదు.

రాముా భోజనం ముగించి తన గది లోనికి వెళ్ళిపోయేడు. గదిలో చాప వేసుకుని ఓ పుస్తకం తీసేడు.

రాత్రి డైసీతో మాట్లాడుతూ తను పురాణాల్లో చదివిన అయిదు రకాల వివాహ పద్ధతుల గురించి చెప్పి అందులో గాంధర్వ పద్ధతి తనకెంతో నచ్చిందన్నాడు.

రెండు మనసులు ఒకటిగా కలిసిన పవిత్ర తరుణంలో మంత్రతంత్రాలతో పని లేదని,- వివాహం జరిగినట్టే దాని లెక్కని వివరంగా చెప్పేడు.

పురాణ కథల మీద తనకు నమ్మకం లేకపోయినా గాంధర్వ పద్ధతి ఆచరణ యోగ్యమైనదని డైసీ కూడా అంది. అయితే అది ఎప్పుడు ఎలా జరగాలో ఇంకా నిశ్చయం కాలేదు.

"మన ఇద్దరం ఓ ఇంటికప్పు కింద చేరుకున్నాక ఒకరినొకరు ప్రేమించడం మొదలు పెడదాం. ఆరోజే మన పెళ్ళయినట్టు లెక్క" అంటూ డైసీ నవ్వింది.

"ఆ రోజు నుండి శ్రీమతి రాముా అని పిలుచుకోవచ్చు."

"నో-నో. పేరు మార్చుకోవలసిన అవసరం ఎంత మాత్రములేదు. నేను డైసీనే... నువ్వు రాముావే."




ఆమె అలా అనడంతో రామూకి తల బొప్పి కట్టినట్లయింది. ఇంకా వాదించి పోట్లాడదలచుకోలేదు. ఆమె నిర్ణయానికి తలఒగ్గేడు. అన్ని విషయాల్లోనూ ఆమెదే పైచేయి. అతను నిమిత్త మాత్రుడు.

అతనితో కాపురం చెయ్యడానికి రెండు షరతులు విధించింది డైసీ.

ఒకటి: తమకు పిల్లలు పుట్టకూడదు.

రెండు : తప్పిదారి ఒకవేళ పుట్టినా వాళ్ళు మరోచోట పెంచబడాలే తప్ప- తన కార్యకలాపాలకు ఆటంకం కలిగేలా వాళ్ళ సంరక్షణాభారం తన మీద పడ కూడదు.

నోరు మూసుకుని అతను ఊఁ కొట్టేడు; తప్పలేదు మరి!

"సాధారణ స్త్రీ గడిపే జీవితాన్ని నేను మరిచిపోయి చాలా రోజులైంది.

ఒక రకమైన జీవితానికి అలవాటుపడి దానిని ఆనందంగా గడుపుతున్న ఆడ వాళ్ళు కోట్లకొద్దీ వున్నారు. కాని దానికి భిన్నమైన జీవితం గడపాలని నా వాంఛ. విభిన్నమైన ఆ జీవితాన్ని ఏరికోరి తదను గుణంగా నన్ను నేను మలుచుకున్నాను.

నాకు కొన్ని ఆశయాలున్నాయి. అవి నెరవేరడానికి ఇంతకన్నా మరో రకమైన జీవనమార్గం నాకు కనిపించలేదు.

ఇన్నాళ్ళూ అసలు పెళ్ళి తలపు నాలోలేదు. ఇప్పుడు నువ్వుకలిశాక దానికి ఒప్పుకొంటున్నాను.

అయితే పెళ్ళి తరువాత కూడా నాకు మునుపటిలాగే పూర్తి స్వేచ్ఛవుండాలి. నా కార్యకలాపాలు నేను నిరాటంకంగా చేసుకోడానికి నువ్వు ఎటువంటి అభ్యం తరం చెప్పకూడదు.

ఇప్పటి స్నేహభావనే అప్పుడూ వుండాలి. అందులో ఏమాత్రం మార్పు వుండకూడదు. మనం విధించుకున్న షరతుల్ని వుల్లంఘించి నీ భార్యనన్న అహంభావంతో నన్ను శాసించాలని నువ్వు ప్రయత్నిస్తే ఆ రోజుతో నీకూ నాకూ సరి... నువ్వు మళ్ళీ నాఛాయలకు రావడానికి వీల్లేదు..."

డైసీ అలా చెబుతున్నప్పుడు రామూ ఆమె కళ్ళల్లో ఎర్ర జీరలు గమనించేడు.

"నువ్వు విధించిన ప్రతి షరతుకీ శంతన మహారాజులా లోబడే వుంటాను" అన్నాడు.

"మాటాడితే చాలు పురాణాలు ఉదా హరిస్తావు. ఎవరా శంతన మహారాజు?" అని అడిగింది డైసీ.

మహా భారత కథలో శంతనుడు, గంగా దేవిల వివాహం గురించి, దానికి గంగ విధించిన షరతులు గురించి చెప్పేడు.

డైసీ మందాకినిలా నవ్వింది.

* * *

మేనత్త తీర్థయాత్రల కోసం రామూ చురుగ్గా ఏర్పాట్లు చేస్తున్నాడు.

తమ ఇంటికి ఎదంగా మూడో ఇంట్లో వుంటున్న ఆండాళమ్మని కలుసుకుని వివరాలు కనుక్కోవాలని బయల్దేరేడు.

"మీ అత్తయ్యకి ఏం ఫర్వాలేదు.నేను న్నాను. అన్నీ చూసుకునే పూచీ నాది... ఆవిడ నీతో విసుగెత్తిపోయింది. అయినా పాపం బయటకు చెప్పుకోలేక పోతోంది" అంది ఆండాళ్ళమ్మ.

"ఈ వయసులో ఆవిడని ఒంటరిగా విడిచి పెట్టడం నాకిష్టం లేదండీ" అన్నాడు రామూ.

"ఎందుకిష్టం లేదు?" ఆండాళమ్మ గద్దించింది.

రాముా తుళ్ళిపడ్డాడు.

"ఆవిడ తన జీవిత కాలంలో కోరు కుంటున్న ఈ ఒక్క-కోరికని తీర్చడానికి ఎందుకు అడ్డుపడతావు? ఆవిడని వెళ్ళనీ. ఇప్పటిదాకా నీ అవసరాలు చూడడం, ఇంటి చాకిరీ చెయ్యడంతోనే బతుకు గడిచి పోయింది. నీకు సమస్తమూ చేసిపెట్ట డానికి మరో పనిమనిషి వస్తోందికదా ఇహ అత్తయ్య అవసరమేనికి?"

అలాంటి మనిషితో మాట్లాడవలసి వచ్చినందుకు విసుక్కున్నాడు. తను ఒకటి అడగాలని వస్తే ఆవిడ మరొకటి అడుగుతోంది. సంభాషణ అనవసరమైన మలుపు తిరుగుతోంది.

డెసీ తనకు వంటచేసి పెట్టడానికి రాబోవటం లేదని చెబుదామనుకున్నాడు.

కానీ ఆవిడ అతనికి మేనత్త చేసిన ఉపకారాలన్నీ ఏకరువుపెట్టి "ఆమెకు నువ్వెంతో ఋణపడి వున్నావు" అంది. మందిరంలో పురాణం వినడానికి ఇక ముందు తనకు మేనత్త తోడు దొరకదని వాపోయింది. అంతటితో ఆగితే బాగుణ్ణు. నువ్వు అదెవర్తినో తెచ్చిపెట్టుకుంటున్నా వట. దాని కులం ఏవిటి? నిక్షేపంలాంటి సంబంధాలు, వేలకొద్దీ కట్నాలు వదులుకొని నీకిదేం ఖర్మని హితబోధ చెయ్యబోయింది.

లోలోపల వుడికిపోతున్నా బయట పడకుండా నెట్టుకొస్తున్నాడు రాముా.

"సరేగానీ, మీరైనా కాస్త నచ్చచెప్పి అత్తయ్య తిరిగి వచ్చేలా చూడండి" అన్నాడు.

"అదెలా కుదురుతుంది? దీని కోసం ఎప్పటినుండో కలవరిస్తోంది. ఈ చివరి కాలంలో కోరిక తీర్చకపోవడం నీకు న్యాయం కాదు. ఇన్నాళ్ళు నీకు చేసిన చాకిరీ చాలు నాయనా. ఇంకా చెయ్యా లంటావా? చచ్చేదాకా ఆడవాళ్ళు బానిస ల్లా పడివుండాలని మీ మగవాళ్ళ కోరిక. దేనికైనా హద్దూ పద్దూ వుంటుంది. ఆవిడ దారికి నువ్వు అడ్డుపడకుండా వుంటే చాలు. అదే పదివేలు. ఈ వెట్టి చాకిరీ నుండి బయటపడి హాయిగా కృష్ణా రామా అంటూ కాశీలో గంగస్నానాలు చేస్తుంది..."

"అందుకేకదా-నా డబ్బుతో ఆవిడని పంపిస్తున్నాను" అన్నాడు రాముా. 'నా డబ్బు' అన్న మాటని కాస్త ఒత్తి పలుకుతూ.

"ఎందుకు పంపవు? నీ కోసం ఆవిడ ఎంత చేసిందని!" ఆండాళమ్మ గర్జిం చింది.

"అది కాదండీ! అత్తయ్య నన్ను మూడు వందలే అడిగింది. కాని ఆవిడ సొంత డబ్బుని ఖర్చు చెయ్యనివ్వకుండా అంతా నేనే భరిస్తున్నాను..."

"మంచిది నాయనా! ఆవిడ సంపా దించిన పుణ్యంలో సగం నీకు దక్కు తుంది. నాకు తెలుసు నువ్వు బుద్ధిశాలి వని. కాని చెడు సావాసాలు నిన్ను పాడు చేస్తున్నాయి. ఊరికే అన్నారా ఏ వయ సులో జరగవలసినవి ఆ వయసులో జరగాలని. ఇన్నాళ్ళూ పెళ్ళి చేసుకో బాబూ అని శత పోరేం. విన్నావు కావు. అయినా ఈ తప్పు నీది కాదు- ఆ ముసలావిడది. పెళ్ళీ పెటాకులు లేకుండా నిన్ను ఊరమీద తిరగనిచ్చింది కదూ- అనుభవిస్తోంది..."

"యాత్రకి సంబంధించి నేను చెయ్య వలసినవి ఏవన్నా వున్నాయా?"

"రైలు టిక్కెట్లు కొనడం మినహా




అన్నీ పూర్తయినట్టే. మీ అత్తయ్యతో పాటు కొన్నాళ్ళు కాశీలో ఉందునా అనిపిస్తోంది. ఈ రెండు రోజుల్లో ఆలోచించి ఏదో ఒకటి తేల్చుకోవాలి"

"మంచిది. తొందరగా తేల్చుకో. నీ భర్త కూడా సంతోషిస్తాడు" అనుకుని బయట పడ్డాడు రామూ.

* * *

మేనత్త హడావిడి ఇంతా అంతా కాదు.

ఎంత టైమూ ఆవిడ యత్నాలకే చాలటం లేదు.

మొత్తం వస్తువులన్నీ కలిసి చిన్న గోనెసంచీడే అయినా పదిబళ్ళ సామాన్లు తరలించుకొని పోతున్నట్లు ఒకటే హడావుడి. ఆ కాసిన్ని సామాన్లు ఎన్నిసార్లు సర్దిందని !

'అబ్బో ఏమి సందడి! ఏమి సందడి!' అనుకున్నాడు రామూ.

ఇవాళ రేపు మేనత్తని అంటిపెట్టుకుని రోజంతా ఇంట్లోనే వుంటున్నాడు. సాయంత్రం పూట మాత్రం అత్తయ్య మందిరానికి వెళ్ళే సమయంలో రెండు గంటలసేపు డైసీతో గడిపి పెందరాళే ఇంటికి తిరిగొస్తున్నాడు. బోర్డులెస్ హోటలుకి వెళ్ళడం అయితే పూర్తిగా మానుకున్నాడు. డైసీ రమ్మన్నప్పుడు ఓరోజు ఉదయం ఆఫీసుకి వెళ్ళాడు. ఊళ్ళో మూడు నాలుగు పెద్ద జంక్షన్లలో 'కుటుంబ నియంత్రణ' బోర్డులు రాయడానికి ఆర్డర్ ఇచ్చింది. అడ్వాన్సు కూడా అందుకున్నాడు.

మేనల్లుడు ఎక్కువసేపు ఇంట్లో తనతో కబుర్లు చెబుతూ గడపడం' ముఖ్యంగా సాయంత్రం పెందరాళే ఇంటికి రావడం అత్తయ్యలో ఆనందాన్ని కలిగించింది. మునుపటిలాగే ఆవిడ సరదాగా వుంటోంది.

కొన్ని వందలసార్లు వినిపించిన తన జీవిత కథని ఈ నాలుగు రోజుల్లో చాలా సార్లు అతనికి చెప్పింది.

చెట్టియార్ దుకాణానికిపోయి వెచ్చాలు తెచ్చుకోవడం, సాయంత్రం మందిరానికి వెళ్ళి పురాణం వినడం మామూలుగానే చేస్తోంది. భాగవతంలో ముఖ్య ఘట్టాలు వినకుండా పోవడం ఆవిడకు ఇష్టంలేదు. అందుకే ఆండాళమ్మని వెంట పెట్టుకుని మరీ వెళ్తోంది.

సాయంత్రం అత్తయ్య మందిరం నుండి వచ్చేవేళకి రామూ డైసీని కలుసుకుని ఇంటికి చేరుకునేవాడు. భోజనం దగ్గర కూర్చున్నప్పుడు ఆ రోజు పురాణంలో విన్న ఘట్టాలని యథాతథంగా వర్ణించేది.

"కృష్ణ పరమాత్మ అన్నివేలమంది గోపికలతో కలిసి బృందావనంలో రాసక్రీడలాడుతుంటే... ప్రతి ఒక్కతీ ఆ నల్లనయ్య తన ఒక్కరితోనే ఆడుతున్నాడని అనుకునేదిట. దాని అంతరార్థాన్ని ఈ రోజు శాస్త్రిలుమా బాగా విడమరిచి చెప్పేడు" అంటూనే ఇంటి విషయాల్లోకి సంభాషణ మళ్ళించేది.

"ఆ బస్తాలో బియ్యం శుభ్రంగా బాగుచేసి పెట్టేను. రాళ్ళురప్పలు కూడా ఏరుకోనవసరం లేదు" ప్రతి రోజూ మధ్యాహ్నం పూట పెరటి వరండాలో బియ్యం కుప్పగా పోసుకుని, కళ్ళద్దాలు తగిలించుకుని బాగుచేసేది.

"వచ్చే ఆరు నెలల దాకా నువ్వు మంచి నూనెకొనుక్కోవలసిన పని లేదు. చెట్టియార్ శుభ్రమైన నువ్వులు గానుగలో

ఆడించి తెచ్చేడు. మన పెద్ద డబ్బా నిండా తీసుకున్నాను. అప్పుడప్పుడు దాని మూత తీసి చూస్తూ ఉండు. లేకపోతే ముతక వాసన వేసేగలదు. నూనె చిన్న గిన్నెలోకి తీసేటప్పుడు జాగ్రత్తగా ఒంపాలి... మూత గట్టిగా వెయ్యి—ఈగలు దోమలు వడిపోగలవు. ఈ విష యాలన్నీ ఆవిడకు చెప్పు." పరోక్షంగా డైసీ ఇంటి విషయంలో తీసుకోవలసిన జాగ్రత్తలన్నీ ఒక్కొక్కటిగా ఏకరువు పెట్టేది.

"రెండు పెద్ద జాడీల నిండా ఆవకాయ పెట్టేను... మీకు చాలా కాలం వస్తుంది. వుండీ వుడిగి జాడీలు ఎండలో పెడుతూ వుండండి. లేకపోతే ఆవకాయ బూజు పట్టేస్తుంది... కొంచెం కొంచెం వెనుకు తినండి. అనవసరంగా పారపొయ్యొద్దు"

ఇవన్నీ వింటుంటే అతనికి ఆశ్చర్యం అనిపించింది.

ఆడవాళ్ళకి ఇంట్లో వంట పని మాత్రమే కాకుండా అదనంగా ఇన్ని పనులుంటాయా?

గోనె సంచీలో అత్తయ్య సర్దిన సామాన్లు రెండు తెల్లని చీరలు, విబూతి దాచుకునేందుకు చిన్న ఇత్తడి డబ్బా, రుద్రాక్ష జపమాల, ఓ దండకాల పుస్తకం, రెండు కీర్తనల పుస్తకాలు, రెండు వెండి విగ్రహాలు—అందులో ఒకటి విఘ్నేశ్వరుడు, మరొకటి మురళి వాయిస్తున్న కృష్ణుడు.

"ఈ రెండు విగ్రహాలు నేను కాపరానికి వెళ్ళినప్పుడు మా నాన్న—కంసాలి వీరభద్రుడి చేత చేయించి ఇచ్చేడు" అంటూ భద్రంగా దాచింది.

సంచీలో. చాలా ఖాళీ మిగిలి వుంది.

"మరి నాలుగు సామాన్లు పెట్టుకో దారిలో పనికొస్తాయి" అని రాముా అంటే

"అక్కర్లేదురా— ఇంకా నా శాలువా అటుకుల పొట్లం అందులో పెట్టాలి. వాళ్ళని కనుక్కున్నాను, దారి పొడుగునా ఆ దేశాల్లో అటుకులు, పాలు, అరటి పళ్ళు దొరుకుతాయట.

ఎందుకేనా మంచిదని రెండు వారాలకి సరిపోయే అటుకులు పట్టుకుంటున్నాను. అంతకంటే నాకు కావలసిందేముంది?" అంది.

చాలా సంవత్సరాల నుండి ఆవిడ ఒంటిపూట భోజనంతోనే జీవిస్తోంది. ఆ సంగతి అతనికి తెలుసు.

అతి సాధారణమైన ఆవిడ జీవితాన్ని అతనెంతగానో శ్లాఘించేడు. ఆ నిరాడంబరత, నిరాపేక్ష, ఉన్నా లేకున్నా సర్దుకుపోవడం – ఇవన్నీ తను నేర్చుకోవలసిన గుణపాఠాలు.

ఆవిడ జీవితాన్ని ఓసారి గుర్తుకు తెచ్చుకున్నాడు.

మనిషిలో స్వార్థచింతన ఏ కోణానా లేదు. కేవలం అతని కోసమే ఇన్నాళ్ళుగా జీవిస్తోంది. తనకోసం ఏ పనీ చేసుకుని ఎరుగదు. సాయంత్రం వేళ మందిరం మినహాయిస్తే ఇల్లే ఆవిడకి అఖిల ప్రపంచము,—అతని సంరక్షణే జీవిత పరమార్థం.

తనకోసం నవరుచులూ వండిపెడుతూ, ఊరంతా తిరిగి తను ఇంటికి చేరుకునే దాకా వంటింటి గుమ్మం దగ్గర గచ్చునేల మీద కొంగు పరచుకొని కునికిపాట్లు పడుతూ, తన చిరాకులు చిరునవ్వుతో వారిస్తూ ఇంతకాలం నెట్టుకొచ్చింది. ఈ మధ్య రాత్రుళ్ళు డైసీ దగ్గరకు పోయి తను ఇంటికి తిరిగి రానప్పుడు నట్టింట్లో




కటిక నేల మీద పడుకుని ఎంతలా కక్కటిల్లిందో!

"పాలవాడు ప్రతిరోజూ సాయంత్రం ఆవుని తోలుకుని ఇంటికి వస్తాడు. పాలు పితుకుతున్నప్పుడు ఎవరో ఒకరు కని పెడుతూ నిలబడాలి. కొంచెం ఏమరి పాటుగా వుంటే చాలు పాలు కటిక నీళ్ళే..."

ఇన్నాళ్ళూ పాలు ఎందుకంత చిక్కగా వుంటున్నాయో, పెరుగు గడ్డలా ఎందుకంత బాగా వుంటోందో అతనికి ఇప్పుడు అర్థం అవుతోంది.

పాలవాడు ఆవును తీసుకొచ్చింది మొదలు పాలు పితికి ఇచ్చేవరకు ఇంటి ముందు ఎలక్ట్రిక్ స్తంభం దగ్గరే నిల బడేది. పితికేముందు చెంబులో ఒక్క నీటి చుక్కకూడా వుండడానికి వీల్లేదు.

ఇన్నాళ్ళూ అతను ఇవేవీ పట్టించు కోలేదు. మేనత్త సంరక్షణలో కేవలం ఒక మొక్కలా పెంచబడ్డాడు.

తను పెరటి షెడులో బోర్డులు రాసు కుంటున్నప్పుడు, బోర్డులెస్ హోటల్‌లో బాతాఖాని చేస్తున్నప్పుడు, అందమైన సాయంత్రాలు డైసీతో గడుపు తున్నప్పుడు–తనకి తెలియకుండా తన కోసం తెరవెనుక ఇన్ని ఏర్పాట్లు జరుగు తున్నాయన్నమాట! ఒక మనిషి తన పూర్తి కాలాన్ని ఈ పనులకి వినియో గించాలి కదా! మరి డైసీ ఈ పాత్రని ఎలా నిర్వహించగలుగుతుంది? ఆవు పక్క నిలబడడం, ఆవకాయ జాడీ ఎండలో పెట్టడం ఇవన్నీ చేస్తుందా?

ఆమె నుండి ఇటువంటి పనులు ఆశించ వద్దని ముందే చెప్పేసింది.

ఇంతకాలం నుండి అలవాటైన ఈ పనులన్నీ ఒక్కసారి వదిలిపెట్టేసి మేనత్త వెళ్ళిపోతోంది గాని పనీ పాటు లేకుండా పొద్దు సమానం కాశీలో ఎలా పూస పోతుందో? అత్త వెళ్ళిపోతోందన్న భావన మరోసారి గుర్తుకు వచ్చి అతని మనసు ఆకులా అల్లాడి పోయింది.

"ఇది నీ సొంత ఇల్లు అత్తా! నీకు కాశీలో వుండాలనిపించినన్నాళ్ళూ వుండి నన్ను చూడాలనిపించగానే తిరిగి వచ్చేయ్" అన్నాడు.

"నేను ఏంచెయ్యబోయేది ఇప్పటికే చాలాసార్లు చెప్పేను. ఇక ఆ ఊసే ఎత్తకు. ఈ సముద్రాన్ని ఈది ఈది అలసిపోయేను: మరి నా వల్ల కాదు" అంటూ వేదాంత ధోరణిలో పడిపోయింది. మందిరంలో పురాణ శ్రవణం ఆమెలో అంతర్లీనంగా వున్న వేదాంత భావనకు నీరుపోసి పెంచింది.




మేనత్త వెళ్ళిపోయి మూడు రోజు లైంది. ఇల్లు చిన్నబోయింది. ఆమె సంచారం కరువై కీకారణ్యంలా గీపెడు తోంది.

ఇన్ని నాళ్ళ మమకారాన్ని ఒక్క వేదాంత భావనతో తెంచుకుని భవసాగర తరణానికి గంగాతీరం వెళ్ళిపోయింది.

రాముకి ఇంట్లో తోచటం లేదు. దిగులుగా వుంటోంది. డైసీ తన ఇంటికి రాబోతోందన్న ఆనందం వల్ల మేనత్త

లేని వెలితిని మరిచిపోతున్నాడు.

ఇల్లంతా కలియ తిరిగేడు.

డైసీ కోసం ఎలాంటి మార్పులు చెయ్యాలో ఆలోచిస్తున్నాడు.

నది ఒడ్డున ఈ ప్రశాంత సదనానికి డెసీయే రాణి. కాని ఆమెదృష్టిలో ఇంటికి ఏమంత ప్రాముఖ్యత లేదు. ఆ సంగతి సూటిగా, స్పష్టంగా చెప్పింది కూడా.

“ఇల్లు నాకెంత ముఖ్యం అనుకుంటు న్నావో నీకూ అంతే ముఖ్యం. దీన్ని నువ్వెలాగైనా అర్థం చేసుకో. నా మట్టుకు నాకు ఓ ఇల్లుండాలని దానిని చక్క దిద్దాలని ఎంత మాత్రమూ లేదు... అయితే ఆ బాధ్యత నీదేనని కూడా చెప్పటం లేదు.

“ఇల్లు ఫలానాలా వుండాలని దాని నిర్వహణకు ఇవిగో ఈ పద్ధతులున్నా యని నీకనిపిస్తే ఆ ప్రకారం నువ్వు చేసుకోవచ్చు. నాకు అభ్యంతరం లేదు. కాని నీ పద్ధతులు అనుసరించాలని నా మీద ఒత్తిడి మాత్రం తేవొద్దు...”

ఆమెకు ఇంటిని చక్కబరచడం కన్నా ముందు దేశాన్ని చక్కబరచటం ముఖ్యం. వ్యక్తిగతమైన అభిరుచులు కన్నా సమాజపుటవసరాలు ముఖ్యం.

“ఎండ, వాన, చలి వీటినుండి తల దాచుకోడానికి, నిద్రకి, స్నానానికి, నీ ట్రంకుపెట్టె భద్రపరుచుకోడానికి ఇంతకు మించి ఇంటి అవసరం ఏముంది ?”



అంది.

ఆమె సామాన్లు కూడా ఇందుకు తగినట్లుగా చాలా పరిమితంగా వున్నాయి తన మేనత్త సరంజామాలాగ. నిరాడం బరతలో, సర్దుబాటులో, పొదుపైన జీవన సరళిలో ఇద్దరికీ చాలా పోలికలున్నాయి. మేనత్త ఆస్తిపాసులు చిన్న గోనె సంచీలో ఇమిడిపోతే డైసీ సంసారం ఓ ట్రంకుపెట్టెలో, మరో ఎయిర్ బేగ్‌లోను సరిపోతోంది. ఆమె కాంగో వెళ్ళినప్పుడు సంక్షేమ సంస్థ వాళ్లు ఇచ్చిన బేగ్ అది.

ఫర్నిచర్ కూడా అవసరానికి మించ కుండావుంది. ఓ మడతకుర్చీ, చిన్న స్టూలు, వెదురు బద్దలతో చేసిన టేబులు దాన్నిండా మేకులున్నాయి.

ఆమెకు బొంతలు, పరుపులు లేవు చిన్న చాప, బూరుగుదూది తలగడ మాత్రం వున్నాయి.

"మనం మరికొంచెం ఫర్నిచరు సమకూర్చుకోవాలేమో" అని రామూ అంటే-

"నాకవసరం లేదు. ఈ ఫర్నిచర్ చాలు నీకు కావలిస్తే కొనుక్కో" అంది.

ఏ అవసరమూ లేకుండా మరీ క్లుప్తంగా ఆమె బతుకుతున్నందుకు అత నికి బాధగా లేదుగాని ప్రతి చిన్న విష యానికి "అది నీ కోసం, ఇది నాకు చాలు అంటూ వేర్పాటు ధోరణిలో మాట్లాడం మాత్రం రామూకి బాధ కలిగిస్తోంది.

"ఇది మనది, మనం, మనకోసం" అనే కలుపుగోలుతనం లేదెందుచేత? కలిసి బతకడంలో ఆనందం వుందని ఆవిడకి ఇంకా నమ్మకం కుదరలేదా? అతను ఎంత మొత్తుకున్నా లాభం లేదు. ఆవిడ తోలులేని డప్పులాంటిది. ఆ ధోరణిలో





మార్పు రాదు. అతనికి ఒక్కొక్కసారి ధైర్యం సన్నగిల్లిపోతోంది. అన్యోన్యతా భావం బీటలువారి పోతోంది.

"ఆ ముక్కులోని కోటేరుతనం లాగ, పెదవుల్లోని ఒంపులాగ, ఈ ధోరణి కూడా పుట్టుకతో వచ్చింది. అంతకన్నా మరేం కాదు" అని సర్దిచెప్పుకొని "ప్రేమించే హృదయం వుండాలేగాని ఇవన్నీ అవరోధాలుకావు" అనుకున్నాడు.

ఈ సర్దుబాటు ధోరణివల్ల ఆమె అల వాట్లకు అనుగుణంగా తనను తాను మలుచుకోడం ప్రారంభించేడు.

ఆమెతో పడుకున్నప్పుడు ఆమె ఇంట్లో చాప మీదే నడుం వాల్చేడు. తన ఇంట్లో మాత్రం చాప మీద బొంత వేసు కునేవాడు. బొంత వేసుకోరాదూ అని అడిగితే-

"కోట్లాది ప్రజల జీవన విధానానికి భిన్నంగా మనం ఎందుకు బతకాలి? వాళ్ళలాగే జీవిద్దాం. నేను గుడిసెల్లో బతి కేను. వాళ్ళ ఇబ్బందులు పూర్తిగా అర్థం చేసుకున్నాను" అని అంటుందని రామూకి తెలుసు. అందుకే అడగకుండా వూరు కున్నాడు. డైసీ తన ఇంటికి వచ్చేక మెల్లగా బతిమాలి బొంత మీద పడు కోడానికి అంగీకరించేలా చెయ్యాలి.

ఆవిడ తన షరతులు చెప్పినప్పుడు అతను కూడా తన షరతులు కాదుగాని కనీసం అభిప్రాయాలు చెబుదామను కున్నాడు. కాని ముఖం చిట్లించి, మూతి ముడుచుకుంటుందేమోనని భయపడ్డాడు.

ఓవేపు ఆవిడ ధోరణికి దగ్గరౌతున్నా నని అనుకొంటూనే మరోవేపు అదన మైన సుఖాలకోసం ఆరాటపడటం దేనికి? డైసీ చెప్పినట్లు భార్యాభర్తలుగా మారినంత మాత్రంచేత ఇప్పటి జీవి తానికి భిన్నంగా బతకాలని వుందా?

"ఓ పంచలో బతికే భార్యా భర్తలకి ఇంతకన్నా ఎక్కువ సుఖాలు అవసరం లేదు" అని డైసీ అంటే అతనికి దిగులుగా వుండేది. కాని ఆమె చెప్పిన ప్రతి మాటకీ అతను తల ఒగ్గి వింటూనే వున్నాడు. ఆమెతో వాదించి లాభం లేదని, రాజీ పడితేనే మనసుకు శాంతి లభిస్తుందని తెలుసుకున్నాడు. అంతే కాదు. ఒకే స్టీరింగు చక్రాన్ని ఇద్దరు డ్రైవర్లు నడిపితే వాహనం ఎలా నడుస్తుందో కూడా ఊహించుకున్నాడు.

అనవసరమైన వివాదాలకు తావు లేకుండా - ఆమె భావాలకి పూర్తిగా లొంగిపోడానికి నిశ్చయించుకున్నాడు. స్వయం ప్రకాశ శక్తిలేని ఉపగ్రహం సూర్యుణ్ణి ఆశ్రయించేలా తను ఆవిడ ఆలోచనా కక్ష్యలోనే అనవరతం పరిభ్రమిస్తూ వుంటాడు. ఎదురు తిరిగితే శంతనమహారాజుతో గంగాదేవి దాంపత్యంలా తన కాపురం బెడిసి కొడుతుందేమోనని అతని భయం. ఆమెను అప్పుడప్పుడు నవ్వించాలని తన ఊహల్లో వాళ్ళకి పుట్టిన పసివాళ్ళని అప్పటికి చాలాసార్లు ఎంతమందికో అప్పచెప్పేవాడు...

అత్తయ్య వెళ్ళిన వారం రోజుల వరకూ రామూ ఇల్లు శుభ్రపరచడం లోనూ, సామాన్లు చక్కబరచడంలోను నిమగ్నమై పోయేడు.

వంటగది గోడలకు పట్టిన మసిని అట్లకాడతో పెరికి సున్నం వేయించేడు. వంటగదిలో ఓమూలనున్న మట్టి కుంపటిని పీకేసి, ఆ స్థానంలో ఎలక్ట్రిక్ హీటరు తెచ్చిపెట్టేడు. మట్టి కుంపటిని పారవెయ్యడానికి మనసు ఒప్పక దానిని పెరటి వరండాలో ఓ వారవుంచేడు. వంట బాధ్యత మూడొంతులు తన మీదే పడవచ్చు. కాబట్టి తనకు అందువిడిగా అన్నీ అమర్చుకోవాలి.

కొన్ని అల్యూమినియం గిన్నెలు, గాజు గ్లాసులు కొన్నాడు. మధ్య గదికి ఆనుకుని వున్న చిన్న గదిని డైసీ కోసం కేటాయించాడు. ఆ గదిని ఇన్నాళ్లూ అత్తయ్య పూజా మందిరంగా వుపయోగించింది. అందులో డైసీ సరంజామా సులువుగా పడుతుంది. మడతకుర్చీ, వెదురు బద్దల టేబులు, ఆఫీసు ఫైళ్ళు భద్రంగా దాచుకోవొచ్చు. గదికి చిన్న కిటికీ వుంది. గాలి వెలుతురుకు సమస్య లేదు. ఆవిడకి ఒంటరిగా నిశ్శబ్దంగా వుండాలనిపించినప్పుడు కిటికీ తలుపులు మూసుకోవచ్చు.

ఇకపోతే తన గది తనకి ఎలాగూ వుండనే వుంది. గదిలో చాపచుట్ట, బొంతలు, అల్మారా నిండ పుస్తకాలు- వీటిని ఎటు తిరిగి మార్చనవసరం లేదు.

డైసీ కోసం రెండు బొంతలు తయారు చేయిస్తున్నాడు. వాళ్ళ రెండు పక్కలు అతని గదిలో విశాలంగా వేసుకోవచ్చు. వేసుకుని, ఒకరిలో ఒకరు గువ్వ పిట్టల్లా ఒదిగి వెచ్చగా పడుకోవచ్చు. ఈ భావన మధురంగా మెదిలి అతనిలో పులకింతలు రేపింది.

"గూడు" అని ఓ చిన్న బోర్డు రాసి వీధి వేపు తలుపుకి తగిలిద్దామనిపించింది. అక్షరాల డిజైన్‌గా కొమ్మల్ని, రెమ్మల్ని ఎన్నుకుంటే బాగుంటుంది.

ఆ గూటిలోని ఆడ పక్షి మళ్ళీ ఏటికి గుడ్డు పెట్టగానే - కాదు కాదు గుడ్డుని పొదిగి పిల్లగా చెయ్యగానే దానిని మరో గూటికి అప్పచెబుతుంది.

పల్లెటూళ్ళల్లో ఆడజనంలాగ ఏడాదికో బిడ్డ చొప్పున కంటూ ఏ క్రిష్టియన్ ఫాదర్‌కో, సిస్టర్‌కో అప్పగింతలు పెడుతుంది కాబోలు. అతను నోరు మెదపడానికివీల్లేదు. నోరెత్తేడో గూట్లో పిట్ట తుర్రుమంటుంది.

ఏది ఏమైనా ఆవిడని నెట్టుకు రావడం చాలా కష్టమే!

గాంధర్వ పద్ధతిలో పెళ్ళి ఎంత సులభమో- విడిపోవడం కూడా అంతే సులభం. తమ బంధాన్ని గట్టిపరుచుకోవాలంటే రిజిస్ట్రార్ ఆఫీసుకి వెళ్ళడం మంచిది. పుట్టబోయేవాళ్ళని తనవాళ్ళుగా చట్టబద్ధంగా చెప్పుకోవచ్చు.

పూజా మందిరాన్ని డైసీ గదిగా మార్చడం పూర్తయింది. మెనత్త పూజలు అందుకునే దేవుళ్ళు అదే గదిలోని అల్మారాలో తల దాచుకోవలసి వచ్చింది.

మధ్యాహ్నం రామూ ఇంటి చక్కబాట్లతో బిజీగా ఉండగా డైసీ హఠాత్తుగా వచ్చింది.

ఆమె రాకకు సంతోషించి రామూ ఇల్లంతా చూపించేడు. ఆవిడ ఎటువంటి ఆసక్తిని కనబరచలేదు. పైగా-

"ఇప్పుడు వాటన్నిటిని సర్దకపోతే ఏం వచ్చింది? ఇంత కాలం ఎలా వున్నాయో ఇకముందు అలానే ఉండనిస్తే పోలేదా?" అంది.

తన ఏర్పాట్లు చూసి ఎంతగానో మెచ్చుకుంటుందని ఆశపడ్డ రామూకి నిరుత్సాహం అనిపించింది. అయినా పట్టు వదల్లేదు.

"దయచేసి ఈ ఒక్క విషయంలో మాత్రం నా మాట నడవనీ- ఇల్లు చక్కదిద్దే బాధ్యత నాది" అన్నాడు.

"ముందే చెప్పేను కదా నీకు ఇష్టమైతే చేసిన వాటిలో నా ప్రమేయం వుండనవసరంలేదని..." అంది.

రామూ తను కొనిపెట్టిన సామాను చూపించేడు.

వంటగదిని ఎలా మార్చేసేడో చెప్పేడు.

మిగిలిన గదులకి ఏ రంగుసున్నం వెయ్యబోతున్నాడో-ప్రత్యేకించి తమ గదికి ఏ రంగు వాడబోతున్నాడో వివరంగా చెప్పేడు.

ఆమె కోసం సిద్ధం చేసిన గదిని చూపించేడు.

వాళ్ళిద్దరూ గదిమధ్య నిలబడ్డారు.

వీధి తలుపులు దగ్గరగా మూసి అడ్డు గడియ పెట్టడం వల్ల గదిలో అట్టే వెలుతురు లేదు.

పైన పెంకుల మధ్య గాజు అద్దం లోంచి ఎంత పెద్ద గొట్టంలాగ దిగుతోంది.

పెరట్లో నది ఒడ్డున రావి ఆకులు ఆ మధ్యాహ్నపు గాలికి గలగల చప్పుడు చేస్తున్నాయి.

చెట్టుమీద పక్షులు ఎండవేడిని తట్టుకోలేక నదిమీదకి ఎగిరి నీళ్ళుతాగుతూ తిరిగి గూళ్ళలోకి చేరుకుంటున్నాయి.

ఆ వాతావరణం భావ కవికి అందమైన కవితా వస్తువు.

ఆ ఏకాంతం రామూకి బహు తియ్యని తాయిలం.

గది మధ్యన మసక వెలుగులో డైసీని దగ్గరగా తీసుకోబోయేడు.

"దేనికీ సమయం, సందర్భం అక్కర్లేదా?" సున్నితంగా వారించింది.

'ఆవిడ మూడ్ కనిపెట్టలేక ఎంత

ఫూలిష్‌గా ప్రవర్తించేను?' నాలుక కొరుక్కున్నాడు.

ఈ మహారాణి ఎప్పుడు నోరు విప్పుతుందో, ఎప్పుడు నిశ్శబ్దాన్ని వరిస్తుందో ఎలా తెలుసుకోవడం?

ఆ ఎర్రని పెదవుల మధ్య సన్నని చిరునవ్వు ఎప్పుడు వికసిస్తుందో, ఎప్పుడు ఆ చిన్న నోరు లక్కపిడతలా మరింత దగ్గరగా ముడుచుకుపోతుందో, ఎలా కనిపెట్టడం?

ఇదో విషమ సమస్యగా తయారైంది.

ఆవిడ మూడ్ కనిపెట్టి మాట్లాడం- మూడ్ కనిపెట్టి నవ్వడం- మూడ్ కనిపెట్టి ముద్దాడం... మూడీగర్ల్.

ఆవిడితో సాహచర్యం అతనికి అసిధారావ్రతం!

"ఇల్లు నీకు నచ్చిందనే అనుకుంటాను"

"ఎలాగున్నా ఫర్వాలేదు. నా కోసం వర్రీ కావొద్దు"

"ఇన్నాళ్ళు నా ఇల్లు- ఇకముందు మన ఇల్లు... అందుకే నీ అభిప్రాయం తెలుసుకోవాలని..."

డైసీ మాటాడలేదు.

"ఇప్పుడున్న ఫర్నిచర్ చాలదేమో- నీకోసం ఇంటికి ఎవరన్నా వస్తే కుర్చీలు లేవు"

"అక్కర్లేదు. నాతో పని వున్నవాళ్ళు కలుసుకోవలసింది ఆఫీసులో గాని ఇంట్లో కాదు. ఆఫీసు పనివేళల తరువాత ఎవరినీ కలుసుకునేది లేదు."

ఆ సమాధానం అతనికి సంతృప్తి కలిగించింది.

వంటగది చూపించేడు.

అందులో ఎలక్ట్రిక్ హీటర్ చూపించి, ఆవిడ అభిప్రాయం తెలుసుకోవాలనుకున్నాడు. ఆవిడ వ్యాఖ్యానించలేదు.

ఆవిడ దృష్టిలో వంట చేసుకోవటం, తినడం ఏమంత ప్రాముఖ్యత గల అంశాలు కావు.

"ఈపాటి వంటగది, కాసిన్ని సామాన్లు మనకి అవసరం కదూ...?"

"నేను ఆలోచించలేదు. ఎందుకంటే నాకైతే ఇదేం అంత సమస్య కాదు. వస్తువులు కొనుక్కోవడం, దాచుకోవడం, వండుకుని తినడం నాకు ముఖ్యం కాదు. ఆ మాటకొస్తే అసలు తినడానికిలేక ఆకలి బాధని చన్నీళ్ళతో నెట్టుకొచ్చే ప్రజలు దేశంనిండా వున్నారు. నేను ఎక్కడైనా, దేనితోనైనా సర్దిపెట్టేసుకుంటాను. వంట చేసుకుని తింటేగాని ఆకలి చల్లారదని నేను అనుకోను. ఏ హోటల్లోనైనా తిని పొట్ట నింపుకోవచ్చు."

"అవన్నీ ఎందుకు?"

"ఎందుకేవిటి? హోటల్‌లో అన్నం దొరుకుతుంటే మళ్ళీ వండుకోవడం ఎనర్జీ వేస్ట్. ఆ కాలాన్ని మరోపనికి వాడుకో!"

ఈవిడ సిద్ధాంతాలకో నమస్కారం !

అతను చాలా సేపటినుండి ఓ కమ్మని మాటకోసం ఎదురు చూస్తున్నాడు. ఎంత సేపూ "నువ్వు", "నేను" అనడమేగాని "మనం" అని ఈ జన్మలో అనదా?

ముచ్చటగా ఏదైనా అడిగితే——

"నీ యిష్టం వచ్చినట్లు చెయ్యి- నాకైతే పట్టింపు లేదు" అంటుంది. ఇలా అయితే ఇక ముందు ముందు గడిచేది ఎలా? ఈ పెళ్ళితో తను నలుగురిలో నవ్వులపాలు కాడుకదా!

ఏమో భవిష్యత్తు ఎన్ని మలుపులు తిరగబోతోందో!!

ప్రతి చిన్న విషయంలో వేర్పాటు. అభిరుచుల్లో, అలవాట్లలో వైరుధ్యం. ఎవరిదారి వాళ్ళది- ఎవరి బతుకులు వాళ్ళవి. కాని-

ఇద్దరూ వుండేదిమాత్రం ఒకే కప్పు కింద- పడు(కు)ండేది ఒకే పక్కమీద! ఈ సంసారం ఇలాగే సాగితే ఈరెండూ కూడా ఎన్నాళ్ళు సాగుతాయో సందేహమే!

మూడ్ బాగా లేనప్పుడు గదిలోకి పోయి తలుపులు బిడాయించుకుంటుంది కాబోలు. "నో అడ్మిషన్" బోర్డు రాసి పెడితేసరి, పెళ్ళి కానుకగా ఇవ్వడానికి బావుంటుంది.

"మన ఇద్దరికి సరిపడిపోయేలా ఓ డైనింగ్ టేబిల్‌కి ఆర్డరు ఇద్దామనుకుంటున్నాను" అనబోయేడు. కాని అనలేదు. అలా అని వుంటే ఆమె నుండి వచ్చే జవాబు అతనికి తెలుసు.

"అది 'నీ' ఇష్టం- 'నన్న'డిగితే అది శుద్ధ వేస్టు" అంటూ దేశం- దరిద్రం- ఆకలి-జనాభా- అంటూ దండకం మొదలుపెడుతుంది.

అనవసరంగా 'తను' మాట్లాడి 'ఆవిడ' మూడ్ చెడగొట్టడం దేనికి?

డైసీ, రామూ మధ్య గదిలోంచి అతని గదిలోనికి వచ్చేరు. నేలమీద చాప పరిచి వుంది. బొంత చుట్ట గోడ వేపు వుంది. దాని మీద తలగడ, మడత పెట్టిన దుప్పటి వున్నాయి. అరల్లో పుస్తకాలు చూసి-

"తీరిక వేళల్లో నువ్వు జీవించే పుస్తక ప్రపంచం ఇదేనా?" అని అడిగింది.

"అవును" అని నవ్వి, "దీనిని మన బెడ్‌రూమ్ కింద మారుద్దామనుకుంటున్నాను" అనబోయి, ఆగి- ఆ ముఖం లోనికి చూసేడు. అందులో చదివిన భావాల ప్రకారం ప్రస్తుతానికి ఊరుకున్నాడు. అతనొకవేళ చెప్పేవుంటే ఆవిడ కనుబొమలు ముడుచుకుపోయి, ముక్కు పుటాలు పైకి ఉబ్బి-

"నేను 'నా' ఇంట్లో వుంటాను; నువ్వు 'నీ' ఇంట్లోనే వుండు. నేను చెప్పిన సమయాల్లో ఇద్దరం కలుసుకుందాం" అని అనడానికి కూడా ఆవిడ వెనకాడదు.

అక్కడినుండి ఇద్దరు పెరట్లోకి వెళ్ళేరు.

ఆవరణలో చిన్న నుయ్యి, పెరటి గోడకు అవతల రావి చెట్టు, ఇసుకమేట, రాతి మెట్లు, నది- వీటిని మాత్రం మెచ్చుకుంది.

" 'నీ' ఇంటి వెనక వాతావరణం 'నాకు' బాగా నచ్చింది" అంది.

ఇల్లంతా దాటుకుని పెరట్లోకి వచ్చినా ఇంకా 'నీ ఇల్లు' అనడం నచ్చలేదు.

"ఇది నా వర్క్ షెడ్డు" తన షెడ్డుని, అందులో రంగు డబ్బాలు, కుంచెలు, బల్ల చెక్కలు చూపించేడు.

డైసీ పెద్దగా పట్టించుకోలేదు.

పెరట్లో నుండి తిరిగి అతని గదిలోనికి వచ్చేరు.

డైసీ బొంతచుట్టను, తలగడని ఆనుకుని చాపమీద కాళ్ళు చాపుకొని కూర్చుంది.

అతను ఆమె కాళ్ళవేపు కూర్చొని-

''అలసిపోయేవా?'' అన్నాడు. కాని ఆమె మీద చెయ్యి వెయ్యడానికి మాత్రం సాహసించలేదు.

ఆమె పాదాలవేపు చూసేడు.

సుకుమారంగా వుండవలసిన పాదాలు మొరటుగా వున్నాయి. అరికాళ్ళమీద




పగుళ్ళుకూడా వున్నాయి.

"నువ్వు కాళ్ళకి జోళ్ళు వేసుకోకుండానే నడుస్తావా?" అని అడిగేడు.

"అవసరం వచ్చినప్పుడు తప్పకుండా..."

కొంచెం ముందుకు జరిగేడు-

ఎదురుగా డైసీ- ఆవిడనుంచి వస్తున్న వింతైన అత్తరు పరిమళం - పడకగది- ఏకాంతం...

అతని మనసులోని భావాలను ఆవిడ యిట్టే గ్రహించింది.

"అంత దూరంగా వుండనక్కర్లేదు- పక్కకు రావచ్చు" అంది.

రామూ కళ్ళు కృతజ్ఞతతో మెరిసేయి.

మెల్లగా ఆమెపక్కకు చేరేడు. కొంత చుట్టని అనుకుని కూర్చుంటూ తన ఎడమ చేతిని ఆమె భుజాలమీదుగా పోనిచ్చి దగ్గరగా లాక్కొని మెత్తగా అన్నాడు-

"ఇప్పుడు నాకెంతో హాయిగా వుంది. మనం దంపతులం కదూ!"

జాగ్రత్తగా ఆలోచించి "దంపతులం" అనే ప్రయోగించేడు తప్ప "భార్యాభర్తలం" అనలేదు. ఆ ప్రయోగం ఆవిడకి ఎలర్జీ.

ఇలాంటి జాగ్రత్తలు తీసుకుంటే ఆవిడ సులభంగా ప్రసన్నురాలు అవుతుంది.

అతని ప్రయోగం బాగా పనిచేసినట్టుంది. ఆమె రామూకి మరింత దగ్గరగా జరిగి అతని ఛాతీమీద తల పెట్టుకుని మత్తుగా కళ్ళు మూసుకుంది.

పెరట్లో నదికి- నది ఒడ్డున చెట్టుకి- చెట్టుమీద ఆకులకి చెప్పాలి "సడిచెయ్యకండి. నా ప్రేయసి నిద్రపోతోందని"

అబ్బో తనకి కవిత్వం వస్తోంది...

ఇదే మంచి సమయం- ఆమె చాలా ప్రశాంతంగా కనిపిస్తోంది.

తనలో చాలా సేపటినుండి జోరీగలా రొదపెడుతున్న కోరికని ఆమె ముందుంచాలి...

కాని- మరోవేపు సందేహం.

తను ఆమెను కదిపి పట్టుకుచ్చులాంటి ఈ మృదువైన క్షణాల్ని పాడుచేయటం లేదు కదా?

కావచ్చునేమో! కాని ఎన్నాళ్ళిలా మౌనంగా వుండడం?ఇల్లు కడగడంపూర్తయ్యేక ముగ్గుపెట్టడానికి సందేహందేనికి? ఎక్కుపెట్టిన బాణాన్నెప్పుడో ఒకప్పుడు వదలక తప్పదు.

"నిద్రపోతున్నావా డైసీ" అని అడిగేడు.

"లేదు'' ఆమె కనురెప్పలు తెరవలేదు.

"నిన్ను ఒకటి అడగాలని..."

"ఏవిటి?" కళ్ళు మూసుకునే అడిగింది.

"మరేంలేదు. నువ్వు ఈ ఇంట్లోకి ఎప్పుడు మారాలనుకుంటున్నావు?" మొత్తానికి అడిగేశాడు.

ఆమె జవాబు చెప్పలేదు.

లయబద్ధంగా ఊపిరితీస్తూ, వదులుతూ వుంది.

ఆ గాలి అతని ఛాతీకి వెచ్చగా తగులుతోంది.

కాస్సేపు ఆగి, మళ్ళా అలాగే అడిగి

"చూసేవు కదా- ఇల్లంతా సిద్ధంగా వుంది..."

ఈమాటుకూడా జవాబు చెప్పలేదు.

ఇంకా అదే వూపిరి - అలాగే వేడి గాలి...

అసహనాన్ని అణుమాత్రం కూడా

బయటకు రానివ్వకుండా నిగ్గబట్టుకుని కూర్చున్నాడు.

"ఈ సంగతి ఆలోచిస్తున్నావా?" అన్నాడు.

అవునన్నట్లు తలవూపింది.

"రాబోయే పదో తేదీన వద్దామను కుంటున్నాను" అంది.

రాము ఊపిరి పీల్చుకున్నాడు.

"ఆ రోజుతో నేనుంటున్న ఇంటికి అద్దె గడువు పూర్తవుతుంది. దాటితే మళ్ళా అద్దెకట్టాలి" అని కూడా అంది.

"మరి కట్టొద్దు - ఏకంగా వెళ్ళి పోతున్నాననే చెప్పెయ్. నేను గఫూర్ దాదా టేక్సీ తీసుకొని వస్తాను. ఒకేసారి నీ సామానన్నీ తీసుకురావచ్చు. ఉదయం ఆరు అయ్యేసరికి వస్తాను."

"అంత ఉదయాన్నే!"

"మరి ఏడు గంటలకి రమ్మంటావా?"

"కాదుగాని ఎనిమిదింటికి తీసుకురా"

"సరే- పదో తేదీ ఉదయం ఎనిమిది గంటలకి రావాలని గఫూర్ దాదాకి చెబుతాను. ఇవాళ ఏడో తేదీకదూ..."

ఆనంద పారవశ్యంలో ఏమీ తోచలేదు రాముకి.

ఒకే మాటని తడబడుతూ అటూ

ఇటు చాలాన్నాళ్ళు అన్నాడు.

"ఇక ఆ రోజు నుండి ఒకరి కోసం మరొకరు అక్కడికీ, ఇక్కడికీ తిరగ వలసిన అవసరం వుండదు. ఎడబాటు లేని జంటగా కలకాలం జీవిద్దాం..."

అతను ఏదో చెబుతూనే వున్నాడు.

ఆమె క్రమేపి నిద్రలోకి జారుకుంది.

"పిచ్చిపిల్ల అలసిపోయినట్టుంది — నిద్ర లేచేసరికి ఆకలిగా వుంటుందేమో - ఏమైనా తయారు చేస్తే మంచిది."

ఆమె ముఖాన్ని అప్యాయంగా నిమురుతూ ఆమె కంఠం మీదుగా ఇంకా కిందికి తన చేతిని పోనిచ్చేడు. ఆ కనురెప్పలు తెరిస్తే అనంతాంబరపు నీలి నీడలు కనిపిస్తాయి.

నిద్రపోతున్న ఆ ముఖంలో అమాయకత్వాన్ని తొలిసారి చూసేడు.

ఒకప్పుడు తను కన్నెత్తి చూడడానికి భయపడే ఆ ముఖం ఇప్పుడు తన గుండెల్లో దాగుంది.

ఆమెనుండి ఆమడదూరంలో అతన్ని నిలబెట్టే ఆనాటి కవళికలు ఇప్పుడు మటుమాయమయ్యేయి.

ఆమె తన హృదయ ప్రాంగణంలో వెలసిన దేవతామూర్తి.

అతను ప్రేమాంజలి ఘటిస్తున్న భక్తుడు, ఆరాధనానురక్తుడు.

కుసుమ పేశలమైన ఆమె సుకుమార శరీరాన్ని తన మోటైన వేళ్ళతో స్పృశిస్తే ఆమెకు బాధకలుగుతుందేమో!

అందుకే తన చేతిని ఆమె నుండి తొలగించాలనుకున్నాడు.

కాని ఆమె కలత నిద్రలో ఉలిక్కిపడి ఒకసారి కదిలింది.

మూసిన కళ్ళు తెరవకుండానే అతని ఒంటికి మరింతగా అతుక్కుపోయింది.

తన రెండు చేతులూ అతని మెడ చుట్టూ వేసి అతన్ని కరచుకుపోయింది,

రాముా ఆనందంతో ఉక్కిరిబిక్కిరయ్యేడు.

"ఇక నేను విచారించవలసిన పని లేదు"

తప్పొప్పుల విచికిత్సకులోనై ఎవరికీ భయపడవలసిన అవసరమూ లేదు.

నేను నాటిన ప్రేమ విత్తు పెద్ద వట వృక్షమంత ఎదిగింది. నవవధువు నా ఇంట్లో వుంది.




తొమ్మిదో తేదీ సాయంత్రం.

రామూ హడావుడిగా డైసీ ఆఫీసుకి బయల్దేరేడు.

సెకిల్ మీద న్యూబ్లాక్స్ చేరుకుని మేడమీద కుటుంబనియంత్రణా కేంద్రంలో అడుగు పెట్టినవేళ డైసీ ముగ్గురు ఆడవాళ్ళతో సీరియస్‌గా చర్చిస్తోంది.

అతను వరండాలో కొద్దిసేపు నిలబడి వాళ్ళు బయటకు రాగానే గదిలోకి వెళ్ళేడు.

రామూ వచ్చిన అలికిడి కాగానే కళ్ళు పైకెత్తి చూసింది.

తమ ఇద్దరి మధ్య చనువు మరింతగా పెరిగినట్లనిపించి గత సాయంత్రపు మధురానుభూతులు ఆమెను వెంటాడుతూ వుంటాయని అనుకున్నాడు

కాని ఆమె ముఖంలో అటువంటి ఛాయలు ఎక్కడా కనిపించలేదు. తన కుర్చీలో ఆఫీసు హోదాలో కూర్చుందే తప్ప అతన్ని చూసి తన్మయురాలు కాలేదు.

ఎదురుగా కూర్చోమని మౌనంగా




సైగ చేసింది.

మాటా మంతీ లేని ఆ మౌనవర్తన అతనికి వింతగా తోచింది.

ఇప్పుడే ఆమెతో పరిచయం అయినట్లనిపించి, చాన్నాళ్ళ క్రితం మిత్రుడు వీరప్ప డైసీని తొలిసారి పరిచయం చేసిన సాయంత్రం గుర్తుకొచ్చింది.

అదే చూపు-అదే మాటల పిసినారితనం.

"దారంట పోతూ నిన్ను చూద్దామని వచ్చేను....మరేం లేదు. ఈ మేడ కింద ఫాన్సీ షాపువాళ్ళు బోర్డు రాసి పెట్టమంటే..."

"రాయడం పూర్తయిందా ?"

"ఓ ! ఆలస్యం చేయడం మంచిది కాదని బిల్లు కూడా వసూలు చేసేను. నీకు తెలుసుగా వ్యాపారంలో మొగమాటానికి వీల్లేదిహమీదట."

"నువ్వు ఇక్కడికొచ్చినప్పుడు ముగ్గురు ఆడవాళ్ళు నాతో మాట్లాడుతున్నారు; చూసేవు కదూ. వాళ్ళు నగరి నుండి వచ్చేరు" అంటూ ఒక పెద్ద ఛార్టు విప్పి టేబిల్ మీద పరిచింది.

"ఆ ప్రాంతంలో వుండేవాళ్ళంతా బుట్టలు, చాపలు అల్లుకొని బతికే వాళ్ళు— ఏజన్సీ ప్రాంతం కావడం వల్ల బొత్తిగా వెనకబడి వున్నారు" అని మరో చేత్తో రిపోర్టు అందుకొంది.

"అక్కడ పరిస్థితి చాలా దారుణంగా ఉంది. గత సంవత్సరం జనాభా కేవలం తొమ్మిది వందలు— ఏడాది తిరగనే లేదు పన్నెండు వందలు దాటిపోయింది అంటే ముప్ఫయి శాతం పెరుగుదల!"

"అంటే బోలెడన్ని శోభనాలు జరిగివుంటాయన్న మాట!" ఆమెలోని ఉద్రిక్తత సడలించాలని నవ్వుతూ అన్నాడు.

కాని డైసీ పట్టించుకోలేదు

"ఇది చాలా సీరియస్ మేటర్. వెంటనే చర్య తీసుకోకపోతే వచ్చే ఏటికి ఈ పెరుగుదల మరింత భయంకరంగా తయారు కావచ్చు. ఆ విషయం చెప్పి— నన్ను ఈ రోజు సాయంత్రవేఁ తీసుకు వెళ్ళాలని ఆడవాళ్ళు వచ్చేరు. ఈ రోజే వాళ్ళతో కలిసి వెళ్తున్నాను. స్వయంగా వెళ్ళి ఏం జరుగుతున్నదీ పరిశీలించాలి"

ఏం జరుగుతున్నది పరిశీలించడం అంటే— కొంప దీసి పడక గదుల్లోకి జొరబడి మొగుడూ పెళ్ళాల్ని బలవంతంగా విడదీస్తుందా ఏం?

"నన్ను కూడా నీతో పాటు రమ్మంటావా?" అని అడిగేడు.

"అక్కర్లేదు"

"మరి గోడల మీద రాసే పనిలేదా?"

"లేదు. అక్కడ నూటికి తొంభై తొమ్మిది పాళ్ళు నిరక్షరాస్యులే. రాతల కన్నా మరో పద్ధతి ఆలోచిస్తున్నాను. ముఖాముఖి కలుసుకుని బోధ పరచడం తప్ప వేరే దారి లేదు"

"అంటే ప్రతి ఒక్కరిని విడివిడిగా కలుసుకుని ప్రత్యేకంగా మాట్లాడుతావా?"

"అవును. వాళ్ళ మధ్య బతికినదాన్ని ఎలా బోధపరచాలో నాకు తెలుసు. వెంటనే ఓ మెడికల్ టీమ్ పంపమని రేపే ఢిల్లీకి రాస్తున్నాను" అని ఓ కాయితం మీద పెన్నుతో లెక్కలు వేసి—

"అన్ని గ్రామాల్లో కలుపుకొని మొత్తం ... ఊరికి సగటున నాలుగు వందలమందికి చొప్పున పన్నెండు గ్రామాల్లోని స్త్రీ పురుషులకి ఆపరేషన్లు చేయించాలి. ఆ లెక్కన జరిగితే నేను వేసుకున్న కనీసం అయిదువేలు

ఆపరేషన్స్ టార్గెట్ పూర్తవుతుంది. ఇది పూర్తయ్యాక మారుమూల కొండల్లో వున్న వలసలకు వెళ్ళాలి. అది నా రెండో ప్రణాళిక. త్వరలో ప్రాథమిక పరిశీలనకు వెళ్ళాలి. కాలి నడకన అడవులు, కొండలు దాటుకుని పోవాలి. దట్ విల్ బి ఎ ఛాలెంజింగ్ టాస్క్...."

ఆమె ఒళ్ళు మరిచి చెబుతున్నంతసేపూ అదోలా విన్నాడు. విని,

"ఇహ దీనికి అంతూ పొంతూ వుండదంటావా ?" అదోరకమైన వైరాగ్యాన్ని కళ్ళలో నింపుకొని అడిగేడు.

"లేనేలేదు. ఎలా వుంటుంది? ఇంకా ఇలాంటి గ్రామాలు దేశం నిండా లక్షల సంఖ్యలో వున్నాయి. రోజులో ఇరవై నాలుగ్గంటల్నీ ఈ పనికే కేటాయించినా నా జీవితకాలం సరిపోదు" అంటూ కాగితమ్మీద అంకెల్లోకి తల దూర్చింది.

'ఈ అంకెలు కాదుగాని ఆవిడ బుర్ర పూర్తిగా చెడిపోతోంది' అనుకున్నాడు. అనుకుని,

"ప్రపంచంలో వున్న కోట్లాది ప్రజల కోసం నువ్వొక్కర్తివే ఎంతకని బాధ పడతావు డైసీ!? ఎదుటివాళ్ళకి కొంచెం అవకాశం ఇయ్యకూడదూ ?" అన్నాడు.

"లేదు. ఆ 'ఎదుటివాళ్ళ' సహాయ సహకారాలు నేనెప్పుడూ కోరలేదు. వాళ్ళేం చేసినా, నాకవసరంలేదు. ఇతరులతో నిమిత్తం లేకుండా నా మట్టుకునేను పని చేసుకుని పోవడం నాకు మిషనరీ పెంపకంలో అలవడింది. మరో పద్ధతి నాకు తెలీదు" అంటూ డైరీ తెరచి ఏదో నోట్ చేసుకుంది.

"మరి నా సంగతేమిటి" అని అడిగేడు రామూ.

"నీ సంగతంటే!" డైరీలోంచి తలఎత్తి చూసింది.

"రేపు పదో తేదీ. ఉదయం ఎనిమిది గంటలకి గఫూర్ టాక్సీ తీసుకొని నీ ఇంటికి వస్తున్నాను" అన్నాడు.

ఓ క్షణం పాటు పెన్నుని నొసటమీద తాటిస్తూ–

"ఇప్పట్లో సాధ్యంకాదు" అంది.

అతని గుండెల్లో రాయిపడినట్లయింది.

నిటారుగా వున్న అతని వెన్నెముక విరిగి ఏ పూసకాపూస విడిపోయినట్లనిపించింది.

"ఏం? ఎందుకు కాదు??" తడారిన గొంతును పెగుల్చుకుంటూ అడిగేడు.

"ఎందుకు కాదంటే..." చల్లగా, తాపీగా చెబుతోంది.

తాను ఇంతగా తపిస్తున్నాడే ఆవిడకి చీమ కుట్టినట్లయినా లేదు. నిమ్మకు నీరెత్తినట్లు మాట్లాడుతోంది.

అతని గుండెల్లో అంతెత్తున సెగలు లేచేయి.

"నీకసలు హృదయం వుందా? అనుభూతులున్నాయా??" రామూ గట్టిగా అరిచేడు.

అతని అరుపు కింద అంతస్తుల్లో షాపుల్లోనికి, రోడ్డుమీద జనానికి వినిపించేటంత గట్టిగా వుంది.

డైసీ టేబిల్‌మీద పేపర్లు సర్ది ఓవేపు పెట్టి అతని వేపు చూసింది.

రామూ కళ్ళు ఎర్రగా వున్నాయి.

అమాంతం ఆవిడ రెండు భుజాలు పట్టుకుని ఒక్కసారి కుదిపేయాలని వుంది.

కాని అది ఆఫీసు కావడం వల్ల–ఆమె హోదాలోవున్న వ్యక్తి అవడం చేత ఆగిపోయేడు. అదీకాక ఇద్దరిమధ్యా టేబిల్ అడ్డం వుంది.

 

ఉద్రేకాన్ని అణచుకోలేక గట్టిగా కేకలు వెయ్యడం మొదలు పెట్టేడు.

"నేను... నేనేపిటి నీ మొగుణ్ణి. ముందుగా అనుకున్న ఒప్పందం ప్రకారం నా ఇంటికి రమ్మని పిలవడానికి వస్తే- మన ఇద్దరి మధ్యా ఎటువంటి అనుబంధం లేనట్లు, అసలు ఇదే మన తొలిపరిచయం అయినట్లు మాట్లాడతావా ? ఏమిటి నీ ధోరణి ? చెప్పు ఇప్పుడు నేనేం చెయ్యాలి?"

"నీ పని నీకు వుండనే వుంది. గో ఆన్ విత్ ఇట్. నేనెవ్వరినో నీకు తెలియక మునుపే నీకంటూ ఒక లోకం కూడా వుండేది. దానిలో మధురానుభూతులు నువ్వు నెమరు వేసుకోని రోజంటూ లేదు. ఇప్పుడు సమయం మించి పోలేదులే. తిరిగి ఆ లోకంలోకి వెళ్ళవచ్చు" అంది డైసీ.

"ఈ డొంక తిరుగుడు సమాధానాలు కట్టిపెట్టి సూటిగా చెప్పు. నా ఇంటికి ఎప్పుడు వస్తున్నావ్ ? అసలు వచ్చే ఉద్దేశం వుందా?" అరిచేడు. వెనువెంటనే తొందరపాటుకు విచారించేడు.

"ఇది ఆఫీసు. ఇక్కడ గట్టిగా అరవకు. నా కోసం వాళ్ళు ఏ క్షణాన్నైనా రావచ్చు. అనవసరంగా రచ్చకీడ్చి రభస చెయ్యాలని చూడకు"

"చూస్తాను. వాళ్ళని రమ్మను. మన ఇద్దరికీ పెళ్ళయిందని, గాంధర్వపద్ధతిలో చేసుకున్నామని చెప్తాను. నిన్న రాత్రి వరకూ ఒకరినొకరు పెనవేసుకుని ఒకే పక్క మీద పడుకున్నామని కూడా చెప్తాను... కాదంటావా ? మన కలయిక అబద్ధం అంటావా ??

"ఇవాళ నువ్వొక దీన జనోద్ధారకు రాలివై పోయేవు. నా అనుభూతుల పూల రెమ్మని అమానుషంగా నరికిపోతున్నావు. ఆగు. నన్ను గెంటాలని చూడకు. అలా చేసేవో నడిరోడ్డు మీద నలుగురినీ పోగు చేస్తాను. నీ ఆఫీసుముందే కేకలేస్తాను" ఆవేశంతో వూగిపోతూ, చేతులు విసురుతూ అన్నాడు.

"అదే నీ నిర్ణయం అయితే...నేను... నేనేపీ చెప్పలేను" అంది డైసీ.

ఓ క్షణం ఆలోచించి తన కుర్చీలోంచి లేచింది.

కుర్చీని కొద్దిగా వెనక్కి నెట్టి టేబిలు చుట్టూ తిరిగి అతను నిలబడిన చోటుకి వచ్చింది.

వచ్చి, అతని చేతిని అందుకుంది.

రామూ తన చేతిని వెనక్కి తీసుకుందామని అనుకున్నాడు. ఆమె తన దగ్గరగా రాగానే అత్తరు పరిమళం గుప్పుమంది. అతని నిర్ణయం సడలిపోయింది. పెంపుడు పావురం యజమాని చేతుల్లో ఒదిగిపోయినట్లు అతని అరచేయి ఆమె చేతుల మధ్య వుండిపోయింది.

"మరి నువ్వు ... నాతోనే వుండిపోతావా?" అని అడిగేడు.

"లేదు....మన ఇద్దరికీ ఇంతటితోసరి!"

"అలా అనకు డైసీ ; నీ దారికి అడ్డం రాను. నీ ఇష్టం వచ్చినట్టు జీవించు. గుడిసెలో బతుకుతావో, అదపుల్లోకే వెళ్ళతావో నీ ఇష్టం.

"నువ్వు ఏంతిన్నా,ఎలావున్నా కాళ్ళకు చెప్పులు లేకుండా నడిచినా నేను మాట్లాడను. నేను నీతోనే వుండాలి.

"ఎన్ని కష్టాలైనా భరిస్తాను కాని నీ వియోగాన్ని మాత్రం సహించలేను. నన్ను ఒంటరివాణ్ణి చేసి జీవితాన్ని ఎడారి చెయ్యకు. నాలో ఇసుక తుఫా

సులు రేపి నిర్దాక్షిణ్యంగా వెళ్ళిపోకు"
రాముా బతిమాలేడు.

కంట తడిపెట్టేడు.

కాని డైసీ మనసు కరగలేదు.

"లాభం లేదు— మన ఇద్దరికీ సరి" అని మళ్ళీ చెప్పింది.

అతను ఎంతలా ప్రాధేయపడినా ఆమె అదే జవాబు—మళ్ళీ మళ్ళీ మళ్ళీ చెప్ప డానికి సిద్ధంగా ఉంది. ఆ నిశ్చయానికి తిరుగులేదు.

"నా ఇంటికి రానే రావా?"

"నీ కోసం ప్రతి ఇటుక కళ్ళు చేసు కొని చూస్తున్నాయి.

నువ్వు వచ్చేదాకా ఆ తలుపులు తెరిచే వుంటాయి..."

"రాముా" అని పిలిచింది డైసీ.

అతను ఆగేడు.

"ఆవేశాలు మరిచిపోయి వాస్తవాన్ని ఆలోచిద్దాం. వైవాహిక జీవితానికి, నేను ఎంచుకున్న మార్గానికి పొంతన లేదు. నేను చాలాసార్లు ఆలోచించేను. ఎంత ప్రయత్నించినా నేను సమాధాన పడలేక పోతున్నాను. గృహిణిగా జీవించగల నమ్మకం నాకు కలగటం లేదు. మొదటి నుండీ నా ఆలోచనలు, ఆశ యాలు నన్ను ఈ రకంగా మలిచేయి. జోడు గుర్రాల స్వారీ నా వల్ల కాదు. ఒంటరిగా తప్ప మరో మనిషితో చేయి కలిపి జీవించ లేను... నన్ను మరిచిపో"

''నువ్వు మరి తిరిగి రానే రావా?కనీసం ఆ సంగతి ఆలోచిస్తానని మాట యివ్వు, నీ కోసం ఎదురు చూస్తూ వుంటాను" రుమాలుతో కళ్ళు ఒతుకుంటూ అన్నాడు రాముా.

డైసీ అతని చేతిని మెత్తగా నొక్కింది. నొక్కి,

"దయచేసి అలాంటి ఆశలు పెట్టు కోకు. ఈ రోజే బయల్దేరి వెళ్తున్నాను. తిరిగి మూడేళ్ళదాకా నాకు తీరిక చిక్కు తుందని అనుకోను.

"నీకు ముందే చెప్పేను. కనీసం అయిదువేల మంది స్త్రీ, పురుషుల్ని కలుసు కుని ఒప్పించవలసిన బాధ్యత నా మీద వుంది.

"అది పూర్తయిన తరువాత నన్ను మరోచోట నియమించవచ్చు. ఆఫ్రికా అడవుల్లోకైనా వెళ్ళడానికి నేను సిద్ధంగా వున్నాను. నాకు వ్యక్తిగతమైన అను భూతులు లేవు. నువ్వు కోరుకునే జీవితా నికి నేను తయారుగా లేను" అంది.

"తిరిగి ఈ ఆఫీసుకు రానే రావా?" జాలిగా అడిగేడు.

"బహుశ రాకపోవచ్చు. నా స్థానంలో మరొకరు వస్తారు. నీకు రావలసిన బాకీలు ఆ వ్యక్తి నుండి వసూలుచేసుకో. నీకు అప్పచెప్పిన పనులు నిరాటంకంగా కొన సాగించు......

"నా స్థానంలో రాబోయే వ్యక్తి సాధ్య మైనంత వరకు మగాడై వుండాలని హెడ్డా ఫీసుకు రాస్తున్నాను. దానివల్ల నీకు మరే ఇబ్బందులు వుండవు......

"దయచేసి ఆవేశాలకు తావు ఇవ్వకు. ఉద్వేగాలు మరిచిపోయి ప్రశాంతంగా ఆలోచించు. నన్నర్థం చేసుకో..."

నిన్న గాక మొన్న సాయంత్రం తన కౌగిట్లో నిద్రపోయిన డైసీయేనా ఈ మాటలు అంటున్నది?

"రాముా! వింటున్నావు కదూ? నీతో గడిపిన క్షణాలు నేను ఈ క్షణంలోనే మరిచిపోతున్నాను. నువ్వుకూడా అలా మరిచిపోడానికి ప్రయత్నించు"

అతనిలో తగ్గు ముఖం పట్టిన ఆవేశపు వెల్లువ మీద మళ్ళీ జల్లు కురిసింది.

"నువ్వు నా జీవితాన్ని చెల్లా చెదరు చేసిపోవటం లేదూ? నీ వల్లనే కదూ నా మేనత్త నాకు దూరం అయింది?"

"అలా పొరబడకు—ఓ విధంగా నా వల్ల ఆవిడకి మంచే జరిగింది. జీవితాంతం నీ చాకిరీలో బతుకు ఈడ్చేకన్నా— తను ఆశించిన వాతావరణంలో ప్రశాంతంగా గడుపుతోంది..."

"డెసీ" రామూ గొణిగేడు.

"ఏం"

అతనికి ఏమనాలో తెలియటంలేదు.

"ఇలా నన్ను వదిలిపోవడం న్యాయం కాదు" అని మాత్రం అనగలిగేడు.

ఆమె ఛార్టులు మడత పెడుతూ తలఎత్తి అతని కళ్ళల్లోకి సూటిగా చూసింది. చూసి,

"ధైర్యంగా వుండు రామూ! అనవసరంగా బాధపడకు. తగిన అమ్మాయిని చూసి పెళ్ళి చేసుకుని హాయిగా జీవించు.

ఏ అమ్మాయి అయినా నీతో పెళ్ళికి ఒప్పుకొంటుంది. ఒప్పుకోడం ఏమిటి నిను మనసారా ప్రేమించి కావాలని నీ వెంట వస్తుంది. అమ్మాయిలు కలల్లో వూహించుకునే అర్హతలు, అందచందాలు నీలో వున్నాయి..."

అలా అంటున్నప్పుడు ఆమె గొంతులో ఆవేశపు జీర తొలిసారి ధ్వనించింది. ఆమె కళ్ళల్లో నీరు చిమ్మడం, పెదవి దుఃఖంతో మెలిక తిరగడం అతను గమనించేడు.

అతని మనసు ఆర్ద్రమైపోయింది.

అనవసరంగా ఒత్తిడి తీసుకొచ్చి— ఆమె మనసును తీవ్రమైన వ్యథకు గురిచేస్తున్నాననిపించింది. అతనికి జాలివేసింది.

"అంత బాగా వున్నాననిపిస్తే నన్ను మరొకరికి ధారపోసి నువ్వెందుకు ఒంటరిగా పోతున్నావ్? అదెలా సాధ్యం? నిన్నెలా అర్థం చేసుకోమంటావ్ డెసీ!? ఇదంతా ఆలోచిస్తుంటే నాకు పిచ్చెక్కిపోతోంది.

ఆ రోజు నా ఇంట్లో చాపమీద పడుకొని నా కౌగిట్లో ఒదిగిపోయినప్పుడు ఏమన్నావ్?

పదోతేదీ నుండి నాతో గృహజీవితాన్ని గడపాలని నిశ్చయించుకోలేదా?"

"అవును. ఆ క్షణం అలా అనిపించింది. ఒక్కొక్కసారి మనం ఏం చేస్తున్నదీ, ఏం అంటున్నదీ మనకే తెలీదు రామూ.

నిద్రలో ఏవో మాట్లాడతాం. మెలకువ వచ్చేదాకా అవి నిజాలుగానే భ్రమపడతాం. మత్తు వదిలిన తర్వాత మనకేం అనిపిస్తుంది? ఇదీ అంతే"

ఆమె మాటలు తడబడ్డాయి. గొంతు వణికింది. "నిన్ను తప్పుదారి పట్టించేను... నన్ను క్షమించు"

జీవితంలో తొలిసారి తన ప్రవర్తన పట్ల విచారాన్ని వ్యక్తపరచింది.

కని పెంచిన తల్లి దండ్రులను వదలి, ఇంటితో తెగతెంపులు చేసుకున్ననాడు కూడా తను చేసినది తప్పనిగాని, తన ప్రవర్తనవల్ల ఎందరో బాధపడ్డారని డైసీ విచారించలేదు.

కాని రామూ మనసులో ఆశలు పూయించి — హఠాత్తుగా అతన్ని వదిలిపోతున్నందుకు చింతిస్తోంది !

"నిన్ను నువ్వు త్యాగం చేసుకోవాలని ఎందుకనుకుంటున్నావ్? ప్రేమాంకురాలు మొలకెత్తించి, అపారమైన అనురాగ

రాసుల్ని మోసులెత్తించగలిగే ఆర్ద్రత నీ హృదయంలో వున్నప్పుడు— దానిని మరుభూమిగా మార్చాలనే కర్కశమైన నిర్ణయాలు ఎందుకు తీసుకుంటున్నావ్?"

''నా జీవితం మరోలా వుండాలని నిర్దేశించబడింది కాబట్టి''

''ఎవరా నిర్దేశకులు? ఎందుకలా నిర్దేశించేరు??'' ఆమెను గుచ్చి గుచ్చి అడిగేడు.

డైసీ టేబుల్ సొరుగులోంచి మరి కొన్ని కాయితాలు తీసి సర్దుతోంది.



"జవాబు చెప్పవా?"

"క్షమించు. మరినేను చెప్పలేను. దయచేసి గతాన్ని గుర్తు చెయ్యకు. ఈ ఒక్క ఉపకారం చేసిపెట్టు. గత స్మృతులకు నాలో చోటులేదు. వాటిని పూర్తిగా చెరిపేసుకున్నాను"

"నువ్వలా చెయ్యగలవని, నీకు చేతనౌనని నాకు తెలుసు. కాని నిన్ను అంత సులభంగా మరిచిపోనివ్వను. అనుక్షణం నా జ్ఞాపకాలు నిన్ను గుచ్చి నీకు మనశ్శాంతి లేకుండా వెంటాడేలా చేస్తాను. ఇదిగో ప్రమాణం చేసి చెబుతున్నాను; ఆ ఆడవాళ్ళు రానీ— నా ప్రచారానికి వాళ్ళే ప్రథమ శ్రోతలు.''

''పూర్ ఫెలో...నీకు మతి చలిస్తోంది''

"కాదు చలించింది. దానికి నువ్వే కారణం. నాలో తెలివితేటల్ని, విచక్షణా జ్ఞానాన్ని చెల్లాచెదురు చేసి నన్ను అయోమయంగా తయారు చేసేవు.నువ్వు...''

మేడ మెట్లు ఎవరో ఎక్కుతున్న చప్పుడైంది.

రామూ ఆగిపోయాడు.

ముగ్గురు ఆడవాళ్ళు గదిలోకి వచ్చేరు.

"కారు సిద్ధంగా వుంది మేడమ్. మీ సామాన్లు డిక్కీలో భద్రంగా సర్దిపెట్టేం. ఇంటికి తాళం వేసి మీరు చెప్పిన ప్రకారం



తాళం చెవి ఇంటాయనకిచ్చి వచ్చేం'' ఒకావిడ ఆయాసపడుతూ చెప్పింది.

''ముగ్గురాడవాళ్ళూ దురదృష్టపు శకునాలు- త్రీ విచ్చెస్ ఆఫ్ మేక్‌బెత్. ముగ్గురూ ఒకేసారి కలిసొచ్చేరు. దుర్దినాలు మొదలయ్యేయి'' అనుకుని,

''ఎవరు వీళ్ళు?'' అని అసహనంగా అడిగేడు రాము. డైసీ వాళ్ళని పరిచయం చేసింది.

''ముగ్గురూ మూడు కేంద్రాల్లో పనిచేస్తున్నారు. ఎంతో చక్కగా కృషి చేస్తూ మంచి అభివృద్ధిని చూపిస్తున్నారు'' అంది.

''కాని నగర ప్రాంతంలో ఈ ఏడు ముప్ఫై శాతం పెరుగుదల కనిపిస్తోంది. దానికి సంజాయిషీ ఏమిటి?''అని అడిగేడు రామూ.

ముగ్గురాడవాళ్ళూ తలలు దించుకున్నారు.

''దానికి చాలా కారణాలున్నాయండీ! ఇప్పుడే ఏదీ తేల్చి చెప్పలేం'' అంది ఒకావిడ.

''దానిగురించి విచారణ జరిపి త్వరలో నివేదిక సమర్పించాలనుకుంటున్నాం'' రెండో ఆవిడ చెప్పింది.

''అలా మరోసారి జరగకుండా చర్యలు తీసుకోబోతున్నాం'' అంది డైసీ.

రామూ అడిగిన తీరుపట్ల మూడో ఆవిడ ఆశ్చర్యపోతూ ''ఎవరితను?'' అని డైసీని మెల్లగా అడిగింది.

''ఇతను...ఇ...''ఏదో చెప్పబోతూ తడబడింది డైసీ.

తనెవరో చెప్పాలని ఒక అడుగు ముందుకేసేడు రామూ. డైసీ అతన్ని కళ్ళతో బతిమాలింది.

ఆమె ముఖంలో రంగులు మారిపోయి విపరీతంగా చెమట పట్టేసింది.

''నేనొక పెయింటర్‌ని. అంతకన్న మరేంకాను'' అన్నాడు రామూ.

''చాలా మంచి ఆర్టిస్ట్. ప్రత్యేకించి అక్షరాలు అందగా రాయడంలో ఎక్స్‌పర్ట్. నాకు చాలా సహాయకారిగా వున్నారు'' అంది డైసీ.

''అసలు నిజంచెప్తే మీరు నమ్మలేరు'' అన్నాడు రామూ.

డైసీ ఆతని మాటలు వినబడకుండా వుండేలా గట్టిగా-

''అయ్యో కిటికీ రెక్కలు వెయ్యడం మరిచిపోయేను. మిస్టర్ రామూ దయచేసి నా కోసం వేసి పెట్టండి'' అంది.

రామూ కిటికీ రెక్కలు, బాల్కనీ వైపున్న ద్వారం తలుపులు మూసివేసి, డైసీ చేతిలోవున్న కాగితాల కట్టల్ని తను తీసుకొంటూ-

''వీటిని నన్ను మోయనివ్వండి మేడమ్'' అన్నాడు. ఆ సంబోధన ఆమెను కలవరపరిచింది.

ముగ్గురాడవాళ్ళూ టకటకమని మెట్లు దిగి వెళ్ళిపోయేరు.

ఆఫీసు గది తలుపులు మూసి తాళం వెయ్యాలని డైసీ ఆగింది.

రామూ ఈ అవకాశాన్ని వినియోగించుకోవాలనుకున్నాడు.

చేతిలో వున్న కాగితాల కట్టలని నేలమీద పెట్టి డైసీని అమాంతం గుండెలకు వాటేసుకుని-

''నిన్ను తప్ప మరొకర్ని ప్రేమించలేను. అర్థం అయిందా?నువ్వునా భార్యవి. నా ఇల్లు- కాదు మన ఇంటికి వచ్చేయ్. నీ కోసం ఎప్పుడూ సిద్ధంగా వుంచుతాను'' అన్నాడు.

''నన్ను వెళ్ళనీ''ఆమె గింజుకుంటోంది,

''అయ్యో పేపర్లు ఎగిరిపోతాయి'' అంది.

"ఫర్వాలేదు డార్లింగ్ నేను ఏరి పెడతాను. మరి నా దగ్గరకు వస్తావు కదూ?''

''సన్నాదులు. వాళ్ళు నా కోసం చూస్తూవుంటారు''

''మరి నాకు మాట ఇస్తావా? నా ఇంటికి వస్తావా? నేను ఎప్పటికీ నీవాడినే కదూ?''

ఆమె భయంతో వణికిపోతోంది.

అయినా ధైర్యం తెచ్చుకుని,

"నేను ఏమాటా ఇవ్వలేను. దయచేసి నన్ను వదులు'' అంది.

''నీ మనసు ఎప్పుడు మారినా సరే నా దగ్గర కొచ్చేయ్'' అని ఆమెను విడిచి పెట్టి కాగితాల్ని అందుకోడానికి వంగేడు.

''రామూ"అని పిలిచింది.

ఆ పిలుపు మబ్బు తెరల వెనుక సన్నని వెలుగు రేఖలా అనిపించింది. అతను లేచి నిలబడ్డాడు.

''దయచేసి ఈ తాళాల గుత్తి వాచ్ మేన్‌కి ఇవ్వు" అంటూ వాటిని అందిస్తూ అతని చేతిని తన చేతుల్లోకి తీసుకుని దానిని మృదువుగా నొక్కింది. తన గుండెలకు దగ్గరగా తెచ్చిముద్దు పెట్టుకొని, అతని చేతిని వదిలేసి గబగబా మెట్లు దిగి కిందికి వెళ్ళిపోయింది.

రామూ తన చేతి వంక చూసుకున్నాడు. రెండు కన్నీటి బొట్లు కనిపించేయి.

కాగితాల కట్టలతో అతను మెట్లుదిగేడు.

ముగ్గురాడవాళ్ళూ అప్పుడే కారులో కూర్చొనివున్నారు.

రామూ కారు తలుపు తెరిచి డైసీకి సీటు చూపించేడు.

ఆమె లోపల కూర్చున్న తరువాత కాగితాల కట్టలు అందించేడు.

"రెడీయేనా?" అంటూ కారు డ్రైవరు వెనక్కి తిరిగేడు.

"ఓహో గఫూర్ తా తా నువ్వేనా? ఎవరో అనుకున్నాను. రేపు నిన్ను పిలుద్దామని నా ప్లాను అసలు ...సరే- ఆడవాళ్ళని జాగ్రత్తగా తీసుకెళ్ళు ... చిన్నమాట! నాకిప్పుడేం చెయ్యాలని వుందో తెలుసా?"

"చెప్పు రామూ బేటా ఏంచెయ్యాలని వుంది?"

"నీ కారు చక్రాల్లో మేకులు దింపాలనివుంది-కారణం అడక్కు"

"ఫో బేటా ఎప్పుడూ అల్లరేనా?"

"అంతే-గుడ్ బై లేడీస్"

పాతకాలపు గఫూర్ తాత ఫవర్‌లెట్ కారు పెద్దగా చప్పుడు చేసుకుంటూ కదిలింది. ఆ ప్రాంతంలో పొగ నిండింది.

డైసీ విండో కర్టన్ వెనుక ముఖాన్ని చాటుచేసుకొంటోంది.రామూ చివరిసారిగా ఆమెను చూసేడు.

"మరో జన్మలో తప్పకుండా కలుసుకుందాం. అప్పటికైనా దేశోద్ధరణ మాని నన్ను ఉద్ధరిస్తావని ఆశిస్తున్నాను"

రామూ సైకిల్ తీసుకున్నాడు.

గఫూర్ తాత ఫవర్లెట్‌కారు ఫౌంటెన్‌ని ఓ చుట్టుచుట్టి న్యూ ఎక్స్‌టెన్షన్ మీదుగా కొండల వేపు సాగిపోతోంది.

చేతిలో వున్న తాళాలగుత్తిని కసితీరా విసిరికొట్టి రామూ సైకిల్ మీద బయల్దేరేడు.

తాళాల గుత్తి రివ్ రివ్ రివ్‌మని ఎగిరి నీళ్ళులేని ఫౌంటెన్‌లో పడింది.

అతని సైకిలు బోర్డులెస్ హోటల్ వేపు దారితీసింది!



# జోకొట్టే మాస్టర్లు

# చతుర

"బడికి వెళ్ళావా బాబూ ! బ రు లూ దిద్దావా? అ, ఆ లొచ్చాయా నీకు ఇ, ఈ లొచ్చాయా ?"

—అంటూ ప్రాణాలు తోడేస్తుంటారు మన పెద్దవాళ్ళు. స్కూల్లో ఏదైనా పొరపాటు చేస్తే బెత్తం పుచ్చుకుని మాష్టారు హాజరు. ఏ కాస్త కునికిపాటు పడుతున్నట్లు కనిపెట్టినా పేంబెత్తంతో వీపుమీద కథాకళి చేయించేస్తాడు. గోడ కుర్చీలు, తొడపాశాలు, మొట్టికాయల విందులు సరేసరి.

కానీ ఫ్రాన్సులో ఇందుకు పూర్తిగా విరుద్ధం. క్లాసులో పిల్లలు నిద్రపోవడం కూడా పాఠ్యాంశాల్లో ఒకటిగా భావిస్తారు వాళ్ళు. స్కూల్లో పిల్లలు నిద్రపోవడాన్ని వాళ్ళు ఎక్కువగా ప్రోత్సహిస్తారు. నిద్ర కోసం ప్రత్యేకించి ఓ పీరియడ్ వుంటుంది. ఈ టైంలో ఎటువంటి చప్పుళ్ళు లేకుండా పిల్లలు హాయిగా నిద్రపోయేలా చూస్తారు అధ్యాపకులు. నిద్రకు కేటాయించిన పీరియడ్‌లో గాక అంతకుముందే ఎవ్వరైనా ఆవలించినట్లుగానీ, కునికిపాటు పడినట్లుగానీ అనుమానం వస్తే చాలు వాళ్ళు జాగ్రత్తగా మంచి పడకవున్న గదిలోనికి తీసికెళ్ళి పడుకోబెట్టి నిద్రపుచ్చుతారు.

ఇందుకోసంగాను ప్రత్యేకంగా శిక్షణ ఇవ్వబడిన టీచర్లను పెడుతున్నారు. నిద్రపుచ్చడంలో వారికున్న నైపుణ్యం అంతా ఇంతా కాదు. ఎపుడు పిల్లవాడు నిద్రపోవాలనుకుంటాడో ఇట్టేచెప్పేయగల దిట్టలు. జోలపాటలు, లాలిపాటలుపాడుతూ మెల్లగా జోకొడుతూ పిల్లలు ప్రశాంతంగా, ఆనందంగా నిద్రపోయేలా చేస్తారు.

నిద్ర పిల్లలకి చాలాఅవసరం, ముఖ్యం అనీ, ఎంత ఎక్కువగా నిద్రపోతే అంత ఎక్కువగా తెలివితేటలు పెరుగుతాయనీ వారి అభిప్రాయం. మంచి నిద్ర పిల్లల్ని శారీరకంగాను, మానసికంగాను ఆరోగ్యవంతుల్ని చేస్తుంది. నిద్రపోయి లేచిన పిల్లలు ఫ్రెష్‌గా వుండడమే గాక వారి



మెదడు ఏపనిచేయడానికైనా సంసిద్ధంగా వుంటుంది. అటువంటపుడు ఎంతక్లిష్టమైన సబ్జెక్టును బోధించినా ఇట్టే అర్థం చేసుకుంటారు అని పిల్లల మనస్తత్వ నిపుణులు భావిస్తున్నారు. అలసటను, శ్రమను పోగొట్టడానికి నిద్రను మించిన దివ్యౌషధము మరొకటి లేదు.

స్కూల్లో నిద్రపోయిన పిల్లలు ఎన్నడూ మొహాలు వేలాడేసుకుని ఇంటికి రారు. పైగా ఎంతో చైతన్యవంతంగా, ఉత్సాహవంతంగా వుండి స్కూల్లో చెప్పిన పాఠాలు చదువుకుని, బుద్ధిగా హోంవర్కు

 

# ప్రపంచం

చేసుకుంటారు కూడా.

ఫ్రాన్సులో దాదాపు అరవై అయిదు వేలమంది పిల్లలు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకుంటున్నారు. బాలలూ ఫలో ఫ్రాన్స్!

## మ్యావ్.. మ్యావ్.. కిచ్

గత కొద్ది సంవత్సరాలుగా జంతు శాస్త్రజ్ఞులందరూ కలసి పక్షులు,జంతువులు చేసే రకరకాల శబ్దాలకు అర్థాలు వెతికే ప్రయత్నాలు చేశారు. చాలాకాలం పరిశోధనలు చేసిన తర్వాత వేరు వేరు ప్రాంతాల్లో వున్న ఒకే జాతి పక్షులు, జంతువులు ఒకదాని భాషను ఒకటి అర్థం చేసుకోలేవనీ, అందుకు ప్రాంతీయభేదమే కారణమనీ ఈ శాస్త్రజ్ఞులు తేల్చారు.

పశ్చిమ జర్మనీలోని బకుస్ ప్రయోగ శాలవారు ఓ విలక్షణమైన ప్రయోగాన్ని నిర్వహించారు.వివిధ ప్రాంతాలకు చెందిన ఒకే జాతి పక్షులను ఓ పెద్ద పంజరంలో వుంచారు.వారాల తరబడి ఒకే పంజరంలో వున్న ఆ పక్షులు ఏ మాత్రం స్నేహ భావం పెంపొందించుకోకపోవడం శాస్త్రజ్ఞులు గమనించారు. ఉచ్చారణలో చెప్పుకోదగ్గ తేడాలుండడం మూలంగా ఒకదానికొకటి అలవాటుపడకపోగా తరచూ కీచులాడుకునేవి.

అలాగే జంతువులు కూడా! ఏ దేశానికి, ఏ ప్రాంతానికి చెందిన జంతువులు ఆ ప్రాంతంలో తిరుగాడే తమ జాతివాటి భాషను మాత్రమే అర్థంచేసుకుంటాయి.

ఓసారి బి.బి.సి లండన్ దక్షిణా ఫికాకి చెందిన ఓ పిల్లిచేత కొన్ని ఆ శబ్దాలు పలికించి రికార్డుచేసి ప్రసారం చేశారు. ఆ పిల్లిని ఎక్కడనించి పట్టుకొచ్చారో ఆ ప్రాంతానికి చెందిన పిల్లులు మాత్రమే ఆ శబ్దాలకి ప్రతిస్పందించాయి. డాక్టరు హన్స్ హజ్ ఓ దశాబ్దంపాటు జలచరాల మీద పరిశోధనలు జరిపి చివరికి చేపల ఉచ్చారణను రికార్డు చేయగలిగాడు. ఇవి ఆకలి వేసినపుడు, శత్రువుల గురించి ఇతర చేపలకు హెచ్చరికలు చేసేటపుడు విలక్షణమైన శబ్దాలు చేస్తాయి. పశ్చిమ




ఆఫ్రికా, దక్షిణాసియా సముద్ర తీరాల్లో ఏర్పాటు చేసిన రికార్డింగ్ విధానం ద్వారా 'తలాబ్' అనే చేప గుడ్లు పెట్టేటపుడు గట్టిగా శబ్దం చేస్తుందని తెలుస్తోంది.

టర్కస్తాన్‌లోని కొనియావద్ద కొత్తగా పుట్టిన పిల్లి పిల్ల మీద తల్లిపిల్లి ప్రభావం పడకుండా విడిగా తీసుకొచ్చి ఓ ఐదేళ్ళపాటు మనుషుల్లా మాట్లాడ్డం నేర్పించారు. ఆ పిల్లి యజమానిని, పిల్లల్ని, వాళ్ళ పెంపుడు కుక్కని పేర్లతో పిలవడం

# మీ నెలసరి వాయిదా మొత్తాన్ని తగ్గించే ప్రత్యేకమైన వార్షిక రికరింగ్ డిపాజిట్ పథకం




కాలపరిమితి ఎక్కువగా ఉండే డిపాజిట్ పథకాలకు తట్టుకోలేక సతమతమయ్యేవారికి, అద్భుతమైన ఈ 12 నెలల పథకం మీ నెలసరి వాయిదా మొత్తాన్ని తక్కువచేసి ఉపశమనం కలిగిస్తుంది. మొదటి నెలలో మీరు రు. 60/- (ఇది కనీసడిపాజిట్) తో ఆరంభిస్తే, మీరు చెల్లించవలసిన వాయిదా మొత్తం ప్రతినెల రు. 5/- చొ॥న తగ్గుతుంది. మీరు చివరిసారిగా చెల్లించవలసినది రు. 5/- మాత్రమే. మీకు లభించే వడ్డీ కూడ ఎంతో ఆకర్షణీయంగా ఉన్నది - సం॥నకు 7 శాతము దిగువ ఇచ్చిన పట్టిక నుండి మీకు సులభంగాఉండే వాయిదా పథకాన్ని ఎంచుకోండి.

## 12 నెలలు ప్రతినెల మీరు చెల్లించవలసిన వాయిదా మొత్తం

| I రు. | II రు. | III రు. | IV రు. | V రు. | VI రు. | VII రు. | VIII రు. | IX రు. | X రు. | XI రు. | XII రు. | మొత్తం డిపాజిట్ రు. | పథకం చివరలో వార్షిక వడ్డీతో సహా లభించే మొత్తం రు. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 60 | 55 | 50 | 45 | 40 | 35 | 30 | 25 | 20 | 15 | 10 | 5 | 390 | 409 .30 |
| 65 | 60 | 55 | 50 | 45 | 40 | 35 | 30 | 25 | 20 | 15 | 10 | 450 | 471 .60 |
| 70 | 65 | 60 | 55 | 50 | 45 | 40 | 35 | 30 | 25 | 20 | 15 | 510 | 533 .95 |
| 75 | 70 | 65 | 60 | 55 | 50 | 45 | 40 | 35 | 30 | 25 | 20 | 570 | 596 .25 |
| 80 | 75 | 70 | 65 | 60 | 55 | 50 | 45 | 40 | 35 | 30 | 25 | 630 | 658.55 |
| 85 | 80 | 75 | 70 | 65 | 60 | 55 | 50 | 45 | 40 | 35 | 30 | 690 | 720.90 |
| 90 | 85 | 80 | 75 | 70 | 65 | 60 | 55 | 50 | 45 | 40 | 35 | 750 | 783.20 |
| 95 | 90 | 85 | 80 | 75 | 70 | 65 | 60 | 55 | 50 | 45 | 40 | 810 | 845.50 |
| 100 | 95 | 90 | 85 | 80 | 75 | 70 | 65 | 60 | 55 | 50 | 45 | 870 | 907.80 |



## స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్

హెడ్ ఆఫీసు, గన్‌ఫౌండ్రి, హైదరాబాద్-500 177.

Time & Space|847T

అలవాటు చేసుకుంది. పైగా ఆ కుక్కకీ, పిల్లికీ మధ్య శత్రుత్వ ఛాయ కూడా లేదు. ఫిలడల్ఫియాలో ఓ కుటుంబానికి చెందిన కుక్క ఇంటికి వచ్చిన అతిథుల తోను, ఇంట్లోవారితోను 'హలో! హౌఆర్ యు?, ఐ లవ్‌యూ, ఐయామ్ హంగ్రీ, ఐయామ్ సారీ, మొదలైనపదాలు కొందరు మనుషుల కంటే స్పష్టంగా పలుకుతుంది.

చింపాంజి చాలా తెలివైన జంతువు. అమెరికాకి చెందిన కీత్ అనే డాక్టరు దగ్గరున్న విక్కీ అనే చింపాంజీ మామ, పాపా, కమ్ అనే పదాలు మాట్లాడుతుంది. న్యూయార్క్‌లోని కొలంబియా విశ్వ విద్యాలయంలో రెండున్నర ఏళ్ళ వయ సున్న చింపాంజీకి 'కోడ్'లో మాట్లాడ్డం నేర్పించారు. 'నిమ్' అని పిలవబడే ఈ చింపాంజి దాదాపు ఏభై ఐదు కోడ్ పదాలను మాట్లాడుతుంది. అందుకే కొంతమంది నిపుణులు జంతువులు, పక్షులకు నేర్పేముందే ఆ కోడ్ భాషను మనుషులు నేర్చేసుకుంటే తర్వాత వాటితో భాషించడానికి ఏ ఇబ్బందీ వుండదనిఅభిప్రాయ పడుతున్నారు.

## గూఢచారి ప్రేమ

అందమైన మొహాన్ని చూసి అమాంతం ప్రేమించేసి తర్వాత చిక్కుల్లోపడ్డం అలవాటై పోయింది కుర్రకారుకి.

30ఏళ్ల రీనత్ లట్స్ పశ్చిమ జర్మనీలో ఒక ఉన్నత సైనికోద్యోగి దగ్గిర సెక్రటరీగా ఉండేది. ఆఫీసు వేళ దాటిపోయినప్పటికీ ఇంకా ఆఫీసులోనే పన్జేస్తుండేది. ఇంతకీ అవిడగారు చేసే రాచకార్యం ఏమిటయ్యా అంటే ముఖ్యమైన ఆఫీసు కాగితాల్ని ఫైళ్లలోంచి సంగ్రహించి వాటికి ఫొటోలు తీసి ఆ ఫొటోస్టాట్స్ తన భర్త లోథర్ కందజేసేది. అతడు తూర్పుజర్మనీ గూఢచారిగా ఉండేవాడు. అతని ద్వారా ఇలా ఎన్నో ముఖ్యమైన డాక్యుమెంట్లు తూర్పుజర్మనీ చేరిపోయేవి. వాటిల్లో నాటో కూటమి దేశాలకు చెందిన పెట్రోల్ పైప్ లైన్ మాప్ చాలా ముఖ్యమైంది. యుద్ధం జరిగినపుడు దాన్ని ధ్వంసం చేయడం వల్ల నాటో దేశాలకు బిలియన్ల డబ్బు ఖర్చయింది. ఇదంతా రీనత్ లట్స్‌వల్లే జరిగింది. దానికి కారణం



ఆమె గుడ్డిగా ప్రేమించిన లోథర్. తన ప్రేమ కోసం ఆఖరికి దేశానికి ద్రోహం చేయడానికి కూడా ఆ మహాతల్లి జంకలేదు. జెడా ఓస్టన్ రైడర్ అనే 32 ఏళ్ల లలనామణి కూడా సరిగ్గా ఇలాగే ప్రవర్తించింది. ఆమెకి పంథొమ్మిదేళ్ళ వయసప్పుడు దేశాన్ని మార్చాలని, విప్లవం తేవాలని కలలు కనేది. ఆ సమయంలో స్ట్రీటర్ అనే 36 ఏళ్ళ వ్యక్తి ఆమె జీవితంలో ప్రవేశించేడు. అతను

తూర్పు జర్మనీ గూఢచారి. అయితే తన ఆశయం కోసం అతన్నో చేతులు కలిపింది జెడా. ఎలాగో స్ట్రీటర్ పశ్చిమజర్మనీ విదేశాంగ శాఖ కార్యాలయములో ఉద్యోగం సంపాదించిపెట్టింది. సహజంగా చాకచాక్యంగల యువతి కనుక ఆఫీసులో త్వరలోనే ప్రాముఖ్యం సంపాదించింది. విదేశీ కార్యాలయాలకు పోయే రహస్య టెలిగ్రాముల నకళ్ళు తయారు చేసి ప్రియుడి కందించేది. అతను వాటిని తూర్పు జర్మనీ వేపు పోయే రైళ్ల బాత్ రూముల్లో దాచేవాడు. ఆ విధంగా చాలా కాలం నిరాటంకంగా వీళ్ళ కార్యకలాపాలు జరిగేయి. తూర్పుజర్మనీ కూడా జెడాని చాలా ప్రశంసించి బహుమతులిచ్చింది. కానీ ఆఖరికి జెడా స్ట్రీటర్ తనతో యీ కార్యాల కోసమే ప్రేమకలాపాలు కొనసాగించేవని తెలుసుకున్నాక అతడ్ని విడిచిపెట్టడానికి నిశ్చయించుకుని, పశ్చిమ జర్మనీ అధికారుల ముందు తన తప్పుని ఒప్పుకుంది. కానీ ఇంకా స్ట్రీటర్ పట్ల ఏ మూలో కాస్త ప్రేమ మిగిలి ఉండడం మూలాన అతన్ని అరెస్టు చేసే లోగా పారిపొమ్మని చెప్పింది. వెంటనే పారిపోయి తూర్పు జర్మనీలో తల దాచుకున్నాడు స్ట్రీటర్. ఆఖరికి ప్రేమించిన నేరానికి మూడేళ్ళ జైలుశిక్షనుభవించింది.

# ఆదర్శ అంధులు

కళ్ళున్నవాళ్ళు పనిచేయడానికే తల్లకిందులైపోతున్న ఈ రోజుల్లో గుడ్డివాళ్ళ చేతికి హలాల నిచ్చి పొలాలు దున్నిస్తోంది గుజరాత్ ప్రభుత్వం. గుజరాత్‌లోని పన్సా గ్రామంలో అంధుల కోసం ప్రత్యేకించిన టాటా వ్యవసాయ మరియు గ్రామీణ కేంద్రంలో గుడ్డివారికి రైతు శిక్షణ నిచ్చి పునరావాస సౌకర్యాలు కల్పిస్తున్నారు. ఆసియా మొత్తంలో ఇటువంటి సంస్థ ఇది ఒక్కటే. 20 ఏళ్ళ క్రిందట స్థాపించిన ఈ సంస్థ అంధుల కోసం ఎనలేని సేవ చేస్తూంది.

పన్సాలో ఈ కేంద్రానికి 250 ఎకరాల భూమి వుంది. ఈ కేంద్రం నుండి ఇప్పటి వరకు 300 మంది అంధ రైతులు శిక్షణ పూర్తి చేశారు. అభ్యర్థులను ఎన్నుకోవడం ఈ కేంద్రానికున్న ప్రధాన సమస్య. ఇందులో శిక్షణ పొందే అభ్యర్థి గ్రామ నివాసి, చదువు రానివాడు, 15–35 ఏళ్ళ మధ్య వయస్కుడు, అన్నింటికీ మించి కాస్తో కూస్తో భూమి ఉన్నవాడు అయి ఉండాలి. అందులోని నిజానిజాలు తెల్సుకుని పూర్తి అర్హతలున్నవారినే కేంద్రంలో చేర్చుకుంటారు. ఇదివరకు దేశంలోని అన్ని ప్రాంతాలవారినీ ఇందులో చేర్చుకునేవారు. కానీ వారి ఎన్నిక, వసతి సౌకర్యాలు కల్పించడం కష్టం కావడంతో తమ పరిధిని కేవలం



మహారాష్ట్ర, గుజరాత్ రాష్ట్రాలకు మాత్రమే పరిమితం చేసుకున్నారు.

కేంద్రంలో చేర్చుకున్న అభ్యర్థికి రెండు సంవత్సరాలు పూర్తి శిక్షణ నిస్తారు. ఒకేసారి 50 మంది విద్యార్థులను చేర్చుకుంటారు. ఆ రెండు సంవత్సరాల శిక్షణలో లాడ్జింగ్, బోర్డింగ్, ఇతర ప్రయాణ ఖర్చులు మొత్తం కేంద్రం భరిస్తుంది.

ప్రతి విద్యార్థి శిక్షణానంతరం తమ పొలాల్లో ఎవరి పని వారే చేసుకునేందుకు వీలుగా తోట పని, ఫీల్డ్ వర్క్, పాడి, కోళ్ళ పరిశ్రమ, షాపింగ్ మొదలైనవన్నీ పకడ్బందీగా నేర్పిస్తారు. స్పర్శమాత్రం చేత ఆవులు, గేదెలు ఏ జాతివో చెప్పగల గడం, పాలు తీయడం, పేడ సేకరించడం, గడ్డి మేపడం, పాలను మార్కెట్టుకు తీసికెళ్ళి విక్రయించడం, మామూలు 'వరి'కి, మొక్కలకి తేడా గుర్తించడం మొదలైనవన్నీ నేర్చుకుంటారు. పొలానికి నీరు పెట్టడం దగ్గిర్నుంచీ కలుపు తీయడం, ఎరువులు వెయడం వరకూ మామూలు రైతులకంటే వీరే మంచి నైపుణ్యం కలిగి వున్నారు. ఈ సంవత్సరం ఎకరానికి 2000 కిలోల ధాన్యాన్ని అంటే 200 బస్తాల్ని పండించి ఓ అంధ రైతు రికార్డు స్థాపించాడు.

కేంద్రం శిక్షణ పొందడంతో అభ్యర్థి పని పూర్తవదు. శిక్షణా కేంద్రం నుంచి బైటికి వచ్చాక అతను చాలా అడ్డంకుల్ని ఎదుర్కోవలసి వస్తుంది. అందుకని అతనితోబాటు కేంద్రంలోని పునరావాస శాఖ సభ్యులు అతనితో బాటు అతని గ్రామానికి వెళ్ళి అతనికున్న భూమిని తనిఖీ చేసి బావులు తవ్వించి, పంపు సెట్లు బిగించి, కావల్సిన పశువుల్ని కొనిచ్చి వ్యవసాయానికి కావల్సిన పరికరాలు, ఎరువులు సంపాదించి పెట్టడంతో అతనికి చేదోడువాదోడుగా వుంటారు. ఈ విధంగా ఒక్కొక్క అంధ రైతుకు పునరావాసం కల్పించేందుకు ఐదు నుండి ఏడు వేల రూపాయలు కేంద్ర పునరావాస శాఖ ఖర్చు పెట్టాల్సి వుంటుంది. ఈ ఖర్చును ఇంగ్లండు, పశ్చిమ జర్మనీలకు చెందిన రెండు అంతర్జాతీయ సంస్థలు భరించడానికి ముందుకు వచ్చాయి. దానా దీనా ఏడాదికి మొత్తం అభ్యర్థుల పునరావాస సౌకర్యాలకు మొత్తం రెండు నుండి రెండున్నర లక్షల దాకా వినియోగించవల్సి వస్తుంది.

ఈ కేంద్రంలో శిక్షణ పొందిన రామచంద్ర ఉద్ధర్ అనే అతను పాలు అమ్మే విద్యలో నైపుణ్యం సంపాదించాడు. ఇతను కేంద్ర పాడిపరిశ్రమ శాఖ నుండి పాలను సేకరించి పక్క పట్టణమైన 'వపి'కి తీసుకెళ్ళి అమ్ముతాడు. వపికి వెళ్ళడానికి రెండు బస్సులు మారాలి. నెలపొడుగునా క్రమం తప్పకుండా రెగ్యులర్ కష్టమర్స్ అందరికీ పాలు పోసి ఫస్టు తారీఖున అందరి దగ్గర్నుంచీ డబ్బు వసూలు చేస్తాడు ఒక్క పైసా కూడా తేడా రాకుండా.

అంధులు నగరాల్లో నెగ్గుకు రావడం చాలా కష్టం. అటువంటి వారు స్వతంత్రంగా గౌరవప్రదమైన జీవితం గడపడానికి టాటా ఎగ్రికల్చరల్ అండ్ రూరల్ సెంటర్ ఎంతో ఉపయోగపడుతుంది.

# ఆకులు ఎందుకు రాలిపోతాయి..?



అయిదేళ్ళ వయసులో 'అమ్మా! ఆకులు ఎందుకు రాలిపోతాయి?' అని ప్రశ్నించిందా అమ్మాయి... ఎనిమిదేళ్ళ వయసులో క్రీస్తును తలుచుకుని, 'అయ్యో! అంత బరువైన శిలువను అంత దూరం ఎలా మోయగలిగాడో గదా' అని కన్నీరు కార్చిందా అమ్మాయి... పదేళ్ళ వయసులో 'గులాబి మొగ్గ అంత అందంగా ఎలా వికసిస్తుందో గదా' అని ఆశ్చర్యపోయిందా అమ్మాయి.
ఆ అమ్మాయే ఇరవై రెండేళ్ళ వయసులో ఆకస్మికంగా వికసించి అంతలోనే వాడ ఎడిలి పోయింది...ముప్పయ్యేళ్ళ వయసులో ఆశలన్నీ ఆరి ఆకులా రాలిపోవటానికి సిద్ధమయిందామె... 'నేను మోస్తున్న శిలువ క్రీస్తు మోసిన దాని కన్నా బరువుగా ఉన్నట్లుంది' అని వాపోయిందామె... ఎవరామె...? అన్నీ ఉండి కూడా మూడు పదుల వయసులోనే పండుటాకులా ఎలా రాలిపోసాగింది...?

విశ్వకథా విపంచి 'విపుల' డిసెంబర్ సంచికలో మైథిలీ భాషా కథ ''అంజలి'' చదవండి. మిమ్మల్ని ఆకట్టుకునే ఆణిముత్యాల్లాంటి ఈ నెల 'విపుల'లోని అనేక కథలలో ఒకటి ఈ ''అంజలి''.

కథలుగాక మరెన్నో కార్టూన్లు జోకులు, విచిత్ర విశ్వవిజ్ఞానం అందజేస్తుంది 'విపుల'.





విశ్వ కథా విపంచి

## విపుల

132 పేజీలు: రెండు రూపాయలే

# మార్పుకోసం

మనం శలవుల్లో సర్దాగా వూరెళ్ళి వచ్చినట్లే ఆయా ఋతువుల్లో మార్పు కోసం పక్షులు ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతానికి వలస పోతుంటాయి. ముఖ్యంగా చలికాలంలో వెచ్చదనం కోసం వేల మైళ్ళ దూరం ప్రయాణిస్తాయి పక్షులు. కానీ చిన్నారి సీతాకోక చిలుకలు వెచ్చదనం కోసం అంతంత దూరం వెళ్ళడం విడ్డూరమే.

అమెరికా, కెనడా ఉత్తర తీర ప్రాంతాల్లో "మొనార్క్" జాతి రంగు రంగుల రెక్కల సీతాకోక చిలుకలు విస్తారంగా వున్నాయి. శీతాకాలంలో మంత్రం వేసినట్టు హఠాత్తుగా అన్నీ మాయమైపోతాయి. ఎక్కడికి వెళ్ళాయో ఎవరికీ తెలిసేది కాదు. మళ్ళీ కొన్నాళ్ళ తరువాత ఏవో కొన్ని మాత్రమే తిరిగి వచ్చేవి. డాక్టర్ ఉర్క్‌హార్ట్ దంపతులు గత నలభై సంవత్సరాలుగా వాటి అదృశ్యానికి కారణాలను వెతకడానికి ప్రయత్నిస్తూనే వున్నారు. పక్షులకి మల్లే వాటి కాళ్ళకి చీటీ కట్టి వాటిని అనుసరించడానికి వీల్లేదు. ఎందుకంటే వాటి రెక్కలు కాళ్ళు చాలా సున్నితంగా వుంటాయి. కానీ ఎలాగో ప్రయత్నించి అతి జాగ్రత్తగా వాటికి చీటీలను కట్టినాగాని వానకి చిట్టీలు నాని పూడ్డంవల్ల ఆ పద్ధతిని విరమించుకున్నారు డాక్టరు దంపతులు.

నీటిలో కరగని కొత్త రకం జిగురుతో దాదాపు 10 వేల సీతాకోక చిలుకలకు చీటీలు అంట బెట్టారు. ఆ తర్వాత మామూలుగా శీతాకాలంలో మాయమైపోయిన 'వాటి' కోసం వెతకడం ప్రారంభించారు. దక్షిణ దిక్కున సెంట్రల్ మెక్సికోలో తొమ్మిది వేల అడుగుల ఎత్తున్న పర్వతం మీద కనబడిన మొనార్క్ సీతాకోక చిలుకల్ని చూసి ఆశ్చర్యపోయారు. నవంబరు నెలలో లెక్కలేనన్ని మొనార్కులు ఇక్కడకు వచ్చి చేరుతాయి. "ఒయమల్" అనే బూడిద రంగు చెట్లన్నీ సీతాకోక చిలుకలతో నిండి శోభాయమానంగా వుంటాయి. నేలమీద గుంపులు గుంపులుగా పరుచుకున్న మొనార్కులను చూస్తుంటే కాశ్మీరు తివాసీ గుర్తుకు రాకమానదు. దాదాపు మూడు వేల ఐదు వందల కిలో మీటర్ల ప్రయాణం



చేసి వచ్చిన సీతాకోక చిలుకలు శీతాకాలమంతా అక్కడే వుండి వసంత కాలం మొదలవగానే ఈశాన్య దిశలో తిరుగు ముఖం పడతాయి. కానీ తిరుగు ప్రయాణంలో చాలా మొనార్కులు చచ్చిపోతాయి. గంటకి 15 నుండి 30 కిలో మీటర్ల వేగంతో తమ నాజూకు రెక్కలతో నాలుగు వేల కిలో మీటర్ల ప్రయాణం చేయడం అంటే మాటలు కాదు కదా !

CHATUR Telugu Monthly, Hyderabad-500 004, Regd No. H/HD/402